

# శంఖు మార్కు




## లుంగీలు
## చేతిగుడ్డలు



**మొహామదు అబూబకర్ & కంపెనీ**

238, తంబుచెట్టి వీధి, మద్రాసు - 600001.

బ్రాంచీలు కలకత్తా · మధురై · క్విలాన్ · బొంబాయి

షోరూములు: నాగూరు · బెంగళూరు

Aykan 325T






ముఖచిత్రం : యదుకుల కాంభోజి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# యువ

## దీపావళి ప్రత్యేక సంచిక

ఎప్పటివలె ఈ రౌద్రి నామ దీపావళికి వెలువడే ప్రత్యేక సంచికలో ప్రచురణార్థం రచయితలు, రచయిత్రులు, కార్టూనిస్టులు తమ తమ రచనలను, కార్టూన్లను మా కార్యాలయానికి సెప్టెంబర్ 5వ తేదీలోగా పంపగోర్తాము క్రింది అంశాలను గమనించ ప్రార్థన

1. రచన ఫుల్‌స్కేప్ సైజులో 10 పేజీలకు మించరాదు

2 కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయాలి

3 కవరుమీద "దీపావళి సంచిక కోసం" అని వ్రాయాలి

4 ప్రచురణకు అంగీకరించబడని వాటిని తిప్పి పంపగోరేవారు తగు పోస్టేజి గల స్వంత చిరునామా వున్న కవరును జతపర్చి పంపాలి రచనతో పాటు స్టాంపులు జతపరచని యెడల రచనలను తిప్పి పంపటం సాధ్యం కాదు

5 రచన తమ స్వంతమేననీ, దేనికీ అనుకరణ అనువాదం కాదనీ హామీ పత్రం వ్రాయాలి

6 దీపావళి సంచికకోసం పంపినా, స్థలాభావం వల్ల అందులో ప్రచురించబడకపోతే, తరువాత సంచికలలో ప్రచురించే హక్కు మాకుంది

– సంపాదకుడు

యువ

# దాసరి నారాయణరావు

కృష్ణంరాజు సమర్పించు  జయకృష్ణా మూవీస్

# సీతా రాముల

నిర్మాత: జయకృష్ణ



లక్ష్మీ ఫిలిం




జననం
**5-8-1908**

సంస్మరణ

మరణం
**24-9-1975**

# శ్రద్ధాంజలి



శ్రీ పర్వతనేని బ్రహ్మయ్య

**జననం 2, అక్టోబరు 1908** **మరణం 20, జులై 1980**



రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి జూలై 14వ తారీఖున విమానాశ్రయంలో దిగినప్పుడు వారికి స్వాగతం యిచ్చిన దృశ్యము.

---

ఆంధ్రప్రదేశ్ పౌర సంబంధాల సమావేశానికి పురపాలక, సమాచార పౌర సంబంధాల మంత్రి శ్రీమతి సరోజిని పుల్లారెడ్డి ఆ సందర్భంగా వెలువరించిన ఒక ప్రచురణను ఆవిష్కరించారు. ఆంధ్రప్రదేశ్ విధానపరిషత్ తాత్కాలిక అధ్యక్షులు శ్రీ కె. కేశవరావు ఆ సందర్భంగా ఉపన్యసించారు





జూలై 18వ తేదీనాడు ఎడ్వర్టైజింగ్ ఎండ్ విజువల్ పబ్లిసిటీ వారు నిర్వ
హించిన "మన మందరము ఒకటే" ప్రదర్శనను కళాభవన్‌లో గవర్నర్
శ్రీ కె సి అబ్రహాం జ్యోతి వెలిగించి ప్రారంభించారు



భారత జపాన్ మైత్రి సంస్థ జూలై 18వ తేదీనాడు సమావేశ సందర్భంలో పౌర
సంబంధ శాఖమంత్రి శ్రీమతి సరోజిని పుల్లారెడ్డి ఆ సంఘ సభ్యులను ఉద్దేశించి
ప్రసంగించారు. జపాన్ కౌన్సిల్ జనరల్‌ను కూడా ఈ చిత్రంలో చూడొచ్చు.



జూలై 20 తేదీనాడు పత్రికా విలేకరుల భవనంలో సురవరం ప్రతాపరెడ్డి హాలును ఆర్థిక మంత్రి శ్రీ రాజారాంగారు ప్రారంభం చేశారు



జూలై 21వ తేదీన జూబిలీ హాలులో వెనకబడిన తరగతుల కార్పొరేషన్ వారి సమావేశంలో మంత్రి శ్రీరాములు నాయుడు ప్రసంగించిన దృశ్యము



హైద్రాబాద్‌లో జూలై 22వ తేదీన అధికార భాషా కమీషన్ అధ్యక్షుడు శ్రీ వందే మాతరం రామచంద్రరావు భాషా ప్రవీణులతో చర్చలు జరిపారు. ఆ సందర్భంలో లాండ్ రెవిన్యూ కమీషనర్ బి సుందరేషన్, ఆస్థానకవి డా. దాశరధి పౌరసంబంధ శాఖ డైరెక్టర్ వి వి మాణిక్యాలరావు కమీషన్ సెక్రటరీ టి. రామక్రిష్ణారావు సమావేశంలో పాల్గొన్నారు

---

హైదరాబాదులో చిత్ర పరిశ్రమ, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు వృద్ధి చేయుటకై హైదరాబాదు ఫిల్ము అండ్ కల్చరల్ సర్కిలును ఏర్పాటు చేసారు. ఈ సంస్థను జూలై 14న కేంద్ర సమాచార శాఖామంత్రిణి శ్రీమతి రామ్ దులారీ సిన్హా ప్రారంభోత్సవం చేశారు. ఈ సంస్థ అధ్యక్షుడు శ్రీ టి సుబ్బరామిరెడ్డి






రంగారావు టిఫిన్ పూర్తి చేశాడు. కోమలి యింకా కాఫీ తీసుకురాలేదు. టీపాయ్‌మీది పేపరు తిరిగెయ్యసాగేడు.

"డాడీ! టాటా!" రాజు, వాగిని చెప్పి, స్కూల్‌కి వెళ్ళిపోయారు.

"ఇదిగో కాఫీ!"

కోమలి కాఫీ యిచ్చి వెళ్ళిపోలేదు. అక్కడే నిలబడి వుంది. రంగారావు గమనించనట్లే కాఫీ త్రాగసాగేడు.

"రేపు నా పుట్టినరోజు" చెప్పింది.

సినిమాల్లోలా 'హాపీ బర్త్‌డే టూ యూ' అని రాగం తీయలేదు రంగారావు. కోమలికేసి సీరియస్‌గా చూశాడు.

పెళ్లయిన కొత్తలో యిదేమాట పనస తొనలా వుండేది పుష్కరం దాటింది కనుక ఆ మాట ఇప్పుడు పంచదార తక్కువైన పాయసంలా వుంది. రెండు రెళ్ళు నాలుగని ఎంత టక్కున తెలుస్తుందో, పుట్టినరోజనగానే క్లాత్ షో రూంకి పరుగెత్తాలని రంగారావుకి తెల్సిపోయింది.

రంగారావు గుర్రుమన్నాడు గాణిగాడు గర్జించాడు.

"ఇంకా సంక్రాంతి వెళ్లి పదిరోజులు కాలేదు. అప్పుడుకొన్న చీర కట్టుకో!"

"పుట్టిన రోజు నాడు పాతదా?"

"నీ పుట్టినరోజింత ఘనమైనది కాదు. పుట్టి ఎవర్ని వుద్ధరించావ్!"

"మిమ్మల్ని పెళ్లిచేసున్నాను కదా!"

"లేకపోతే నాకు పెళ్లికాదా?"

సంభాషణ సమరంలోకి దిగింది. చివర్న కోమలి 'చీర ఎలా కొనరో చూస్తాను?' మెజారిటీ వున్న సియంలా సవాల్‌చేసింది.

రంగారావుది పుస్తకాల వ్యాపారం. లాభాలు పెరగడంతో బీదుపు ఎక్కువయిపోతోంది పెళ్లాం ఏదిచెప్పినా దుబారాక్రిందే కనిపిస్తోంది.

రంగారావు సిటీబస్‌కోసం స్టాప్‌లో వించున్నాడు. అక్కడో విచిత్రం జరిగింది. ఆ వూళ్లో బస్సులు స్టాప్స్‌లో ఆగవు పడుస్తుండగానే ఎక్కాలి. రంగారావు పరుగెత్తినా ఎక్కలేక పోయాడు. ఎర్రటి పర్సు అతడి కాళ్ల ముందు పడివుంది.

ఎవరిదో సనుకుంటూ పర్స్ పరిశీలించాడు. కొత్త యాభైనోటుంది. అడ్రస్ స్లిప్ లేదు. పోగొట్టుకున్న దురదృష్టవంతుడి పైసానుభూతి కలిగింది. ఎవరయిన వచ్చి అడుగుతారని అరగంట చూశాడు ఎవరూ రాలేదు. పుస్తకాల షాపుకి వెళ్లిపోయాడు.

రంగారావుకి కొన్ని సెంటిమెంట్సున్నాయి. అన్యాయం అచ్చిరాదని నమ్ముతాడు. షాపుకి చేరుకోగానే కొత్త ఆలోచన వచ్చింది.

రంగారావు యాభైనోటు భగవద్గీతలో పెట్టాడు. ఇది కొన్నవారికి ఈ లక్ష్మి వరిస్తుంది."

రోజూలా కాకుండా రంగారావు పుస్తకాలు కొనడానికి వచ్చిన వార్ని థ్రిల్లింగ్‌గా చూస్తున్నాడు. నవల్లు, మ్యాగ్‌జైన్లు కొనేవారేకాని. భగద్గీత ఎవరూ అడగడంలేదు

మూడున్నరకి ఓ ముసలాయన గీత కావాలని వచ్చాడు రంగారావు యాభైనోటువున్న పుస్తకం చూపించాడు. 'యాభై నీదే' అనుకున్నాడు. కాని కృష్ణుడి బొమ్మ సరిగ్గాలేదని, ఆ పుస్తకం వద్దని మరోటి కొనుక్కున్నాడు. 'బ్యాడ్‌లక్' రంగారావనుకున్నాడు.

చీకటిపడిన తర్వాత పదేళ్ల కుర్రాడు భగవద్గీత కావాలని వచ్చాడు. రంగారావు రెండుమూడు రకాల పుస్తకాలు చూపించాడు అదృష్టం. కుర్రాడు యాభైనోటు వున్న గీత తీసుకున్నాడు.

"లక్కీఫెలో" అనుకున్నాడు.

తొమ్మిదింటికి భోజనానికి కూర్చున్నాడు. కోమలి కొత్తచీర చూపిస్తూ "ఎలావుందండీ?" అంది.

"ఎక్కడిది?" అనుమానంగా అడిగాడు




"మధ్యాహ్నం మన ప్రక్కయింటి బాబాయిగారు గీతకావాలని వచ్చి వెళ్ళారు. మీరు మధ్యాహ్నం భోజనానికి రాలేదాయె. సాయంత్రం బాబాయిగారు మళ్ళీ వచ్చారు. అప్పుడు కనకమ్మగారి తమ్ముని కొడుకుకిచ్చి మనకొట్టుకు పంపించాను. వాడు తెచ్చిన పుస్తకంలో యాభై నోటుంది. వాడు పెట్టి మరచి పోయాడని అడిగాను. వాడిదికాదన్నాడు. మీరు పెట్టించి వుంటారని చీరకొనేసుకున్నాను. మీకు ప్రథమ కోపమేగాని పుట్టినరోజుకి చీరకొనకుండా వుంటారా?"

కోమలి ఓరగా దోరగా నవ్వింది.

"అదృష్టవంతుణ్ని చెరపలేరు ఎవ్వరూ!" రంగారావు తర్కించుకున్నాడు.

కోమలి కోరికతీరింది.

---

వచ్చే సంచికలో పూర్తి నవల

## మంచు మంట

రచయిత్రి: కాకాని కమల

# "ఫ్రమ్ హియర్ టు ఎటర్నిటీ"

గోదావరి ఎక్స్‌ప్రెస్ ఏలూరులో ఐదు నిముషాలు విశ్రాంతి తీసుకొని మళ్ళీ బయలుదేరింది. రైలు అవుటర్ సిగ్నల్ దాటి క్రమేపి వేగాన్ని పుంజుకొంది. ఇళ్ళు, చెట్లు, ఎలక్ట్రిక్ స్తంభాలు వెనక్కి పరిగెడుతుంటే రైలు ముందుకి పరిగెడుతుంది.

రజనీకాంత్ కిటికీలోంచి బయటకి చూస్తున్నాడు. మధ్యమధ్యలో ఎదుటి సీట్లో కూర్చున్న అమ్మాయికేసి కూడా చూస్తున్నాడు.

ఆ అమ్మాయి కిటికీకి తలఆనించి ఆకాశంకేసే చూస్తోంది. రాజమండ్రిలో ఎక్కినప్పటినుంచి ఈ ప్రపంచంతో తనకేమీ సంబంధం లేనట్లు యించుమించు అదే భంగిమలో కూర్చుని ఉందామె. గాలికి ఆమె నుదుటిమీద ముంగురులు చెల్లాచెదురుగా కదులాడుతున్నాయి. విశాలమైన పెద్ద పెద్ద కళ్ళు, ఎత్తైన కనురెప్పలు, పొడవైన ముక్కు, సున్నితంగా పలుచగా ఉన్న పెదవులు ఆమె గుండ్రటి మొహానికి వింత శోభ నిస్తున్నాయి.

ఎంత అందంగా ఉంది? అనుకోకుండా ఉండలేకపోయాడు రజనీకాంత్.

"టికెట్ ప్లీజ్?"

రజనీకాంత్ జేబులోంచి టికెట్ తీసి చూపించాడు. టి.సి టికెట్ అందుకుని వెనకా, ముందు ఒకమాటు త్రిప్పిచూసి సంతకంచేసి తిరిగి యిచ్చేశాడు.

"టికెట్ ప్లీజ్?" ఆమె దగ్గర ఆగాడు టి. సి.

.... .... .... .... .... .... ....

"ఏమండీ మిమ్మల్నే" విసుగ్గా అన్నాడు.

"ఆఁ...." ఉలిక్కిపడింది.

"టికెట్టూ, టికెట్ కొనలేదండీ ట్రెయిన్ కదుల్తుంటే తొందరలో ఎక్కేశాను"

"మంచిపని చేశావు. (సంబోధన మీరులోంచి నువ్వులోకి మారిపోయింది.) ఫైన్‌తో సహా కట్టాల్సి ఉంటుంది ఏ ఊళ్ళో ఎక్కావు?" కటువుగా అన్నాడు టి సి.

"రాజమండ్రిలో ఎక్కాను. కానీ.... కానీ నాదగ్గర ప్రస్తుతం డబ్బేమీ లేదండి," విస్పహాయంగా ఉంది ఆమె గొంతు

---

వంక సరస్వతి

"పైకి చూస్తే చదువుకున్న వాళ్ళల్లా నటిస్తారు. నీలాంటి వాళ్ళని చాలా మందినే చూశాను. నెక్స్ట్‌స్టేషన్‌లో దిగిపో." ఖచ్చితంగా చెప్పి ముందుకి కదలబోయాడు.

"ఆగండి?" అది రజనీకాంత్ గొంతు.

"ఆ అమ్మాయి ఫైన్‌తో కలిపి ఎంత కట్టాల్సి ఉంటుంది?"

"ఈ అమ్మాయి మీ తాలూకా?" అనుమానంగా అన్నాడు టి.సి.

"కాదు. మాకు తెలిసిన వాళ్ళమ్మాయి."

"మరిందాకటినుంచీ ఏం చేస్తున్నారు సార్?" చిరాకు స్పష్టంగా వ్యక్తమైంది టి.సి. గొంతులో.

"ఆమె దగ్గర టికెట్ ఉందనుకున్నాను. యింతకీ ఎంతైందో చెప్తే?"..... అంటూ పర్సు తీశాడు.

"హైద్రాబాద్ దాకా రాసివ్వండి." అన్నాడు డబ్బు టి.సి. చేతిలో పెడుతూ. —ఆ అమ్మాయి ఏ ఊరు వెళ్తోందీ తనకి తెలియదు. చెప్పే ప్రయత్నంలో లేదు. తను వెళ్ళేదెలాగూ హైద్రాబాదే. అంతగా కావాలంటే మధ్యలో ఎక్కడైనా దిగుతుందనే ఉద్దేశ్యంతో ఆమెకూడా హైద్రాబాద్‌దాకా యివ్వమన్నాడు.

రజనీకాంత్ యిచ్చిన యాభై రూపాయల నోటు తీసుకుని, రసీదు రెండుం పావలా చిల్లర అతనిచేతిలో పెట్టి వెళ్ళిపోయాడు టి.సి.

అంతవరకూ అవమాన భారంతో తలవంచుకుని నిలబడిఉన్న ఆమె చిటుక్కున రెండుచేతులతో నమస్కరిస్తూ "చాలా థ్యాంక్సండీ." అంది కృతజ్ఞతా భావంతో రజనీకాంత్ కేసి చూస్తూ.

"దట్సాల్‌రైట్. దానికేముంది. కూర్చోండి. యిందాకట్నుంచీ నిలబడే ఉన్నారు." అంటూ తనుకూడా కూర్చున్నాడు.

రెండు నిముషాల అనంతరం మెల్లంగా అంది "మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియటంలేదు."

"మీలా విషయం గురించి యిక మర్చిపోండి. బైదిబై నాపేరు రజనీకాంత్. వృత్తి డాక్టర్ని. మరి మీ పేరేమిటో తెల్సుకోవచ్చా?"

"శశిరేఖ. స్కూల్ ఫైనల్ పాసయ్యాను." ఆమె సమాధానం మృదువుగా ఉంది.

"పేరులాగే మనిషి కూడా చాలా బావుంది" అనుకున్నాడు రజనీకాంత్.

ఇద్దరి మధ్యా కొన్ని నిముషాలు నిశ్శబ్దం.... ...

ఉన్నట్టుంది అన్నాడు రజనీకాంత్. "మీరు ఏ ఊర్లో దిగుతారు? హైద్రాబాదేనా?"

"ఊఁ...." అందామె

"అక్కడ మీ బంధువు లెవరైనా ఉన్నారా?"

"నాకు 'నా' అన్నవాళ్ళే లేరు. యిక బంధువు లెవరుంటారు?" విరక్తిగా అంది.

"ఓ! సారీ. అయితే మరి ఒంటరిగా వెళ్ళి ఏం చేద్దామనుకుంటున్నారు?"

ఏదైనా ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నాను.

ఆమె అమాయకత్వానికి అతనికి నవ్వువచ్చింది. ఈ రోజుల్లో ఉద్యోగం దొరకటం అంత తేలికా? పెద్ద పెద్ద డిగ్రీలున్న వాళ్ళకే ఉద్యోగాలు లేవు. స్కూలు ఫైనల్ పాసయిన ఈ అమ్మాయికి ఏం ఉద్యోగం వస్తుంది?

"చూడండి మీరు హైద్రాబాద్ రావటం యిదే మొదటి సారనుకుంటాను. మీరనుకున్నట్లుగా ఉద్యోగం దొరకటానికి చాలా టైం పడుతుంది. తెలియని ఊళ్ళో తెలిసిన వారెవరూ లేకుండా ఒంటరిగా బ్రతకటం చాలా ప్రమాదం. మీకు అక్కడి వాతావరణం అలవాటయ్యే వరకు మా యింట్లో ఉండవచ్చు. మీకు సహాయంగా మా అమ్మగారు, చెల్లెలు ఉంటారు."

ఏమంటారు? అన్నట్లు చూశాడు శశిరేఖకేసి

"ఈ రోజుల్లో మీలాంటి మంచి మనుషులుండటం చాలా అరుదు" అంటూ ఆమె నమస్కరించబోయింది.

"ఆగండాగండి .... .... మీకు రోజూ గుడికి వెళ్ళే అలవాటుందా?"

"ఏం?" ఆశ్చర్యంగా చూసింది శశిరేఖ.

"అహ్. అస్తమానూ నమస్కారాలు పెడ్తుంటేనూ!"

"ఓ! ఇదా." అతనితో పాటు ఆమె కూడా నవ్వింది

మరో పావుగంట కబుర్లు చెప్పుకుని వాళ్ళకి కేటాయించిన బెర్తులమీద పడుకున్నారు,

* * *

గోదావరి ఎక్స్‌ప్రెస్ నాంపల్లి స్టేషన్‌లో ఆగింది.

శశిరేఖ, రజనీకాంత్ మెల్లిగా జనాన్ని తప్పించుకుంటూ బయటకి నడిచారు. వాళ్ళు స్టేషన్ బయటకి వచ్చారో లేదో రిక్షావాళ్ళు, టాక్సీలవాళ్ళు చుట్టుముట్టేశారు.

అందర్నీ తప్పించుకుంటూ కొంచెం ప్రక్కగా పార్క్ చేసిఉన్న 'యింపాల' కారు దగ్గరికి నడిచాడు రజనీకాంత్.

శశిరేఖ అతన్ననుసరించింది.

డ్రైవర్ గోపాల్ కారు వెనక డోరు తెరచి పట్టుకున్నాడు. రజనీకాంత్, శశిరేఖ వెనక సీట్లో కూర్చున్నారు.

కార్ రివ్వున బంజారాహిల్స్ వైపు దూసుకుపోయింది.

అర్ధనగ్న సుందరీమణులతో నిండిఉన్న పెద్ద పెద్ద సినిమా వాల్ పోస్టర్లనీ, ట్రాఫిక్‌నీ ఆశ్చర్యంగా చూస్తూ కూర్చుంది రేఖ.

మరో పదిహేను నిముషాలలో ఒక పెద్ద బంగళా ముందు ఆగింది కారు.

"యిదేనా మీ యిల్లు?" అంది శశిరేఖ.

"ఏం బావులేదా?" కొంటెగా అన్నాడు రజనీకాంత్.

"అహ! బావుండకేం? చాలా బావుంది. మీది యింత పెద్ద బంగళా అనుకోలేదు"

చిన్నగా నవ్వుతూ కారు దిగాడు రజనీకాంత్.

అతను డబ్బున్నవాడు అయి ఉండవచ్చు ననుకుంది కానీ, యింత ధనవంతుడని అనుకోలేదు తాను. ఒక్క క్షణం తన యిల్లు కళ్ళముందు మెదిలింది శశిరేఖకి. ఊడిపోయే కప్పు, రెండు యిరుకు గదులు. నడవటానికి రెండు కాళ్ళు మాత్రమే పట్టే సందు ఒక్క మాటలో చెప్పాలంటే ఇక్కడ పోర్టికో అంత లేదు తన యిల్లంతా కలిపి.

"నేల కతుక్కుపోయినట్లు యిక్కడే నుంచున్నారు? లోపలికి రారా ఏమిటి?" అంటున్న రజనీకాంత్‌ని చూసి ఉలిక్కిపడింది శశిరేఖ.

"రండి వెడదాం" అంటూ ఆమె చేతిలోని రేకుపెట్టె అందుకోబోయాడు.

ఊహూఁ వద్దు వద్దు అని లాక్కుంది శశిరేఖ.

అతని వెనకాలే బిక్కుబిక్కు మంటూ డ్రాయింగ్‌రూమ్‌లో కడుగు పెట్టింది. గుండ్రంగా వేసిన కుషన్ సోఫాలు, మధ్యలో వేసిన రెండు టీపాయ్‌లు, హాలుకి ఒకప్రక్క అందంగా అమర్చిన ఫ్లవర్‌వాజ్. పైగదులకి వెళ్ళటానికి రెండు ప్రక్కలనుంచీ మెట్లు. నేల కనపడకుండా అందమైన కార్పెట్ సినిమా సెట్టింగ్‌లా ఉన్న డ్రాయింగ్‌రూమ్‌ని నోటమాట రానిదానిలా చూస్తూ నుంచుంది శశిరేఖ.

అప్పుడే డ్రాయింగ్‌రూమ్‌లోకి వాబోతున్న ఒక పద్నాలుగేళ్ళ అమ్మాయి

రజనీకాంత్‌ని చూసి "అమ్మా, అమ్మా అన్నయ్యొచ్చాడే" అంటూ మళ్ళీ వెనక్కి పరిగెట్టింది.

"శశిరేఖా, ఆ అమ్మాయే మా చెల్లెలు. కొద్ది సేపట్లో మా అమ్మగార్నికూడా చూపిస్తాను. ఆవిడ ఈ టైములో పూజ గదిలో ఉంటారు. మీరు అంతవరకు కూర్చోండి. నేనిప్పుడే ఐదు నిముషాల్లో వస్తాను" అని లోపలికి వెళ్ళిపోయాడు రజనీకాంత్.

శశిరేఖకి చాలా అలసటగా ఉంది. కూర్చోవా లనిపించింది. సోఫాకేసి, తన బట్టలకేసి చూసుకుంది. దుమ్ము కొట్టుకుపోయిన చీర, నల్లగా మాసిపోయిన తెల్ల జాకెట్టు

ఆమె చుట్టూ చూసింది. కానీ తన లాంటిది కూర్చోవడానికి తగిన ఆసనమేదీ ఆమెకి కనిపించలేదు. కనీసం చేతిలో పెట్టె కింద పెడదామన్నా, దాని దుమ్ము కార్పెటికి అంటుకుంటుందేమోనని భయపడింది. చేతిలో తువ్వాలుతో మొహం తుడుచుకుంటూ వచ్చిన రజనీకాంత్, తను వెళ్ళినపుడెలా నుంచుందో, అలాగే నుంచున్న శశిరేఖని చూసి ఆశ్చర్యపోయాడు.

"బాప్‌రే మీరు చాలా మొహమాటస్తుల్లా ఉన్నారు. రండి, మీ గది చూపిస్తాను." అంటూ చనువుగా ఆమె చేతిలో పెట్టె అందుకున్నాడు ఈసారి ఆమె వద్దని వారించలేదు. అప్పటికే పెట్టెను మోసినందుకు ఆమె చెయ్యి కందిపోయి ఉంది.

అతను మేడమీదకి నడిచి ఒక గదిముందర ఆగాడు. "ఇదే మీగది" అంటూ అతను తలుపుతీసి లోపలికి నడిచాడు. కిటికీ తెరవగానే చల్లటి గాలీ, వెలుతురు గదంతా పరుచుకున్నాయి. గదిలో ఓ ప్రక్క తెల్లటి దుప్పటి పరిచిన మంచం, దాని ప్రక్కనే డ్రెస్సింగ్ టేబుల్ ఉన్నాయి.

అతను బాత్రూమ్ చూపించి, "మీరు మొహం కడుక్కోండి. నేను కాఫీ, టిఫిన్ పంపిస్తాను" అని వెళ్ళిపోయాడు.

శశిరేఖ స్నానం చేసి వచ్చేసరికి కాఫీ టిఫిన్ సిద్ధంగా ఉన్నాయి టిపాయ్ మీద. నిన్నంత భోజనం లేదేమో ఆమె గబగబ పూర్తిచేసింది. వెంటనే ఆమెకి నిద్ర కూడా ముంచుకొచ్చింది ప్రయాణం బడలికవల్ల.

.... ... .... . . .... .... .... .... ....

ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్న ఆమెని చేత్తో తట్టి లేపాడు రజనీకాంత్. "శశిరేఖా లేవండి మనం హైద్రాబాద్ వచ్చేశాం దిగిపోవాలి" అంటూ.

ఉలిక్కిపడి లేచిన శశిరేఖకి మొదట తానెక్కడుందో తెలియలేదు.

"అలా చూస్తున్నారేమిటి? క్రిందికి దిగండి. యింకొక ఐదు నిముషాల్లో హైద్రాబాద్ వచ్చేస్తుంది. ఈ ఒక్క పెట్టె మీది" అని అతనంటుంటే అప్పటికి గానీ తాము యింకా రైల్లోనే ఉన్నామని, అతని కారు, బంగళా అంతా కలేనని గానీ అర్థంకాలేదు.

ఆమె క్రిందికి దిగి టాయిలెట్‌లోకి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చింది. రజనీకాంత్ దిగటానికి రెడీగా తలుపు దగ్గర నిలబడి ఉన్నాడు. ఇంతలో రైలు ఫ్లాట్‌ఫారం మీద ఆగింది. రైల్వే ఎనౌన్స్‌మెంట్, కూలీల హడావిడి, కాఫీ-టీలవాళ్ళ అరుపులు, దిగే జనంతో గందరగోళంగా తయారైంది ఫ్లాట్ ఫారమ్.

అందర్నీ తప్పించుకుని బయటపడ్డారు శశిరేఖ, రజనీకాంత్. రజనీకాంత్ ఒక రిక్షాని పిలిచి అశోక్‌నగర్‌కి బేరం ఆడాడు. ఇద్దరూ ఎక్కి కూర్చున్నాక తరువాత 'ఫలానా' యిల్లు అని యింటిగుర్తు చెప్పి పోనీయమన్నాడు.

అక్కడక్కడ రోడ్డు మీద గతుకులొచ్చినప్పుడు శశిరేఖ వెచ్చవెచ్చగా తగుల్తుంటే అతనికి చాలా థ్రిల్లింగా ఉంది.

ఆమె మాత్రం అదేం పట్టనట్లు ఇకముందు సిటీ చూడటం కుదరదేమో అన్నట్లుగా వచ్చేపోయే వాహనాలని, పరిసరాలని ఆత్రంగా, వింతగా చూస్తోంది.

రిక్షా మెయిన్ రోడ్డు మీద నుంచి రెండు విశాలంగా ఉన్న సందులు కూడా తిరిగి ఒక డాబా యింటి ముందు ఆగింది.

రిక్షా వాడు రెండు పెట్టెలు గేటు తీసి గుమ్మం ముందర పెట్టాడు. గేటు లోపల ఖాళీ స్థలం విశాలంగానే ఉంది. దాని కిరుప్రక్కలా వరుసగా చామంతులు, బంతిపూలు, గులాబీలు, మరువం కుండీలు — ఎన్. సి. సి విద్యార్థుల్లా, లైనుగా పేర్చబడి ఉన్నాయి. గేటు కెడమచేతి వైపు గదిలాంటిదేదో ఉంది. దాని ముందర మల్లె పందిరి, ప్రహరీ గోడ వెనుకొని రంగురంగుల కాగితం పూలచెట్టు దాని ప్రక్కనే పార్క్ చేసిన స్కూటర్ ఉన్నాయి.

తన కలలో బంగళాలా కాకపోయినా, మొత్తం మీద యిది కూడా బాగానే ఉంది అనుకుంది శశిరేఖ.

రజనీకాంత్ రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేసి, గేటు వేసి లోపలికి వచ్చాడు.

"ఇదే మా యిల్లు ఎలా ఉంది?" అంటూ కాలింగ్ బెల్ నొక్కాడు.

"ఇల్లుకేం చాలా బావుంది. అదీ...." అంటూ విడిగా ఉన్న గదికేసి చూపిస్తూ ఏదో అడగబోయేంతలో తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా నిద్రకళ్ళతో



పదహారేళ్ళ అమ్మాయి నిలుచుని ఉంది. రజనీకాంత్‌కి చీరకడితే ఎలా ఉంటాడో ఆ అమ్మాయి అచ్చం అలాగే ఉంది. రజనీకాంత్ లాగే ఆకర్షణీయమైన విగ్రహం అనుకుంది శశిరేఖ.

ఈ కొత్తమనిషి ఎవరా అని ఆశ్చర్యపోతూ, వాళ్ళు లోపలికి రావటానికి దారి యిస్తూ ప్రక్కకి తొలగి నిలబడింది. ఆ అమ్మాయి.

"దీని పేరు రేవతి మా ..............."

"మీ చెల్లెలు." పూర్తి చేసింది శశిరేఖ.

"కరెక్ట్" అన్నాడు నవ్వుతూ.

తను కూర్చుంటూ, శశిరేఖ వైపుకి, మరో కుర్చీ జరిపాడు కూర్చోమన్నట్లుగా.

"అమ్మేం చేస్తోంది?" అన్నాడు రేవతి నుద్దేశించి.

"కాఫీ పెడుతున్నట్లుగా ఉంది." అంటూ వంటిల్లోకి వెళ్ళింది రేవతి. ఎవరో కొత్తమ్మాయి వచ్చిందన్న వార్త తల్లి చెవిన వెయ్యటానికి. కూతురు చెప్పిన సంగతి విని, తడి చేతులు కొంగుకి తుడుచుకుంటూ "వచ్చావా రజనీ" అంటూ ముందు గదిలోకి వచ్చింది శాంతమ్మ.

"ఈవిడ మా అమ్మగారు" పరిచయం చేశాడు శశిరేఖకి.

"నమస్కారమండీ" వినయంగా అంది శశిరేఖ.

ఆవిడ నమస్కారం అందుకున్నట్లుగా తలపంకించి రజనీకాంత్ కేసి చూస్తూ మొన్ననగా వస్తానన్నావు. చెల్లాయి నీ కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తోంది. ప్రయాణం బాగా జరిగిందా? అత్తయ్య, మామయ్య కులాసాగా ఉన్నారా?" అంటూ ఏవేవో ప్రశ్నలు వేస్తోంది. రజనీకాంత్ వాటికి సమాధానం చెప్తున్నాడు.

కానీ ఆవిడ దృష్టి కొడుకు చెప్పే జవాబుల మీద లేదు. అందంగా ఉన్న శశిరేఖని, అందునా ఒంటిగా వెళ్ళి జంటగా వచ్చిన కొడుకుని చూస్తోంటే ఏదో భయం ఆవరించుకుంది ఆమె మనస్సుని.

మరి కాసేపటికి 'ఇదిగోనమ్మా నీ కోడలు. నీకు చెప్పకుండా చేసుకున్నందుకు క్షమించు' అంటాడేమోనని ఆవిడ గుండెలు పీచు పీచు మంటున్నాయి. – అవును. ఈ రోజుల్లో యిలా ఎందరు చేయట్లేదు? నవమాసాలు మోసి, కష్టపడి కని, పెంచి పెద్దజేసిన తల్లి వాళ్ళకా క్షణంలో గుర్తురాదు. 'ఏ దాన్నో తీసుకొచ్చి, యిదే నీ కోడలు 'నీ కిష్టమైతే మాతో ఉండు లేకపోతేలేదు అంటూ రెక్కలు వచ్చిన పక్షుల్లాగా విదిలించికుని వెళ్ళిపోయే కొడుకుల్ని చాలా మందిని తను చూసింది. తన కొడుకు కూడా వాళ్ళ కతీతుడు కాదేమో?

"అమ్మా!".... అది మూడోసారి రజనీకాంత్ పిలవటం.

"ఊ...." అంది శాంతమ్మ నీరసంగా.

"ఈ అమ్మాయి.... అంటూ ఓ మాటు శశిరేఖ కేసి చూశాడు. శశిరేఖ అతని మొహం లోకి చూసి తల దించుకొంది.

అదిగో చెప్పేస్తున్నాడు. అంతా అయిపోయింది. అయితే తన అంచనా [illegible]... కొడుకు చెప్పే విషయం తను భరించ లేనిదైనా వినాలి తప్పదు.

చెవులప్పగించి రజనీకాంత్ కేసి ఆత్రంగా చూస్తోంది శాంతమ్మ.

"ఈ అమ్మాయి నా స్నేహితుడి చెల్లెలు. ఈ ఊళ్ళో ఏదైనా ఉద్యోగం చెయ్యాలని వచ్చింది. కొన్నాళ్ళు మనింట్లో ఉంటుంది." అన్నాడు రజనీకాంత్.

ఆ మాటలకి శాంతమ్మగారి చెవిలో అమృతం పోసినట్లైంది.

"రామ్మా" అంటూ శశిరేఖని ఆప్యాయంగా లోపలికి తీసుకెళ్ళింది. ఆవిడ యిచ్చిన కాఫీ తాగి, స్నానం అదీ పూర్తిచేసింది శశిరేఖ. పదకొండు అయ్యేసరికల్లా ఆవిడ వేడి వేడి అన్నం కంచాల్లో వడ్డించింది. ఆవిడ కొసరి కొసరి తినిపిస్తూంటే, తన వాళ్ళు జ్ఞాపకంవచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి శశిరేఖకి.

అయినా తప్పదు. తను గుండె రాయి చేసుకోవాలి అనుకుంది.

* * *

శశిరేఖ హైదరాబాద్ వచ్చి యిరవై రోజులై పోయింది. ఆ కొద్ది కాలంలోనే రేవతి మంచి స్నేహితురాలై పోయిందామెకి.

పొద్దున్నే లేచి స్నానం, పూజ పూర్తి చేసుకొని శాంతమ్మగారికి పనిలో సహాయం చెయ్యటం, మధ్యాహ్నం అంతా ఏవో నవల్సు చదవటం, సాయంత్రం అయ్యేసరికి రజనీకాంత్ తోటి, రేవతి తోటి కబుర్లు చెపుతూ కాలక్షేపంతో రోజులు గడిచిపోతున్నాయి ఆమెకి.

హైదరాబాద్ నీళ్ళు పడ్డాయో, లేక శాంతమ్మగారి ఆదరణ ఎక్కువయ్యోగానీ శశిరేఖ మరింత రంగు, వళ్ళు వచ్చి నిగారింపుతో మిల మిల మెరిసిపోతోంది.

ఆ రోజు శనివారం.

మధ్యాహ్నం భోజనాలయ్యాక శాంతమ్మగారు ప్రత్తి డబ్బా దగ్గర పెట్టుకుని వంటింటి గడప దగ్గర కూర్చుని వత్తులు చేస్తోంది.

అంతవరకు ఆవిడ దగ్గరే కూర్చున్న శశిరేఖ నిద్ర వస్తోంటే లోపలికి వెళ్ళి పడుకొంది.

శశిరేఖ వెళ్ళిన పావుగంటకి పక్కింటి హనుమాయమ్మగారు వచ్చి కూర్చుంది. శాంతమ్మగారి చేతిలో ప్రత్తి తీసుకుని తను కూడా వత్తులు చెయ్యటం మొదలుపెట్టింది

ఆవిడ చాలా కాలంగా శాంతమ్మగారికి ఏకైక స్నేహితురాలు. ఒకే గూటి పక్షులన్నీ ఓ చోట చేరతాయన్నట్లు, భర్తలను కోల్పోయిన వారిద్దరూ మంచి స్నేహితులైపోయారు వారిద్దరిదీ ఎంత స్నేహమంటే–ఒకర్నొకరు 'నువ్వు' అనే సంబోధించుకుంటారు. ఒక రకంగా హనుమాయమ్మగారంటే శాంతమ్మకి

చాలా సానుభూతి. ఆవిడకి ఏకైక కొడుకు రామం. అతను ఒక గుజరాతీ అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు. ఆ అమ్మాయి హనుమాయమ్మ గార్ని లెఖ్ఖ చెయ్యదు సరిగదా, ఈవిడ అలవాట్లని, పద్ధతుల్ని ఏహ్య భావంతో చూస్తుంది. పాపం హనుమాయమ్మగారికి, కోడలికి, మనవలకి తెలుగు రాకపోవడం వల్ల మాట్లాడుకోవడానికి కూడా ఎవరూ లేరు. వాళ్ళకి ఒకళ్ళ భాష ఒకళ్ళకి అర్థంకాదు. తెలుగొచ్చిన కొడుక్కి తల్లితో మాట్లాడే తీరి కుండదు. అయినా మరో గత్యంతరం లేక ఆవిడ కొడుకు దగ్గరే పడుంటోంది అందుకని ఆవిడ ప్రతిరోజూ శాంతమ్మగారి దగ్గర వచ్చి కూర్చుని కష్టసుఖాలు చెప్పుకుంటూ ఉంటుంది.

రోజూలాగా ఆ రోజు కూడా కోడలి మీద చెప్పటం అయ్యాక మెల్లిగా అంది. "ఆ పిల్ల పడుకుందేమిటి?"

"ఏ పిల్ల?" అంది శాంతమ్మగారు చప్పున అర్థంకాక.

"అదే మీ బంధువుల అమ్మాయి ఎవరో అన్నావు కదా"

"బంధువులమ్మాయి కాదు. మా రజనీ స్నేహితుడి చెల్లెలు"

"ఏదో లే. ఎప్పుడు వెడుతుంది? ఉద్యోగం ఏదన్నా దొరికిందటనా?"

"ఇంకా లేదు."

"అన్నట్టు శాంతమ్మొదినా. ఆ పిల్ల ఎప్పుడూ బొట్టు పెట్టుకోదేం?"

'లా' పాయింటులా ఆరా తీసింది హనుమాయమ్మ

"ఫ్యాషనేమో." అంది శాంతమ్మ.

"ఫ్యాషనా? మొద్దులా? మొగుడుగానీ పోయాడేమో."

"ఛ. అవేం మాటలొదినా? అభం శుభం ఎరగని పిల్ల. ఈ రోజుల్లో ఆడ పిల్లలు ఏం చేసినా అది ఫ్యాషనే అవుతుంది.

తలలో పువ్వులకు బదులు ఆకులు, కొమ్మలు పెట్టుకున్నా, అవసరమైన చోట మానేసి మిగతా చోట్ల బట్ట కట్టుకున్నా అదో ఫ్యాషన్ అనుకోవాలి. ఆ మాటకొస్తే మా రేవతి అసలు గాజులే వేసుకోదు. దీనికేమంటావు? అన్నట్లు చూసింది హనుమాయమ్మ వైపు

"అవుననుకో. అయినా బొట్టు ఆడపిల్లకి ముఖ్యం కదా అని అడిగాను." అంది నొచ్చుకుంటున్నట్టు.

ఇంకో అరగంట కూర్చుని లోకాభి రామాయణం మాట్లాడి వెళ్ళిపోయిం దావిడ.

* * *

సాయంత్రం ఐదింటికి లేచింది శశిరేఖ.

యాంత్రికంగా శాంతమ్మగారికి పనుల్లో సహాయం చేస్తోంది. ఆమె మనసు మధ్యాహ్నం హనుమాయమ్మ అన్న మాటల గురించే ఆలోచిస్తోంది. అవును ఆవిడ తనకి కర్తవ్యాన్ని గుర్తు చేసింది. వీళ్ళ ఆదరణలో పడి తన సంగతి తాను మర్చిపోయింది. ఎన్నాళ్ళని తనని ఊరికే పోషిస్తారు వీళ్ళు? ఏదో ఒక రోజున వీళ్ళకే విసుగొస్తుంది అప్పుడు పొమ్మని వాళ్ళచేత చెప్పించుకునే కంటే, ఈ లోగానే తన దారేదో తను చూసుకుని వెళ్ళిపోవటం మంచిది.

ఈ రోజు ఏమైనాసరే రజనీకాంతని ఉద్యోగం గురించి అడగాలి అనుకుంది. ఆ రోజంతా ఆమె మూడీగానే ఉంది. రేవతితో కూడా సరిగ్గా మాట్లాడలేక పోయింది.

—పైకి ఎంత నవ్వుతూ తిరిగినా, మనిషికి ఓ గతమంటూ ఉంటే, దాని తాలూకు స్మృతులు మనసులోంచి చెరిగిపోవు. లోలోపల మనిషిని బాధిస్తూనే ఉంటాయి.

రేవతి కాలేజీ కబుర్లు చెప్పి ఎంత నవ్వించినా, ఆమె మాత్రం మనసులోని బాధనంతా రాత్రి కన్నీటి రూపంలో తలగడకే చెప్పుకుంది. రజనీకాంత్ హాస్పిటల్ నుంచి లేటుగా రావటంవల్ల, ఉద్యోగం గురించి మాట్లాడటానికి ఆ రోజు వీలుపడలేదు.

రాత్రి చాలాసేపు ఏడిచిందేమో, మర్నాడు శశిరేఖ లేచేటప్పటికి చాలా పొద్దుపోయింది. ఆమె లేచేసరికి రజనీకాంత్ హాస్పిటల్‌కి వెళ్ళిపోయాడు. ఇవ్వాళ సాయంత్రమైనా మాట్లాడాలి అనుకుంది.

ఆదివారం కదా అని రేవతి స్నేహితులతో కలిసి సినిమాకి, శాంతమ్మగారు పురాణం వినటానికి గుడికి వెళ్ళిపోయారు.

సాయంత్రం అవుతుండగా వచ్చాడు రజనీకాంత్. అతనికి టీ యిచ్చి తను కూడా తీసుకుంది శశిరేఖ. రజనీకాంత్ రెండు కుర్చీలు తీసుకెళ్ళి మల్లెపందిరి క్రింద వేసి తను కూర్చున్నాడు.

శశిరేఖ ఖాళీ కప్పులు లోపల పెట్టి వచ్చి, అతని ఎదురుగా మరో కుర్చీలో కూర్చుంది

"శశిరేఖా మీకిక్కడ ఏ యిబ్బందీలేదు కదా. నాకు తీరికలేక మిమ్మల్ని అడగటం మర్చేపోయాను."

"యిబ్బందంటూ ఉంటే, నావల్ల మీకే ఉండాలి. అయినా యిలా ఎన్నాళ్ళు మీకు బరువుగా ఉండమంటారు? నాకేదైనా ఉద్యోగం చూపిస్తే? ...."

ఆమె మాట పూర్తికాకుండానే "నేను ప్రయత్నం చేస్తూనే ఉన్నాను శశిరేఖా నాకు తెల్సిన యిద్దరు ఆఫీసర్లని కలిశాను. ఏదైనా టైపిస్ట్ ఉద్యోగం దొరుకుతుందేమోనని. వాళ్ళు తప్పకుండా సహాయం చేస్తామన్నారు. కానీ కాండిడేట్ తప్పనిసరిగా గ్రాడ్యుయేట్ అయి ఉండాలని అన్నారు అందుకే వాటి గురించి నీకు చెప్పలేదు."

అతను వెంటనే 'సారీ' అన్నాడు.

"పోనీలెండి. దొరక్కపోతే మీరేం చేస్తారు?" అంది శశిరేఖ.

"దానికోసం కాదు. పొరపాటుగా మిమ్మల్ని ఏకవచనంతో సంబోధించాను."

పరవాల్లేదు. అసలు నేనే మీకు చెప్పాలనుకుంటున్నాను. మీరు అంటూ పిలవద్దని పేరు పెట్టి పిలవండి చాలు. అయినా నేను మీకంటే చిన్నదాన్ని కూడా." అంది.

ఆ మాటలు అతనికి చాలా ఆనందాన్ని కలుగజేశాయి. ఆమె తనకెంతో దగ్గరి దానిలా అనిపించసాగింది.

అతను చటుక్కున లేచి ఒక గులాబీపువ్వు కోసుకొచ్చాడు. శశిరేఖ అతని కేసి ఆశ్చర్యంగా కళ్ళు మరింత పెద్దవి చేసుకొని చూస్తోంది.

అతను పువ్వు ఆమె చేతిలో పెట్టాడు.

ఆమె పువ్వుకేసి రెండు నిముషాలు అభిమానంగా చూసి వెంటనే తన గదిలోకి పరుగెట్టింది.

తలలో పెట్టుకొస్తుంది కాబోలు. రజనీకాంత్ నవ్వుకున్నాడు.

'శశిరేఖ'... కళ్ళు మూసుకుని తియ్యగా అనుకున్నాడు.

కాసేపట్లో ఆమె తిరిగి వచ్చి యథాస్థానంలో కూర్చుంది. అతను ఊహించి నట్లుగా ఆమె తలలో పువ్వు పెట్టుకోలేదు

అది చూసి కొద్దిగా నిరుత్సాహంగా అడిగాడు. "పువ్వు ఏం చేశావు?"

"దేముడికి పెట్టాను" అంది.

అతని మొహం చిన్నబోయింది. అంతలోనే సీరియస్‌గా అన్నాడు.

"రేఖా, రేపు మా హాస్పిటల్ చూద్దువుగాని యింజక్షన్లు చెయ్యటం, కట్లు కట్టటం లాటివి నేర్పుతాను. తరువాత నర్సు ట్రయినింగ్ కోర్సుకి చదవచ్చు."

ఆమె అలాగే అన్నట్లు గబగబ తల ఊపింది.

అతను లోపలికి వెళ్ళి మెడిసన్‌కి సంబంధించిన పుస్తకం చదవటంలో మునిగిపోయాడు.

శశిరేఖ ఒంటరిగా మిగిలిపోయింది. అతని కెందుకో కోపం వచ్చిందని గ్రహించింది. తనని ఓదార్చే వాళ్ళుంటే భోరున ఏడవాలని కూడా అనిపిస్తోం దామెకి.



మర్నాడు శశిరేఖని కూడా హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళాడు. హాస్పిటల్ ముందర కె. రజనీకాంత్. ఎమ్.డి. చిల్డ్రన్ స్పెషలిస్ట్, అన్న బోర్డు వ్రేలాడుతోంది. దాని ప్రక్కనే ఆర్. రఘునాథ్. ఫిజీషియన్ అన్న బోర్డు కూడా ఉంది.

"రెండు బోర్డు లున్నాయేమిటి?" అని అడిగిందతన్ని.

"మేమిద్దరం జాయింట్‌గా హాస్పిటల్ పెట్టాం" అన్నాడు రజనీకాంత్.

అతను పేషంట్లతో ప్రవర్తిస్తున్న తీరుకి, డాక్టరుగా అతని హోదాకి ముచ్చట పడింది శశిరేఖ.

పేషంట్లందర్నీ పంపించి, తిరిగి వచ్చేటప్పుడు హోటల్ ముందు స్కూటర్ ఆపాడు. మొదట అతని వెనకాల స్కూటర్ మీద ఎక్కడానికి బిడియ పడింది. కానీ యింత సహాయం చేస్తున్నప్పుడు ప్రతి దానికీ అడ్డుచెప్తే బాగుండదని ఊరుకుంది.

"కొంచెం లైట్‌గా ఏదన్నా తీసుకుందాం." అంటూ ఫ్యామిలీ రూమ్‌వైపు నడిచాడు.

శశిరేఖ అతన్ననుసరించింది. ఇద్దరూ ఓ మూల కూర్చున్నారు.

"ఏం తీసుకుందాం?" అన్నాడామెను చూస్తూ.

"నాకేమీ వద్దు. ఆకలి లేదు" అంది.

"ఐతే ఐస్‌క్రీం తీసుకుందాం" చిటకేసి బేరర్‌ని పిలిచి రెండు ఐస్‌క్రీమ్‌లకి ఆర్డర్ యిచ్చాడు.

బేరర్ రెండు ఆకుపచ్చని గాజు కప్పుల్లో ఐస్‌క్రీం తెచ్చి వారి ముందు పెట్టాడు. ఆ కప్పుల్ని చూసి పూర్వకాలంలో మధుపానం సేవించే రాజుగారి గ్లాసుల్లా ఉన్నాయనుకుంది శశిరేఖ.

జీవితంలో మొదటిసారి ఐస్‌క్రీం తింటూండడం వల్ల కాబోలు, ఆమె దృష్టంతా దానిమీదే కేంద్రీకృతమై ఉంది.

రజనీకాంత్ మాత్రం ఆమెను గమనిస్తూ తింటున్నాడు.

- అలా తింటున్న శశిరేఖ మొహం చాలా ముద్దుగా అనిపించిందతనికి. ఎలాగైనా శశిరేఖని వదులుకోకూడదనుకున్నాడు. తన నిర్ణయం ఆమెకి తొందరలోనే తెలియజెయ్యాలని కూడా అనుకున్నాడు.

తినటం పూర్తైన తరువాత బిల్లు చెల్లించి బయటికి నడిచారు.

మరో నాల్గునెలలు గడిచాయి. ఈలోగా చిన్న చిన్న మార్పులు జరిగాయి.

శశిరేఖ, రజనీకాంత్ క్లినిక్‌లోనే అతనికి అసిస్టెంట్‌గా పనిచేస్తోంది. అతను జీతం క్రింద ప్రతినెలా ఆమెకి మూడు వందలు యిస్తున్నాడు. ఆమె వేరే యిల్లు చూసుకుంటానంటే అతను ఒప్పుకోలేదు. వాళ్ళింట్లోనే వీధి వైపున అవుట్‌హౌస్‌గా పిలవబడుతున్న గదిని ఆమెకిచ్చాడు. వంటకూడా ఆమె వేరే చేసుకుంటోంది.

ఆ రోజు గురువారం.

మధ్యాహ్నం భోజనానికి యింటికి వచ్చిన రజనీకాంత్‌కి యింట్లో వాతావరణంలో మార్పు కనిపించింది.

శాంతమ్మగారు మాటిమాటికీ కళ్ళు తుడుచుకుంటున్నారు.

"ఏమైంది?" కొంచెం కంగారుగా అడిగాడు.

పొద్దున్న టెలిగ్రాం వచ్చిందన్నయ్యా". అంటూ టెలిగ్రాం తెచ్చి అతని చేతిలో పెట్టింది రేవతి.

అది హనుమకొండ నుంచి వచ్చింది. శాంతమ్మగారి చెల్లెలికి చాలా సీరియస్‌గా ఉందని.

"మీరు బట్టలు సర్దుకుని ఉండండి. నేను రాత్రిబస్‌కి టికెట్లు బుక్ చేసుకొస్తాను." వచ్చినంత వేగంగా తిరిగి వెళ్ళిపోయాడు. రజనీకాంత్ రాత్రి ఏడింటికి తిరిగివచ్చాడు.

రాగానే అడిగాను. "మీ యిద్దరూ రెడీయేనా?"

"ఏం? నువ్వురావా?" అంది తల్లి

"నేనివ్వాళ్ళ రాలేను. హాస్పిటల్లో యిద్దరు పిల్లల కండీషన్ కొంచెం సీరియస్‌గా ఉంది. వాళ్ళని డిశ్చార్జిచేస్తేనే గాని, రావటానికి కుదర్దు. మూడు నాలుగు రోజుల్లో రావటానికి ప్రయత్నిస్తాను" అన్నాడు భోజనానికి కూర్చుంటూ.

గబగబ భోజనం అయిందనిపించి రిక్షాతేవటానికి వెళ్ళాడు. అతను రిక్షా తీసుకువచ్చేటప్పటికి శాంతమ్మ ఔట్‌హవుస్ దగ్గర నుంచొని శశిరేఖతో ఏదో మాట్లాడుతోంది.

కొడుకునిచూసి వచ్చి రిక్షాలోకూర్చుంది. సూట్‌కేస్‌తో రేవతికూడా వచ్చి తల్లి ప్రక్కన కూర్చుంది.

రజనీకాంత్ స్కూటర్‌మీద వెనకాల బయలుదేరాడు.



వాళ్ళిద్దరినీ బస్ ఎక్కించి అతను తిరిగి వచ్చేటప్పటికి రాత్రి పదిగంటలు కావస్తోంది. శశిరేఖ గదిలో లైటులేదు. అంటే పడుకుందన్నమాట అనుకుని లోపలికివెళ్ళి తలుపేసుకున్నాడు రజనీకాంత్.

* * *

తెల్లవారింది.

కిటికీదగ్గర ఏదో చప్పుడు అయినట్లై కళ్ళుతెరిచి చూశాడు రజనీకాంత్ ఎదురుగా కాఫీకప్పుతో శశిరేఖ నిలబడిఉంది

"హాయ్- గుడ్‌మార్నింగ్." అంటూ లేచి తలుపుతీసాడు

"వెరీగుడ్‌మార్నింగ్" నవ్వుతూ లోపలికొచ్చిందామె

ఆమె చేతిలో కాఫీ అందుకుంటూ "నాకేనా యిది" అన్నాడు.

"తీసేసుకున్నాక అదేం ప్రశ్న?" నవ్వింది తెల్లని పలువరస తళుక్కు మనేలా.

అప్పుడే తలస్నానంచేసి వచ్చిందేమో కడిగిన ముత్యంలా ఉంది. అల్లు కోకుండా వదిలేసిన పొడవాటి జుట్టు వీపంతా పరుచుకుని మధ్య మధ్యలో గాలికి ఎగురుతుంటే రజనీకాంత్ మనసు తప్పిపట్టింది.

"రేఖా" అన్నాడు మృదువుగా.

"ఊఁ."

"ఇవ్వాళ నా పుట్టినరోజు. నువ్వు హాస్పిటల్‌కి రానక్కరలేదు. యింట్లోనే ఉండి మనిద్దరికీ వంట చెయ్యి"

అతను చెప్పాలని అనుకున్నది కాకుండా మరేదో చెప్పాడు.

'అలాగే' అన్నట్లు చిన్నగా నవ్వి తనగదిలోకి వెళ్ళటానికి వెనక్కి తిరిగింది

నడుస్తుంటే వెనక నుంచి ఆమె సౌందర్యాన్ని తిలకించి ముగ్ధుడయ్యాడు రజనీకాంత్.

ఊఁహూ.... తనింక ఈ అలస్యాన్ని భరించలేడు. ఈ రోజు ఏమైనా సరే ఆమెకి తనమనసు విడమర్చి చెప్పాలి. ఆమెమీద ప్రేమతో, కోరికతో అతనినరాలు జివ్వుమన్నాయి.

* * *

అతను ఎంత తొందరగా వద్దామన్నా పేషంట్లదర్నీ పంపించి, అర్జెంటు కేసులన్నీ చెక్‌చేసుకుని తిరిగి వచ్చేసరికి టైము రెండు దాటిపోయింది.

అతను వచ్చేసరికి గుమ్మంలో నుంచొని ఎదురుచూస్తోంది శశిరేఖ. అది అతనికి చాలా హాయినిచ్చింది.

తను చేతిలో ప్యాకెట్ టీపాయిమీద పెట్టి, టవల్ భుజంమీద వేసుకుని బాత్రూమ్‌లోకి వెళ్ళాడు

అతను వచ్చేసరికి డైనింగ్ టేబుల్‌మీద భోజనానికి గిన్నెలు, కంచాలు సిద్ధంగా పెట్టింది శశిరేఖ.

"నువ్వింకా భోజనం చేయలేదా?" రెండు కచాంలు చూసి ఆశ్చర్యంగా అన్నాడు.

లేదన్నట్లు తలాడించింది.

నోట్లో ముద్ద పెట్టుకోబోతున్నదల్లా ఏదో జ్ఞాపకంవచ్చినట్లు లేచి చెయ్యి కడుక్కుంది వంటగదిలో అల్మైరా దగ్గరకువెళ్ళి సీసాలోని పాలకోవ బిళ్ళలు ప్లేటులోవేసి అతనిదగ్గర పెట్టింది.

"నీకెలా తెలుసు? నాకు పాలకోవా అంటే చాలా యిష్టమని?" ఆశ్చర్యంగా చూశాడు రజనీకాంత్.

"యిదివరకొకసారి మీ అమ్మగారు చెప్పారు. టేస్ట్ ఎలా ఉందో చెప్పండి." అతని కళ్ళల్లోకి చూసి నవ్వింది.

శశిరేఖ పట్ల అతని మనస్సంతా అనురాగంతో నిండిపోయింది. ఆమెవంక అభిమానంగా చూస్తూ, ఆప్యాయంగా తిన్నాడు. యిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం ముగించారు.

.... .... .... .... .... .... ....

తలుపు తడుతున్న శబ్దం విని నిద్రపోతున్న శశిరేఖ లేచి తలుపుతీసింది.

ఎదురుగా కొత్త బట్టల్లో అందంగా, ఠీవిగా నిలబడి ఉన్నాడు రజనీకాంత్.

"కూర్చోండి." అంది కుర్చీచూపించి.

"సారీ డిస్టర్బ్ చేసినట్లున్నాను." అన్నాడు నొచ్చుకుంటూ,

"అబ్బే అదేంలేదు. ఎలాగూ లేద్దామని అనుకుంటున్నాను. ఈలోగా మీరు తలుపుకొట్టారు. ఉండండి యిప్పుడే వస్తాను." అంటూ లోపలికి వెళ్ళింది. కాసేపట్లో రెండు కాఫీ కప్పులతో తిరిగివచ్చింది. అతనికొకటి ఇచ్చి తనొకటి తీసుకుంది.

అతను ఖాళీకప్పు కిందపెట్టాడు. ఆమె రెండుకప్పులూ లోపలపెట్టి, మొహం కడుక్కుని వచ్చి కూర్చుంది.

తడి ఆరీ ఆరని బుగ్గలు నున్నగా మెరుస్తున్నాయి. తడిసిన ముంగురులు కంటికొస ప్రక్కగా చెంపమీద అంటుకొని చూడటానికి తమాషాగా ఉంది.

"రేఖా యివ్వాళ నీతో ఓ విషయం చెప్పాలనుకున్నాను. అది చెప్పే ముందర నాదో చిన్నకోరిక తీరుస్తావా?" ఆశగా అడిగాడు.

ఆమె ఆలోచనల్లో పడింది.

అతనేం చెప్పాలనుకున్నాడు తనకి? తన్నేం కోరబోతున్నాడు? అది తను తీర్చగలిగేదేనా?– ఎన్నోసార్లు ఒంటరి సమయాలు దొరికినా అతనెప్పుడూ అసభ్యంగా ప్రవర్తించటం గానీ, మాట్లాడటం గానీ చెయ్యలేదు. అందువల్ల అతన్ని నీచంగా అంచనా వెయ్యటానికి తన మనసొప్పట్లేదు.

"మాట్లాడవేం రేఖా?" నిరాశగా ఉంది అతని గొంతు

"అడగండీ రజనీకాంత్‌గారూ." అంది సంకోచం వదిలిపెట్టి.

"నా ప్రతిపుట్టిన రోజుకీ అమ్మకి, చెల్లాయికి బట్టలు కొనటం అలవాటు ఈ సారి వాళ్ళిద్దరూ లేరు. అందుకని నీకిది.".... అంటూ చేతిలో ప్యాకెట్ ఆమె చేతిలో పెట్టాడు.

"మీ పుట్టిన రోజుకి బహుమతి నేనివ్వటం న్యాయం. కానీ దాన్ని మీరు రివర్స్ చేస్తున్నారు" చేతిలో ప్యాకెట్‌కేసి మొహమాటంగా చూస్తూ అంది

"యిప్పుడైనా మించిపోయిందేముంది? నువ్వు యివ్వాలనుకున్నది ఇవ్వచ్చు" ఆమె కళ్ళల్లోకి చూస్తూ నవ్వాడు రజనీకాంత్.

అతని కళ్ళల్లో కనిపించిన కొంటెతనానికి కలవరపడి కళ్ళు దించుకుంది శశిరేఖ.

"ప్లీజ్ చీరకట్టుకో రేఖా" అని అతను తలుపులు దగ్గరగా లాగి బయటికి వెళ్ళి నుంచున్నాడు.

మరు నిముషంలో తలుపులు తెరుచుకున్నాయి.

శబ్దానికి వెనక్కి తిరిగిన రజనీకాంత్ కళ్ళు పెద్దవయ్యాయి.

[illegible] పూలున్న నెమలికంఠం రంగు పట్టుచీర, అదేరంగు రెడీమేడ్ బ్లౌజ్‌లో [illegible] వందరెట్లు ద్విగుణీకృతమైంది. అతను తనకి సమీపంగా వచ్చి [illegible] చూసి సిగ్గుగా తలదించుకొంది. చూపుడు వ్రేలుతో ఆమె చుబుకాన్ని పైకెత్తి "ఎంత బావున్నావు శశీ" అన్నాడు అనురాగంగా ఆమె మొహంలోకి చూస్తూ.

అనుకోని అతని చర్యకి, తనపట్ల అతని కళ్ళల్లో కనిపించిన ఆరాధనకీ, అప్రతిభురాలైంది శశిరేఖ.

ఆమె మొహంలోకే నిశితంగా చూస్తున్న రజనీకాంత్‌కి, యిన్నాళ్ళూ ఆమె మొహంలో కనిపించిన వెలితికి కారణమేదో చటుక్కున స్ఫురించినట్లైంది.

"యిప్పుడే వస్తానుండు" అంటూ రెండంగల్లో లోపలికి వెళ్ళి తిరిగివచ్చాడు.

అతను గుప్పిట తెరిచి భరిణలోని కుంకుమని ఆమె నుదుట ఉంచబోయాడు.

అసలే అతని చర్యకి బిత్తరపోయి నుంచున్న శశిరేఖ "వద్దు వద్దు" అంటూ తన రెండు చేతులతో కంగారుగా అతని కుడిచేతిని పట్టుకొంది.

కానీ అప్పటికే అతని బొటనవ్రేలు ఆమె నుదిటిని తాకనే తాకింది. చేతులు అడ్డు పెట్టటం వల్ల కొంచెం వంకరగా నుదిటి నలంకరించిన ఎఱ్ఱటి కుంకుమతో ఆమె ఫాలభాగం వింత కాంతి విరజిమ్ముతోంది. అతని ప్రవర్తనకి గడ గడ వణికిన శశిరేఖ "నాకా అర్హత లేదు రజనీకాంత్ గారూ" అంటూ దోసిట్లో మొహం దాచుకొని నేలమీద కుప్పలా కూలిపోయింది.

"ఏంటే?" అతని కను బొమ్మలు ముడిపడ్డాయి.

"నేను ... నేను భర్తని పోగొట్టుకున్న నిర్భాగ్యురాలిని. లోకం దృష్టిలో




సౌభాగ్యాన్ని కోల్పోయిన దాన్ని. నా గురించి నిజం దాచి, మీకు తెలియకుండానే మీలో ఆశలు రేపిన వంచకురాల్ని. నా గురించి యింకా ఏం తెల్సుకుందామనుకుంటున్నారు రజనీకాంత్ గారూ?" కన్నీళ్ళ మధ్య జవాబిచ్చింది.

ఆమె జవాబు విన్న రజనీకాంత్ నిశ్చేష్టుడయ్యాడు.

శశిరేఖ వివాహిత. పైగా భర్తృహీన. ఈ నిజం అతని మనసుని కాల్చేస్తోంది.

...భర్తృహీన, భర్తృహీన అని ఎవరో వెయ్యి కంఠాలతో అరుస్తున్నట్లు అతనికి యిల్లంతా గిర్రున తిరుగుతున్నట్లు, అనిపించి రెండు చేతుల్తో తల పట్టుకుని ప్రక్కనే ఉన్న కుర్చీలో కూలబడ్డాడు.

తిరిగి అతను మామూలు మనిషి కావటానికి పదిహేను నిముషాలపైనే పట్టింది.

శశిరేఖ వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఆమె కంటే ముందుగా తేరుకున్న రజనీకాంత్ లేచి ఆమె ప్రక్కనే కూర్చుని ఓదార్పుగా తల మీద చెయ్యి వేశాడు

శశిరేఖ వెక్కిళ్ళు మరింత ఎక్కువయ్యాయి.

దుర్భరమైన మానసిక వేదనకి కన్నీరొకటే ఓదార్పు అందుకే అతనామె దుఃఖాన్ని అరికట్టే ప్రయత్నం చెయ్యలేదు.

చాలా సేపటికి ఆమె కుదుట పడింది.

ఏడుపు వల్ల ఎఱ్ఱగా ఉబ్బిన కళ్ళు, మొహంలో ఒక విధమైన తేటతనాన్ని సూచిస్తున్నాయి.

ఆమె ఆడది కాబట్టి ఏడ్చి దుఃఖ భారాన్ని దింపుకుంది.

- మరి తను ?

అతను లేచి కూజాలో నీళ్ళ గ్లాసులో వంపి తెచ్చిచ్చాడు. మంచి నీళ్ళు తాగి లేచి మొహం కడుక్కుని వచ్చి కూర్చుంది శశిరేఖ.

"నన్ను క్షమించండి. చిన్న పిల్లలా ప్రవర్తించి మిమ్మల్ని చాలా బాధ పెట్టాను" నొచ్చుకున్నట్లు అంది.

"ఆ మాట అనవలసింది నేను రేఖా. నీపరిస్థితి తెల్సుకోకుండా అనవసరంగా నిన్ను యిబ్బంది పెట్టాను."

- అతనికి ఆవేశంగా ఏదో చెప్పాలని ఉంది కానీ ఏదీ చెప్పలేక పోతున్నాడు. ఆ కొాష్ట వ్యవధిలో ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నాడు.

"రజనీకాంత్ గారూ - మిమ్మల్ని చూస్తోంటే నా మీద ఏవో ఆశలు పెంచు కున్నారనిపిస్తోంది. అదే నిజమైతే నాకు తెలియకుండానే. నేను బాధ్యురాలి నయ్యాను. ఒంటరిగా దిక్కుతోచని పరిస్థితిలో ఉన్న నన్ను మీరు చాలా ఆదుకున్నారు. అందుకు నా కృతజ్ఞత మాటల్లో చెబితే సరిపోదు. యింకా నా గురించి నిజాలు దాచి మిమ్మల్ని బాధపెట్ట దల్చుకోలేదు.

"ఈ రోజు నా కథ.... ఓ మాటు అతనికేసి చూసింది. ....మీకు చెప్పా లనుకుంటున్నాను"

- అవును అందమైన శశిరేఖకి కూడా ఓ కథ వుంది. కానీ ఆ కథ ఆమెలా అందంగా లేదు. ఇరవై ఏళ్ళ శశిరేఖ అరవై ఏళ్ళకి సరిపడే అనుభ వాల్ని సంతరించుకుంది.

"అప్పుడు మేము విజయవాడలో ఉండేవాళ్ళం" ఆమె మొదలు పెట్టింది. అతను వింటున్నాడు

ఒక్కసారిగా జరిగిన సంఘటనలన్నీ ఆమె కళ్ళముందు సినిమా రీళ్ళలా తిరగ నారంభించాయి

.... .... .... .... ....

భాస్కర్రావు, లక్ష్మిలకి శశిరేఖ ఒక్కతే కూతురు. ఒక రకంగా చెప్పా లంటే, ముచ్చటగా ఉండ గలిగితే వారిది ముచ్చటైన సంసారం. భాస్కర్రావు ఆంధ్రా బ్యాంక్‌లో క్లార్క్. అతనికొచ్చే జీతం, ఉన్న కొద్దిపాటి ఆస్తితో అతను హాయిగానే బ్రతకవచ్చు. అలా బ్రతుకుతాడనే లక్ష్మి తండ్రి

నారాయణ కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు. కాబోయే అల్లుడు అందగాడే కాకుండా, సకల గుణాభిరాముడవి కూడా ఆయన కర్ణాకర్ణిగా వినకపోలేదు అదంత లెఖ్ఖ చెయ్య వలసినదిగా ఆయన కనిపించలేదు.

ఏదో కుర్రకారు పెళ్లై ఓ బంధం ఏర్పడితే అతనే మారతాడు లెమ్మని సరిపెట్టుకున్నాడు.

ఆయన అలా ఆలోచించటానికి కారణం తనకి లక్ష్మిగాక మరో నల్గురు ఆడపిల్లలు, నల్గురు మొగపిల్లలు, వీళ్ళు గాక రోగిష్టి భార్య, ఓ తల చెడిన చెల్లెలు, ఆమె పిల్లలిద్దరు ఉన్నారు. వీరందరికీ నారాయణ సంపాదని ఒక్కటే ఆధారం.

యిలాంటి పరిస్థితిలో కాబోయే అల్లుడు కూతురికి తిండి, గుడ్డ పెట్టగల్గిన వాడైతే చాలని ఆయన ఉద్దేశ్యం. ఆయనకున్న బాధ్యతలకి అదే చాలా గొప్ప సంబంధం.

అయితే యివ్వేమీ తెలియని లక్ష్మి భాస్కర్రావు అందానికి మురిసిపోయింది. తన కలలన్నీ నిజం కాబోతున్నాయన్న ఆనందంతో కోటి కోర్కెలతో భర్త యింట్లో అడుగుపెట్టింది.

నారాయణ ఊహించినట్లు భాస్కర్రావు మొదట్లో కుదురుగానే ఉన్నాడు. బయట వ్యవహారాలన్నీ కట్టిపెట్టి యింటిపట్టునే ఉండసాగాడు.

కానీ అది ఎన్నాళ్ళు?

నాల్గు నెలలు తిరిగేసరికి అతనికి లక్ష్మి మొహం మొత్తింది, దాంతో అతనికి పాత స్నేహాలు, పాత అలవాట్లు, జ్ఞాపకం వచ్చాయి. సరిగ్గా అప్పటి నుంచే వారి సంసారంలో శాంతి మాయమయ్యింది.

కొంతమంది జీవితాల్లో భగవంతుడే శాంతిలేకుండా చేస్తూ ఉంటాడు. కానీ చాలా మంది వారి జీవితాలు వారే నాశనం చేసుకుంటారు.

కొన్ని సంసారాల్లో భర్త లోపంవల్ల, లేదా భార్య లోపంవల్ల, మరికొన్ని సంసారాల్లో యిద్దరి లోపంవల్ల సుఖం దూరమవుతూ ఉంటుంది. భార్యా భర్తలిద్దరూ సరిపెట్టుకోగల్గేవారైతే ఆ సంసారం స్వర్గసీమే అవుతుంది కానీ అలాంటిది వందలో ఒకటి ఉండవచ్చేమో? వీరి సంసారం దుఃఖమయం కావటానికి భాస్కర్రావే కారణ మయ్యాడు అతనికి లక్ష్మిమీద ఎప్పుడైతే మోజు తగ్గిందో, అప్పటినుంచి ఆమెమీద విసుక్కోవటం, ప్రతి చిన్న విషయాన్ని భూతద్దంలోంచి చూస్తూ లోపంగా ఎంచటం అలవాటు చేసుకున్నాడు. చీటికీ

మాటికి అవమానిస్తూ, అప్పుడప్పుడూ చెయ్యి చేసుకోవటం కూడా చేస్తున్నాడు భాస్కరరావు.

భర్త తిరస్కారానికి ఆమె సున్నితమైన మనస్సు గాయపడింది. జీవితం మీద ఒకరకమైన విరక్తి కూడా ఏర్పడింది. అతన్ని మార్చుకోవాలని బెదిరించింది ప్రార్థించింది. చివరికి ఏమీ చేయలేక నిస్సహాయంగా ఊరుకుంది

జీవితానికి యిక ముగింపు పాడదామని లక్ష్మి నిర్ణయానికి వచ్చేంతలో నీవు తల్లివి కాబోతున్నావని చెప్పింది లేడీ డాక్టరు.

పాపో, బాబో పుడ్తే, చెడు అలవాట్లకి బానిసైన భర్త మారవచ్చుననే ఆశ తళుక్కుమంది ఆమెలో.

• • •

తొమ్మిది నెలలు నిండి ఓ శుభ ముహూర్తాన పండంటి ఆడపిల్లను కన్నది లక్ష్మి. ఆ సమయంలో భాస్కరరావు ఓ బజారు స్త్రీ గాఢ పరిష్వంగంలో ఉన్నాడు

బొద్దుగా, ముద్దుగా ఉన్న మనుమరాల్ని చూసి నారాయణ ఆనందించాడు. కనీసం బారసాల సమయంలో కూడా అల్లుడు పీటలమీద కనిపించకపోతే కూతురి దౌర్భాగ్యానికి చింతించి మరీ వెళ్ళాడు.

లక్ష్మి ఆశించినట్లుగా పాప పుట్టిన తరవాత భర్తలో మార్పురాలేదు. సరికదా, కూతురు శశిరేఖపట్ల కూడా అతనికి నిరసన ఎక్కువైంది. మనిషికి తిండి, గుడ్డ ఉంటే సరిపోవు మరేదో కూడా ఉండాలి. ఈ రెండూ ఉండి, ఆ ఏదో కూడా లేకపోతే మనిషి బ్రతుకు దుర్భర మవుతుంది.

రోజురోజుకీ లక్ష్మి ఆరోగ్యం క్షీణించిపోతుంటే, శశిరేఖ ముద్దుగా, అందంగా తయారవుతోంది.

మనోవ్యాధికి మందేముంది? ఆమెకి యిప్పుడు ఏడుపు కూడా రావట్లేదు. ఏడ్చి ఏడ్చి నీళ్ళుకూడా యింకిపోయాయి.

ఆమెకున్న బెంగల్లా ఒక్కటే తనకేదన్నా అవుతే శశిరేఖని ఎవరు చూస్తారు? తల్లి ప్రేమకూడా లేకపోతే ఎలా బ్రతుకుతుంది? లేనిపోని బెంగలతో ఆమె ఆరోగ్యం మరింత చెడగొట్టుకుంది.

ఆ రోజంతా ఆలోచించి, చివరికి శశిరేఖ గురించి ఒక నిర్ణయం తీసుకుని తీసుకుని తృప్తిగా నిద్రపోయిందా రాత్రి.

• • •

అలా పడుకున్న లక్ష్మి మరునాడు ఉదయం మరి లేవనేలేదు.

భాస్కరావు లోకం కోసం ఓ ఏడుపు ఏడిచి ఊరుకున్నాడు. నారాయణ వచ్చి మనుమరాల్ని తీసుకవెళ్తానన్నాడు. భాస్కరావు ససేమిరా వీల్లేదన్నాడు. అప్పటికి శశిరేఖకి ఎనిమిదేళ్ళు.

తల్లి పోయిన దుఃఖానికి తట్టుకోలేని ఆ చిన్నారి మనసు, తండ్రంటే విపరీతమైన భయంతో అతని కంట పడకుండా తిరుగుతోంది.

అతని దూరపు బంధువైన ఓ ముసలమ్మ వచ్చి వారిద్దరికీ వండిపెడ్తోంది.

లక్ష్మి పోయిన రెండు నెలలకి, అనాథశరణాలయంనుంచి ఓ పద్దెనిమిదేళ్ళ అమ్మాయిని తీసుకువచ్చి పెళ్ళి చేసుకున్నాడు భాస్కరావు.

ఓ అనాథని పెళ్ళి చేసుకున్నందుకు, చాలా ఆదర్శవంతమైన పనిచేశావని అతని మిత్రులంతా అభినందించారు.

పెళ్ళైన మర్నాడు శశిరేఖని పిలిచి "యిదిగో మీ అమ్మ. 'అమ్మా' అని పిలవకపోతే ఒళ్ళు చీరేస్తాను." చూపుడు వ్రేలితో బెదిరించాడు.

అసలే తండ్రి అంటే హడలిపోతున్న శశిరేఖ 'అలాగే' అన్నట్లు గబగబ తల ఊపింది.

భాస్కరావు అదృష్టమో, శశిరేఖ అదృష్టమోగానీ, ఆ యింట్లో అతని రెండవ భార్యగా అడుగు పెట్టిన సీత చాలా యోగ్యురాలు.

సీత వచ్చిన కొత్తలో వారం రోజుల పాటు దూరి దూరంగా తిరిగిన శశిరేఖ, రానురాను కొత్త అమ్మకి చేరువకాసాగింది.

సీతకి, అనాథశరణాలయంలో పెరగటంవల్ల చిన్న పిల్లలంటే ఎంతో లేని మక్కువ, జీవితంపట్ల సరైన అవగాహన ఉన్నాయి.

సీత తనకి ఎదురు తిరగకుండా ముందరనుంచీ ఆమెను దూరంగా అట్టి పెట్టాడు భాస్కరావు.

కానీ సీత సహజంగా తెలివైనదవటంవల్ల భాస్కరావు మనః స్తత్వాన్ని తొందరగానే అర్థంచేసుకుంది.

నేను చేసుకోకపోతే నీ మొహాన్న పెళ్ళే అవ్వదు అన్నట్లు ఉండేది అతని ప్రవర్తన.

తనకంటూ వేరే సంపాదన ఉండాలని ఆ క్షణంలోనే సీత నిర్ణయించుకొంది.

ఆమె చుట్టుప్రక్కల ఆడపిల్లలందర్నీ పోగుచేసి కుట్లు, అల్లికలు మొదలైనవి

నేర్చుకొంది. అద్దె కుట్టుమిషన్‌మీద ఆడవారి బట్టలన్నీ కూడా కుడుతోంది. ఆ రకంగా ఆమెకి రెండు వందలదాకా ఆదాయం వస్తుంది.

* * *

శశిరేఖ స్కూల్ ఫైనల్ పూర్తిచేసింది. సీతకు యిద్దరు మగపిల్లలు భాస్కర్రావుకి సీత సంపాదన విషయం తెలియదు. లేకపోతే అదికూడా తన ఖర్చులకి వాడుకునే వాడే.

—కొంతమంది మనుషుల్లో చచ్చిపోయే రోజువరకూ మార్పురాదు. బహుశ యితను ఆ కోవకి చెందినవాడే అయి ఉంటాడు.

ఒక రోజున భాస్కర్రావు యింటికి వచ్చేసరికి సీతతో ఒక అబ్బాయి మాట్లాడుతున్నాడు.

ఆ అబ్బాయి పేరు శివరామ్. అనాధ శరణాలయంనుంచి వచ్చాడు. సీత అక్కడ ఉన్నప్పుడు సొంత తమ్ముడిలా మసలేవాడు. అతను అప్పుడప్పుడు సీతని చూడటానికి వస్తూ ఉంటాడు. అతని కి మధ్యనే బస్ కండక్టరుగా ఉద్యోగం వచ్చింది. అందువల్ల శశిరేఖని పెళ్ళిచేసుకుంటానని చెప్పటానికి వచ్చాడు. ఆ విషయమే వాళ్ళు చర్చించుకుంటున్నారు.

—సరిగ్గా ఆ సమయంలోనే భాస్కర్రావు వచ్చాడు. తను లేకుండా పరాయి పురుషుడితో మాట్లాడుతున్న సీతపైపు కళ్ళెర్రచేసి చూశాడు. సీత అదేమీ లెక్క చెయ్యకుండా అతన్ని పరిచయం చేసింది. శివరామ్ చేసిన నమస్కారం అందు కోకుండానే భాస్కర్రావు లోపలికి నడిచాడు.

"వస్తానక్కా. శశిరేఖని కూడా అడిగి చూడు."

అతను వెళ్ళిపోయాడు.

శివరామ్ వెళ్ళాడని నిర్ధారించుకోగానే భాస్కర్రావు యివతలికి వచ్చి వీధి తలుపు గడియపెట్టాడు.

ఒక్క ఉదుటున సీత దగ్గరకు వెళ్ళి ఎడంచేత్తో ఆమె జుట్టు పట్టుకొని కుర్చీ లోంచి లేవనెత్తాడు. "ఏమే, నేను లేకుండాచూసి కుర్రాడ్ని తెచ్చుకుని కులుకు తావా? పైగా కాఫీ కూడా యిస్తావా?" ఆమె చెంప చెళ్ళుమంది.

"ఛీ! నా సీత గొంగళి పురుగుని చూసినట్లు భాస్కర్రావుకేసి అసహ్యంగా చూసింది.

వెంటనే ఆమెలో ఆత్మాభిమానం బుస్సున పొంగింది.

"పెళ్ళీడుకొచ్చిన పిల్ల ఉన్న మీరు తిరిగితే లేని తప్పు నేను చేస్తే వచ్చిందా?



మార్పు మీకేగానీ నాకు అవసరం లేదనుకున్నారా? ఇంకొకసారి నావంటిమీద దెబ్బ పడితే, మీకు కూడా అదే శాస్త్రి జరుగుతుంది. అప్పుడు పెళ్ళాంచేత దెబ్బలు తిన్న చవటగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతారు." విసురుగా అతన్ని విదిలించుకుని లోపలికి వెళ్ళిపోయింది.

భార్య ధైర్యానికి విస్తుపోయాడు భాస్కరావు అసలామెకి యిన్ని మాటలు వచ్చుననుకుంటేనే అతనికి ఆశ్చర్యంగా ఉంది.

—అంతే! ఆ తరువాత అతనెప్పుడూ సీతమీద చెయ్యి చేసుకోలేదు.

* * *

శివరాం, శశిరేఖల పెళ్ళి గుళ్ళో నిరాడంబరంగా జరిగిపోయింది. శశిరేఖని పంపించే రోజున సీత కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

"చూడమ్మా రేఖా, శివరాం చాలా యోగ్యుడు. అతను నిన్ను కోరి చేసుకున్నాడు. స్త్రీకి తనని ప్రేమించే భర్త దొరకటం నిజంగా వరం అతని మనస్సు నొప్పించక అనుగుణంగా మసలుకో. మీయిద్దరూ ఆనందంగా ఉండటం

కంటే నాకొక్కవలసిందేమీ లేదు. ఇంతకంటే ఏం చెప్పను? చిన్నప్పటినుంచీ కష్ట సుఖాలన్నీ చూస్తున్నదానివి." ఆ మాటలంటున్నప్పుడు అమె గొంతు జీరబోయింది.

తల్లిని వదిలి వెళ్ళడానికి శశిరేఖకి బాధగానే ఉంది. అవటానికి సవతి తల్లే అయినా, కన్నతల్లిలా కంటికి రెప్పలా కాపాడి, తనో్న యింటిదాన్ని చేసిన ఆమె అంటే శశిరేఖకి ఎంతో మమకారము, గౌరవమూను.

-ఆమే లేకపోతే తనే మయ్యుండేది?

ఆ ఆలోచనే ఆమెకి భయంకరంగా కనిపించింది.

తల్లిని కౌగలించుకుని పసిపిల్లలా ఏడిచింది.

వాళ్ళిద్దరినీ గమనించి "మీరిద్దరూ యిలా బాధపడ్తూంటే నాకేదో తప్పు చేస్తున్నట్లుంది." అన్నాడు శివరాం

సీత కళ్ళు తుడుచుకుని లోపలికి వెళ్ళింది. పాత రేకుపెట్టెలోంచి ఒక వాయిల్ చీర, జాకెట్ గుడ్డతీసి ఒక పళ్ళెంలో పెట్టింది. దాని ప్రక్కనే పసుపు, కుంకుమ వేసిన పొట్లాం, రెండురూపాయల నోటు కూడా ఉంచి, తిరిగి వాళ్ళ దగ్గరికి వచ్చింది.

రేఖకి బొట్టుపెట్టి, చీర, జాకెట్ చేతిలో ఉంచి, ఈ రెండు రూపాయలు పెట్టి గాజులు వేయించుకో." అంది.

"చూడు శివరాం శశిరేఖని నేనెంత అభిమానంగా పెంచానో నీకు తెలుసు. అమెకే చిన్న కష్టం కల్గినా నేను భరించలేను. నాకున్న ఒకేఒక్క ఆడపిల్లది. నేను దాని కన్నతల్లిని కాకపోయినా, మా యిద్దరి మధ్యా ఉన్న బంధం అంత కన్నా ఎక్కువదే. శశిరేఖ తెలిసో తెలియకో ఎప్పుడైనా చిన్నచిన్న పొరపాట్లు చేస్తే నన్ను దృష్టిలో ఉంచుకుని దాన్ని క్షమించు. నీకివన్నీ చెప్పవలసిన అవసరం లేదనుకో. కానీ తల్లిగా నా ఆరాటాన్ని అర్థంచేసుకో." కళ్ళు తుడుచుకుంది సీత.

"అక్కా నీవు రేఖగురించి ఏ దిగులూ పెట్టుకోకు. అయినా మనం పెరిగిన వాతావరణం మర్చిపోయావా? రేఖ నీ కూతురే కాదు. యికనుంచీ నా భార్య కూడా. ఆమె కష్టపడితే నీకెంత బాధో, నాకూ అంతే బాధ. అమెను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను." సీత చేతిలో చెయ్యివేశాడు.

అతని మంచితనానికి అమె హృదయం అర్ద్రమైంది.

ఇదంతా వింటున్న భాస్కరరావు మొహం తిప్పుకున్నాడు. యిలాంటి సెంటిమెంట్లంటే అతనికి పెద్ద చిరాకు.

"వెళ్ళొస్తాను నాన్నగారూ." అది శశిరేఖ గొంతు.

"ఊఁ .. " ముక్తసరిగా అన్నాడు.

ఆమె మనస్సు చివుక్కుమంది. అయినా అతని ధోరణి చిన్నప్పటినుంచీ అలవాటే కాబట్టి మనసు సరిపెట్టుకుంది.

రిక్షాలో ఎక్కి కూర్చుంటూ "వెళ్లొస్తానమ్మా" అంది.

రిక్షాతోపాటు నాలుగడుగు లేసి "నన్ను మరచిపోక, వారం వారం వస్తూ ఉండండి." అంది.

శివరాం రిక్షాలోంచి వెనక్కి చూస్తూ వెళ్ళొస్తా నన్నట్లు గాలిలో చెయ్యి ఊపాడు.

తిరిగి ఆ చెయ్యి తన వళ్ళో పెట్టుకోకుండా, శశిరేఖ నడుంచుట్టూ వేశాడు.

భర్త స్పర్శకి ఆమె వళ్ళు ఝల్లుమంది. అతని కళ్ళలోకిచూసి సమ్మోహనంగా నవ్వింది.

మరి కాసేపట్లో రిక్షా ఒక చిన్న యింటి ముందాగింది. పైకి చూడటానికి పాతకాలం యిల్లులా ఉంది.

శివరాం తాళం తీసి శశిరేఖ సామాను లోపల పెట్టాడు.

అంత పెద్దది, చిన్నదీ కాని ఒక గది, దాన్ని ఆనుకుని చిన్న వంటిల్లు. దొడ్డివైపున బాత్రూమ్, లెట్రీన్, నీళ్ళకుళాయి, వీధివైపున చిన్న కాంపౌండ్ ఉన్నాయి.

చిన్న యిల్లైన శశిరేఖకి బాగా నచ్చింది. ఆ యిల్లు తనదీ అనుకోగానే ఏదో గర్వం, తృప్తి కలిగాయి.

కళ్ళు విప్పారి చూస్తున్న శశిరేఖని చూసి "ఎలా ఉందోయ్ మన హోమ్" కళ్ళెగరేశాడు.

"స్వీట్‌గా ఉంది." అతన్నను కరిస్తూ తనుకూడా కళ్ళెగరేసింది.

"అయితే స్వీట్ హోమ్ అన్నమాట." అన్నాడు ఆమె బుగ్గమీద చిటికవేసి.

"యస్." అంది నవ్వుతూ.

వాళ్ళిద్దరూ కలిసి రెండు గంటలలో యిల్లంతా అందంగా సర్దేశారు అతను కూర తరిగిపెడితే, ఆమె గబగబ వంట పూర్తిచేసింది. ఇద్దరూ కలిసి ఒకే కంచంలో భోజనం చేశారు.

అప్పటికి రాత్రిఏనిమిదైంది. "నేనిప్పుడే వస్తాను. జాగ్రత్తగా తలుపేసుకో" అని బయటకి వెళ్ళాడు శివరాం.

తలుపు వేసుకొని ఒంటరిగా కూర్చుంది శశిరేఖ.

ఆమెకి చాలా ఉక్కగా ఉన్నట్లు అనిపించింది. దక్షిణంవేపున ఉన్న ఒక్క కిటికీని తెరిచింది.

చల్లని గాలి మలయమారుతంలా ఆమె ఒంటిని తాకింది.

కిటికిలోనుంచి బయటకి తొంగి చూసింది. అటువైపు యిళ్ళేమీ లేవు. కొంత నయమే అనుకుంది.

ఆమెకి స్నానం చెయ్యాలనిపించింది. టవల్, సబ్బు తీసుకుని, వీధితలుపు మరోమాటు చూసి బాత్రూమ్‌వైపు వెళ్ళింది.

శివరాం ఎక్కడ వచ్చేస్తాడో అని త్వరగా స్నానం పూర్తిచేసి టవల్ చుట్టుకుని వచ్చింది.

—ఇంకా రాలేదు అమ్మయ్య. అనుకుని ఏ చీర కట్టుకుంటే బాగుంటుంది? అని ఓ క్షణం ఆలోచనలో పడింది.

మరుక్షణం రేకుపెట్టె తెరచి, నాచురంగు జరీఅంచున్న తెల్లపుల్‌వాయిల్ చీరతీసి మంచంమీద పెట్టింది.

తన పెళ్ళికి తల్లికొన్న ఒకే ఒక్క ఖరీదైన చీరది. చీర తీసుకోబోతూ మంచంకేసి చూసింది.

తెల్లటి దుప్పటీ పరిచిఉన్న మంచం ముచ్చటగా ఉంది. —అవును ఈ మంచం మీదే రాత్రి తామిద్దరూ........ అనుకోగానే ఎక్కడలేని సిగ్గు ముంచుకొచ్చి దోసిట్లో మొహం దాచుకుంది.

టక్ టక్ మన్న ధ్వని....

ఆ వెంటనే "రేఖా" అన్న పిలుపు.

భర్త వచ్చేశాడు.

కంగారుగా చీర మడత విప్పింది.

"రేఖా. తలుపు తీయ్." మళ్ళీ తలుపు చప్పుడు.

"ఆఁ వస్తున్నా" అంటూ చీర కుచ్చిళ్ళు దోపుకోబోయింది తీరా చూస్తే చీర తిరగేసి కట్టుకుంది.

"ఛీ!" అనుకుంటూ గబగబ విప్పేసింది.

"శశిరేఖా. ఏంచేస్తున్నావు? తలుపు తియ్యి." అంటూ ఆగకుండా తలుపులు బాదేస్తున్నాడు శివరాం.

విసుగ్గా ఓమాటు తలుపుకేసి చూసి, మళ్ళీ టవల్ చుట్టుకుని తలుపు తీసింది.

"ఏమిటంత ఆలస్యం?" అనబోయి అలాగే చూస్తూండిపోయాడు ఆమె అందాన్ని.

"తలుపు వెయ్యండి. ఎవరేనా చూస్తారు మీ చేతిలో ఏమిటవి? మల్లె పువ్వులా?" అతనికేసి చూస్తూ.

"ఊఁ . అన్నాడు ఆమెను చూస్తూ.

అతనలా గుచ్చి గుచ్చి చూస్తూంటే ఆమెకి ఎంతో సిగ్గుగానూ, ఇష్టంగానూ ఉంది.

"ఉండండి. బట్టలు కట్టుకుని వస్తాను." అంటూ చీర తీసుకుని వంటింట్లోకి వెళ్ళబోయింది.

ఆ మాటకి సమాధానంగా రెండు చేతుల్తో ఎత్తి మంచంమీద పడేశాడు శివరాం.

—ఆ రాత్రి, మరి ఆమెకి చీర కట్టుకునే అవకాశమే రాలేదు.

* * *

శివరాం, శశిరేఖలకి పగలు, రేయి ఒకటిగా రోజులు నిముషాల్లా దొర్లి పోతున్నాయి అతను వద్దంటున్నా వినకుండా, ఆమె వెనకాలే తిరుగుతూ పనుల్లో సహాయం చేస్తూఉంటాడు. ఒక్కొక్కసారి వెనకాలనుంచి వచ్చి కళ్ళు మూయటం, ఏవేవో చిలిపిపనులు చెయ్యటం చేస్తూఉంటాడు. అలాటి సమయాల్లో ఆమె కంటికి అతను పసిపిల్లాడిలా కనిపిస్తూఉంటాడు.

ఓ రోజున భర్తతో అంది.

"రామ్ మీలాంటి యోగ్యుడైన మంచి భర్త దొరకటం నా అదృష్టం."

"కాదు రేఖా. అనాధశరణాలయంలో పెరిగిన నాకు నీవంటి రూపసి, సుగుణాలరాశి అయిన భార్య దొరకటం నా అదృష్టం." ఆమె తలని తన గుండెల మీద ఆనించుకుంటూ అన్నాడు.

* * *

శశిరేఖ కాపురం మొదలై నాలుగు నెలలు గడిచాయి. ఈ మధ్యలో మూడు మార్లు వెళ్ళి తల్లిని చూసివచ్చారు.

ఆ రోజు శివరాం డ్యూటీమీద ప్రక్క ఊరు వెళ్ళాడు.

శశిరేఖ బియ్యం చాట వళ్ళో పెట్టుకుని వీధి గడప దగ్గర కూర్చుని బియ్యం ఏరుతోంది.

తలదించుకుని బియ్యంలో రాళ్ళు ఏరుతున్న శశిరేఖ ఉలిక్కిపడింది. ఏదో ఆలోచనలో పడి తను అంతవరకూ రాళ్ళు వేస్తున్నది రెండు పాదాల మీద.

ఆమె క్రిందనుంచి తలపైకెత్తి చూసింది. వెంటనే లేచి నుంచుంది.

"సారీ." అంటూ

"ఫరవాలేదులెండి. రాళ్ళవానని పువ్వుల వానగా భావిస్తాను" అన్నాడు. ఆగంతకుడు,

"మీరు?" అర్ధోక్తిలో ఆగిపోయింది

"నే నెవరో మీకు తెలుసా? తెలియదు ఎలా తెలుస్తుంది నేను చెప్పందే?" మళ్ళీ అన్నాడతను. "నన్నిలా ఎంతసేపు నుంచోబెడతారు? నుంచోమనరు. నాకు తెలుసు లోపలికి రమ్మంటారు కదూ. యామ్ ఐ కరెక్ట్?" —

శశిరేఖ చిన్నగా నవ్వి ప్రక్కకి జరిగి నుంచుంది.

అతను సరాసరి లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"మీ పేరు? ఆయన యింట్లో లేరు." అంది శశిరేఖ.

భర్త లేనప్పుడు ఎవరో అపరిచితుడు సరాసరి వచ్చి యింట్లో కూర్చుంటే ఆమెకి కొంచెం భయంగా ఉంది.

"నాపేరు కేశవ్. శివరాం నాగురించి చెప్పే ఉంటాడు. నేను వాడి బెస్ట్ ఫ్రెండ్‌ని."

"ఆయన ఎప్పుడూ చెప్పలేదే?" అమాయకంగా అంది శశిరేఖ.

"చెప్పలేదా? అవును ఎందుకు చెప్తాడు? అందుకు కారణం మీరే"

"నేనా?" తెల్లబోతూ అంది.

"అవును. మీతో పెళ్ళికాకముందు మా ఫ్రెండ్షిప్‌గురించి అందరికీ చెప్పేవాడు. అలాంటిది యిప్పుడు చెప్పట్లేదంటే మీరే కారణం. అయినా మీలాంటి అమాయకంగా ఉండే అందమైన పెళ్ళాం చేసుకున్న ఏ మగాడికైనా ఫ్రెండ్స్ గుర్తుంటారా?"

అతని మాటలకు కొంచెం కోపం వచ్చినా నిజమే ననిపించింది శశిరేఖకి.

"యిప్పుడే వస్తాను" అంటూ లోపలికి వెళ్ళి కాఫీ కప్పుతో తిరిగి వచ్చింది శశిరేఖ.

"మీరు కాఫీ యిస్తారని నాకు తెలుసు. ఎలా తెలుసో చెప్పండి?" అన్నాడు.




"ఏముంది? అది సాధారణంగా అందరూ చేసే మర్యాద."

"కాదు"

"ముందు కాఫీ త్రాగండి. చల్లారిపోతుంది." కొద్దిగా విసుగు ధ్వనించిందామె గొంతులో. అతను త్వరగా వెళ్ళిపోతే బాగుండునని ఉంది. అతని ధోరణి మరీ చిరాకు కలిగిస్తోంది.

అతను కాఫీ కప్పు క్రిందపెట్టి మళ్ళీ మాట్లాడటం మొదలుపెట్టాడు. అతను ఏమేమో చెప్తున్నాడు. ఆమె వినకుండానే ఊఁ కొడుతోంది. "ఏమంటారు? నిజమవునా, కాదా?" రెండోసారి అడిగాడతను.

"ఏమడిగారూ?" ఉలిక్కిపడింది.

అతను మూడోసారి చెప్పాడు. అప్పుడు కూడా ఆమె వినలేదు.

బాగా ఆకలేస్తోందామెకి ఎప్పుడు వెళ్ళిపోతాడా? అని ఉంది.

ఈసారి కూడా ఆమె దగ్గరనుంచి ఏ విధమైన రెస్పాన్స్ రాకపోయేసరికి "మరి నే వెళ్ళొస్తాను. వచ్చినట్లు శివరాంకి చెప్పండి" అన్నాడు.

ఆమె అలాగే నన్నట్లు తలఊపి తలుపు వేసుకుంది.

— అమ్మయ్య. కదిలాడు బాబూ. అనుకుంటూ భోజనానికి కూర్చుంది రెండో ముద్ద నోట్లో పెట్టుకోబోతుండగా మళ్ళీ వీధితలుపు చప్పుడైంది

కొంపదీసి యితను వెనక్కిరాలేదు కదా అనుకుని లేచింది

తలుపు తీసిన రేఖ ఆశ్చర్యపోయింది. "అప్పుడే వచ్చారేమిటి? రాత్రి దాకా రావన్నారు కదా."

"తలనొప్పిగా ఉంది రేఖా. అందుకని డ్యూటీ యింకో అతనికి అప్పగించి వచ్చేశాను." షర్ట్ తీసి కొడుమీద వేస్తూ అన్నాడు శివరాం.

రేఖ గబగబ లోపలకి వెళ్ళి తను తింటున్న కంచంమీద మూత వేసింది.

కూరల బుట్టలో చూస్తే అరటికాయలు తప్ప ఏమీలేవు. రెండు ఉల్లి పాయలు, అరటికాయలు తీసుకుని కత్తిపీట ముందు కూర్చుంది.

ఆమె వెనకే వచ్చిన శివరాం "ఇప్పుడు కూర తరుగుతున్నావేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నాకోసమే గదా అవి అన్నం ఒక్కటే వండుకున్నాను. ఎంత రెండు నిముషాల్లో వేయించేస్తాను. మీరు ఈలోగా స్నానం చేసి రండి" అంది. అతను స్నానంచేసి వచ్చేసరికి కమ్మటి వాసన వేస్తున్న వేపుడుతో భోజనం సిద్ధంగా ఉంది.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ భోజనం పూర్తిచేశారు. ఆమెకి సడన్‌గా కేశవ్ జ్ఞాపకం వచ్చాడు. భర్తతో అప్పుడు చెప్పిందతన్ని గురించి. "అయ్యో కేశవ్ వచ్చాడా? సమయానికి నేను లేనే? ఎప్పుడొచ్చాడట ఊర్నించి?"

"ఊర్నించి వచ్చాడా అతను? నా కేం చెప్పలేదేమరి? అసలు వాళ్ళదేవూరు?" అతన్ని భోజనానికి ఉండమని అననందుకు నొచ్చుకుంది.

వాళ్ళది రాజమండ్రి. అతని తల్లిదండ్రులు అక్కడే ఉంటారు. వాళ్ళకేవో అక్కడ ఆస్థులు ఉన్నాయిలే. కేశవ్ మాత్రం యిక్కడ పంజాబ్ నేషనల్ బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. పదిరోజుల కొకమాటు వెళ్ళి తల్లిదండ్రులని చూసివస్తూ వుంటాడు. నెల్లాళ్ళు సెలవుపెట్టి వాళ్ళ అమ్మకి ఒంట్లో బాగుండ లేదని వెళ్ళాడు. అందుకే ఎప్పుడొచ్చాడని అడిగాను." "కేశవ్ ఫాదర్‌కి మీ నాన్నగారు స్నేహితుడని యిదివరకెప్పుడో చెప్పాడు కూడానూ." మళ్ళీ శివరామే అన్నాడు.

-తన తండ్రికి స్నేహితుడా? అయితే ఆయన కూడా ఆ బాపతేనా? అనుకుంది రేఖ.

* * *

ఆరోజు ఆదివారం. శివరాం, శశిరేఖ సీతని చూడటానికి వచ్చారు. వాళ్ళు వచ్చేటప్పటికి భాస్కర్రావు యింట్లో లేడు.

శశిరేఖకి తల్లి చాలా దిగులుగా ఉన్నట్లనిపించింది

"అలా ఉన్నావేం అమ్మా?"

"ఎలా ఉన్నాను బాగానే ఉన్నాను కదా?" కప్పిపుచ్చుకో బోయింది

"మా దగ్గర దాపరికమెందుకక్కా?" ఆప్యాయంగా అన్నాడు శివరాం.

ఆ మాటతో అంతవరకూ నిగ్రహించుకున్న గుండె చెరువైంది సీతకి.

ఆయనకి ఉద్యోగం పోయింది శివరాం. అస్తమానం తాగుతూ ఆఫీసులో అసభ్యంగా ప్రవర్తించటంవల్ల ఆయన్ని డిస్‌మిస్‌చేశారు. నేను బట్టలుకుట్టి సంపాదించే దాంట్లో యిల్లుగడవటం, పిల్లలచదువులే కష్టంగా ఉంటుంటే, అది కూడా లాక్కొని తాగుడికి తగలేశాడు." ఆమె కళ్ళనుంచి ధారాపాతంగా కారుతున్నాయి కన్నీళ్ళు. తండ్రికి ఉద్యోగం పోయిందన్న వార్తవిని నోట మాటరాని దానిలా ఉండిపోయింది శశిరేఖ.

ఆమెకి తల్లిని ఎలా ఓదార్చాలో తెలియలేదు.

"ప్రస్తుతానికి ఈ పాతిక ఉంచక్కా." శివరాం జేబులోంచి డబ్బుతీసి సీత చేతిలో పెట్టాడు.

"వద్దురాం. చివరికి అల్లుడి సొమ్ము తినమంటావా?" డబ్బు తీసుకోటానికి ఆమెకి అభిమానం అడ్డువచ్చింది.

"ఆ తేడాలు మనలో లేవని నువ్వేకదా అన్నావు?"

శశిరేఖ భర్తవేపు మెచ్చుకోలుగాచూసి, తల్లితో అంది.

"తీసుకో అమ్మా. తల్లి కష్టంలో ఉన్నపుడు కూతురు ఆ మాత్రం సహాయం చేయకూడదా?"

అప్పనుంచీ శివరాం భాస్కరావుకి తెలియకుండా పాతికో, పరకో సహాయం చేస్తూనే ఉన్నాడు.

* * *

కేశవ్ అడపా, తడపా శివరాం యింటికి వస్తూనే ఉన్నాడు. ఎక్కువగా అతను యింట్లోలేని సమయాలుచూసి వస్తూ ఉంటాడు. శశిరేఖ అందం అతన్ని విపరీతంగా ఆకర్షించింది ఎలాగైనా ఆమెని ఒక్కసారి పొందాలన్న కోరిక అతనిలో రోజురోజుకీ అధికం కాసాగింది.

ఓ రోజు చీకటిపడుతుండగా శివరాం లేని సమయంచూసి వచ్చాడు. భర్తే ననుకుని ఉత్సాహంగా తలుపుతీసి, కేశవ్‌నిచూసి మొహం చిట్లించింది రేఖ.

"శివరాం ఉన్నాడా?"

"యింకా రాలేదు కూర్చోండి" అంది

"వచ్చేటైము అయిందనుకుంటాను"

"ఊఁ"

"కొంచెం మంచినీళ్ళు కావాలి" అన్నాడు కేశవ్

ఆమె వెళ్ళి తెచ్చి యిచ్చింది

గ్లాసందుకుంటూ కావాలని చెయ్యి పట్టుకున్నాడు

"చాలా సున్నితంగా ఉంది నీ చెయ్యి". ఆమె కళ్ళలోకిచూసి వెకిలిగా నవ్వాడు

మరుక్షణం ఆమె చెయ్యి అతని చెంపను విసురుగా తాకింది.

అనుకోని హటాత్పరిణామానికి అతని మొహం ఎఱ్ఱబడింది.

ఓ చేత్తో చెంపతడుముకుంటూ "నీ చెయ్యి కఠినంగాకూడా ఉంది." అన్నాడు ముందుకు రాబోతూ.

"నోరు మూసుకుని బయటకి నడు. ఇంకెప్పుడైనా ఈ గుమ్మంలో అడుగు పెట్టావంటే మర్యాద దక్కదు." ఆమె కళ్ళు నిప్పులు కురిపించాయి.

అతనికి ఆమెమీద కసితీర్చుకోవాలని ఉంది. కానీ శివరాం వచ్చేవేళ కావస్తోంది.

"వస్తాను." అంటూ వెనక్కి తిరిగాడు.

"మళ్ళీ రానక్కర్లేదు." అంటూ ఠక్కున తలుపులు మూసింది. కన్నీళ్ళు చెక్కిళ్ళమీద జారుతుండగా, పదినిముషాలదాకా మూసిన తలుపుల నానుకునే ఉండిపోయింది శశిరేఖ.

* * *

"ఎందుకో ఈ మధ్య మనింటికి కేశవ్ రావట్లేదు." శశిరేఖతో అన్నాడు శివరాం.

"పోనిద్దురూ. ఏవో పనులుండి ఉంటాయి."

"అతను వస్తున్నపుడు కాలక్షేపం బాగా అయ్యేది. చాలా తమాషాగా మాట్లాడతాడు కదూ?" అన్నాడు రేఖవైపు చూస్తూ.

"ఏం తమాషా వెండి. నా బొంద. అతను రావటం మానేశాక మీతో ఏకాంతం ఎక్కువ దొరుకుతోంది." అంది అతని గుండెలమీద వాలి.

"అతనంటే ఎందుకు నీకు కోపం?"

"నాకేం కోపంలేదు. అతిధోరణి మనుషులంటే నాకు చిరాకు అంతే"

ఆరోజు సంఘటన ఆమె భర్తతో చెప్పలేదు. ఎందుకంటే శత్రువులతో విరోధం కొనితెచ్చుకోవటం మంచిది కాదని ఆమె ఉద్దేశ్యం. అసలే శివరాం ఆవేశపరుడు. ఈ విషయంచెప్తే యింకేమైనా ఉందా? అనుకుంది.

o • •

శశిరేఖ వివాహమై ఏడాది కావస్తోంది. ఆరోజువరకూ వారి దాంపత్యం ఎంతో ఆనందంగా గడిచిపోయింది.

-ఎప్పుడూ రోజులు ఒకేలా గడిస్తే, తన ఉనికికి విలువుండదని అనుకున్నాడు కాబోలు భగవంతుడు.

ఆరోజు శశిరేఖ జీవితంలో ఎన్నడూ ఊహించని సంఘటన జరిగింది.

ఉదయం వెళ్ళేటప్పుడు సాయంత్రం సినిమాకి వెళదాం రెడీగా ఉండమని చెప్పిన శివరాం రాత్రి ఏడుగంటలు కావొస్తున్నా జాడలేదు. అప్పటివరకూ ఎదురుచూసి చూసి విసుగొచ్చిన శశిరేఖ తలుపులేసుకొని మంచంమీద పడుకుంది.

ఆమెకి భర్తమీద చాలా కోపంవచ్చింది. చాలాకాలం తరువాత సినిమాకి తీసుకెడతాననేసరికి ఉత్సాహంగా పనంతా ముగించుకొని పెళ్ళినాటి, నాచురంగు జరీఅంచున్న తెల్లచీర కట్టుకొంది. మల్లెపూలు, మరువం కలిపినదండ తలలో తురుముకుని, ఐదుగంటలకే తయారై అతనికోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

అన్నప్రకారం అతను రాకపోయేసరికి నిరాశ ముంచుకురాగా మంచంమీద వాలిపోయింది. ఒక్క కునుకు పట్టిందో, లేదో.

టక్ టక్ టక్ ........

తిరిగ్గా ఇప్పుడొచ్చారు కాబోలు. "సారీ రేఖా" అంటారు అంతేగా. చెడ్డంగా గెయ్యాలి. అనుకుంటూ తలుపుతీసిన రేఖ, ఆ వచ్చిన మనిషిని చూసి అదిరి పడింది.

గుమ్మంలో కేశవ్.

"ఎందుకొచ్చావ్ మళ్ళీ?"

"నీకోసం మాత్రం కాదు."

"మరెందుకు?"

"కొంచెం మాట్లాడాలి." అన్నాడు.

"నీతో నాకేం మాటలు లేవు. వచ్చిన దారినే దయచెయ్యి." తలుపులు వేయబోయింది.

రేఖా శివరాంని చూడాలనుకుంటే నేను చెప్పేది విను" ఆ మాటలకి ఆమె

వెన్నులోంచి భయం జరజరా పాకినట్లైంది అతనే మళ్ళీ అన్నాడు "శివరాం ఉన్న బస్సుకి యాక్సిడెంటైంది యించుమించు అందరూ గాయపడ్డారు శివరాంకి చాలా తీవ్రమైన దెబ్బలు తగిలాయి నిన్ను చూడాలంటున్నాడు"

శశిరేఖ ఆలోచనలో పడింది. అతని మాటలు నమ్మవచ్చా? మనసు ఇదో కొత్త నాటకమేమో? అంటోంది.

"ఆఁ...అన్నట్టు మర్చిపోయాను. శివరాం మీకివ్వమన్నాడు." అంటూ జేబులోంచి, అతను పొద్దున్న తీసుకెళ్ళిన జేబురుమాలూ, పర్సు ఆమె చేతి కిచ్చాడు

ఆమె అవి అందుకోనటంలో, రుమాలులోంచి రెండు సినిమా టిక్కెట్లు క్రిందపడ్డాయి.

అవి చూసిన శశిరేఖ ప్రాణ్పడిపోయి 'రామ్' అంటూ కుప్పకూలిపోయింది.

"చూడు రేఖా. ఏడుస్తూ కూర్చోడానికిది సమయం కాదు అతను నిన్ను చూడాలంటున్నాడు. అయినా డాక్టర్లు ప్రమాదం ఉండకపోవచ్చునని చెప్పారు." అంటూ అతనే లోపలికి, వెళ్ళి మేకుకి ఉన్న తాళం తెచ్చి తలుపుకి వేశాడు.

శశిరేఖ కొయ్యబొమ్మలా అతన్ననుసరించింది.

* * *

వారిద్దరూ హాస్పిటల్ రూమ్‌లో ప్రవేశించేటప్పటికి డాక్టర్లు నర్సులు శివరాం మంచం ప్రక్కనే ఉన్నారు.

"అతన్ని ఎక్కువగా డిస్టర్బ్ చెయ్యకండి." అని శశిరేఖని ఒంటరిగా ఆ గదిలో వదిలేసి మిగతా వారందరూ తప్పుకున్నారు. శశిరేఖ భర్త ప్రక్కనే బెడ్ మీద కూర్చుంది

అతని మొహం, కుడిచెయ్యి మినహాయించి, తలతో సహా మిగతా శరీర మంతా కట్లు కట్టబడి ఉన్నాయి.

"రేఖా." అతని స్వరం నూతిలోంచి వచ్చినట్లుంది,

"రామ్, ఏమిటీ అన్యాయం?" వెక్కి వెక్కి ఏడుస్తోంది శశిరేఖ

"రేఖా ఎందుకేడుస్తావు? నా ఆఖరి క్షణాల్లో నిన్ను నవ్వుతూ చూడాలని వుంది. నేను చనిపోయిన తరువాత....

అతని మాట పూర్తి కాకుండా అతని నోటికి చెయ్యి అడ్డం పెట్టింది రేఖ

"అలాటి మాటలు మాట్లాడకండి. మీరు క్షేమంగా ఉంటారు. మీకేమీ కాదని డాక్టర్లు చెప్పారట." అంది.




"పిచ్చి రేఖా, డాక్టర్లకేం తెలుసు? అయినా చచ్చిపోయే నిముషం వరకూ అలానే అంటూ వుంటారు. అసలు ప్రతీ మనిషికీ వాళ్ళు చచ్చిపోయేముందు, తాను చచ్చిపోతానని తెలుస్తుందిట. నాకూ అలాగే తెలుస్తోంది. నేను పోయాక..."

ఆమె మధ్యలో ఏదో అనబోయింది. అతను మాట్లాడవద్దన్నట్లు ఉన్న ఒక్కచేత్తో సైగ చేశాడు.

"నేను పోయాక నువ్వు ఏ అఘాయిత్యమూ చెయ్యనని, నిన్ను ఇష్టపడే వ్యక్తి దొరికితే మళ్ళీ పెళ్ళి చేసుకుంటానని ప్రమాణం చెయ్యి రేఖా." చెయ్యి చాపాడు.

"ఏమండీ?" అతని కోరికకి ఆమె స్తంభించిపోయింది.

"అవును రేఖా. నువ్వు గుండెదిటవు చేసుకుని నాకు ఆ రెండూ చేస్తానని మాటివ్వు. లేకపోతే నేను ఆనందంగా కన్ను మూయలేను.

అతని చేతిలో తన చెయ్యి ఉంచింది శశిరేఖ "మొదటిది చేస్తాను రామ్."

"రెండోది?" పేలవంగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

"ఇలాంటి పరిస్థితి ఏ భార్యకీ వద్దని కోరుకుంటున్నాను రామ్. మీకు తగ్గిపోవాలని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటున్నాను. మీరు యింటికి వచ్చాక"....

ఆమె మాట పూర్తి కాకుండానే.

ఆమె పట్టుకున్న అతని చెయ్యి ప్రక్కకి వాలిపోయింది. అతని కళ్ళు ఆమెకేసే నిశ్చలంగా చూస్తున్నాయి

"రామ్!"…. శశిరేఖ పెట్టిన కేకకి డాక్టర్లు-నర్సులు లోపలికి పరిగెట్టు గొచ్చారు,

ఎవరో శశిరేఖని గింజుకుంటున్నా, ప్రక్కకి లాక్కుపోయారు.

కేశవ్ వెళ్ళి సీతని, భాస్కర్రావుని తీసుకువచ్చాడు. ఏతళ నున్నాడో భాస్కర్రావు కూడా వచ్చాడు. శశిరేఖ నా పరిస్థితిలో చూసి, ఆమెని ఓదార్చ వలసినది పోయి—తను కూడా గుండెలవిసి పోయేలా ఏడ్చింది సీత.

శశిరేఖ వైవాహిక జీవితం అంతటితో ముగిసింది. ఆమె నుదిట కుంకుమ రేఖ శాశ్వతంగా చెరిగిపోయింది.

భాస్కర్రావు, సీత శశిరేఖని తమతో తీసుకెళ్ళారు.

*     *     *

శశిరేఖకి తిరిగి పుట్టింటి జీవితం ప్రారంభమైంది ఆమె బ్రతుకులో దాంపత్యం ఒక మధురమైన కలగా మాత్రమే మిగిలిపోయింది యాంత్రికంగా విరాసక్తిగా రోజులు గడుస్తున్నాయి ఆమెకి తల్లితోపాటు ఆమె కూడా కుట్టు పనులకు వెళుతోంది

— ఆమె కసలు బ్రతుకాలని లేదు. ఎందుకోసం? ఎవరకోసం? అనిపిస్తోంది కానీ శేఖరంకి యిచ్చిన మాటకే కట్టుబడి ఉంది. ఆత్మహత్యలు చేసుకొనే వాళ్ళంటే అతని కసహ్యం జీవితమంటేనే కష్టాలు పడటం, వాటినుంచి పారి పోవాలని ప్రయత్నించటం అవివేకం అని అతని ఉద్దేశ్యం "రేఖా నువ్వు నా ప్రక్కన ఉంటే ఎలాటి కష్టమైనా అవలీలగా భరించగలను" అనేవాడు.

—మరి తనని అతను లేకుండానే భరించమంటా డెందుకు? అతనికో న్యాయం, తనకో న్యాయమూ? ఏం చూసుకుని తను బ్రతుకాలని అతని ఉద్దేశ్యం?

ఈ రకమైన ఆలోచనలతోటే ఆమె గంటలు, రోజులు, నెలలూ, దొర్లించేస్తోంది.

*     *     *

అప్పటికి ఆమె పుట్టింటికి వచ్చి ఐదు నెలలైంది.

ఓ రోజు భాస్కర్రావు హడావిడిగా వచ్చాడు యింటికి.

"సీతా. ఈరోజు మనం మార్నింగ్ షో కెళ్దాం." అన్నాడు.

సీత భర్తకేసి విస్మయంగా చూసింది. — ఎందుకంటే యిన్నాళ్ళ కాపురంలో ఆమె భర్తతో కల్సి ఒక్క సినిమాకూడా చూడలేదు

—ఇది ఇతనిలో మార్పు అనుకోవచ్చా?

"నిజం సీతా. నిన్ను యిన్నాళ్ళూ ఎంతో బాధపెట్టాను. నామీదింకా కోపం పోలేదు కదూ." అతని మాటలు సిన్సియర్‌గా ఉన్నాయి.

సీత మనసులో ఆనందపు అల ఉవ్వెత్తున లేచింది.

"రేఖా." పిలవబోయింది.

"ఊహూఁ. రేఖవద్దు మనిద్దరమే వెళ్దాం."

ఆ మాటకి కొంచెం బాధపడినా, సంతోషం కూడా కలిగిందామెకి.

సినిమా సంగతి విని రేఖకూడా ఆశ్చర్యపోయింది. తల్లి ఎంత బలవంతం చేసినా ఆమెకూడా సినిమాకి రావటానికి ఒప్పుకోలేదు.

తండ్రి మారుతున్నందుకు, తల్లికి మంచిరోజులు రాబోతున్నందుకు, మనసులోనే దేముడికి కృతజ్ఞతలు చెప్పుకుంది.

ఖాపక్కరాత్రివు. సీత సినిమాకి వెళ్ళారు. కొడుకు లిద్దరినీ అంతకు ముందే మరో సినిమాకి పంపించాడని సీతకి తెలియదు.

"మీకు డబ్బు లెక్కడివి?" దారిలో అడిగింది సీత.

"ఒక స్నేహితుడు వ్యాపారం చేసుకోమని ఐదు వందలు యిచ్చాడు సీతా." అన్నాడు

అంత డబ్బు యిచ్చే స్నేహితులు ఆయన కెవరున్నారో సీత కర్థం కాలేదు. ఏదైనా తనకి మంచి రోజులు వచ్చాయని సంతోషపడింది.

* * *

తల్లీ, తండ్రీ సినిమాకి వెళ్ళిన గంటకి వంట మొదలు పెట్టింది శశిరేఖ.

అన్నం వార్చి, కూర పోపులో వేసింది.

యింతలో వీధి తలుపు చప్పుడైంది.

-అబ్బబ్బ. వంట మొదలు పెట్టటం పాపం. ఎవరో ఒకళ్ళు. కూర దింపి, స్టౌ ఆర్పి విసుగ్గా తలుపు తీసింది.

ఆ వచ్చిన మనిషిని చూసి 'నువ్వా?' అంటూ వెనక్కి ఒక్కడుగు వేసింది.

ఆ అవకాశాన్ని వినియోగించుకొని కేశవ్ లోపలికొచ్చి వీధి తలుపు గడియ పెట్టాడు.

"ఏయ్? తలుపుతీయి ముందు. ఎవరేనా చూస్తే ఏమనుకుంటారు?"

"యికనుంచి నువ్వు నా దానివే అయినపుడు, వేరే అనుకునేందుకేముంది?"

"నోరు మూసుకుని వీధిలోకి నడు." చూపుడు వ్రేలుతో బెదిరిస్తూ అంది.

"నిన్ను తీసుకెళ్ళకుండా నేనెలా వెళ్తాను?" అన్నాడు దగ్గరకొచ్చి. అతని నోట్లోంచి విస్కీ వాసన గుప్పుమంది.

"పిచ్చి పిచ్చిగా వాగావంటే గట్టిగా అరుస్తాను అందరూ వచ్చి నిన్ను చావగొడ్తారు మా నాన్న చూశాడంటే దేహశుద్ధి చెయ్యకుండా వదలరు."

ఆ మాటకి పెళ్ళున నవ్వాడు కేశవ్.

నువ్వు నాతో రాకపోతే నీకే దేహశుద్ధి చేస్తాడు. మీనాన్న నిన్ను నాకు ఐదు వందలకి అమ్మేశాడు తెలుసా? అందుకే నన్ను ఈ రోజు రమ్మని మీ అమ్మని సినిమాకి తీసుకెళ్ళాడు." ఆమె మొహం మీదకి వంగి రహస్యంగా అన్నాడు.

అతని మాటలు విన్న శశిరేఖ మంచులో పెట్టినట్లు బిగిసిపోయింది రెండు నిముషాలు.

-ఏమిటి? తన తండ్రి తనని కేశవ్‌కి అమ్మేశాడా? ఛీ! యింతకన్నా దారుణం వేరే ఈ ప్రపంచంలో ఉంటుందా?

తండ్రిపట్ల ఆమె మనస్సు జుగుప్సతో నిండిపోయింది.

"నిన్ను నేనేం చేస్తానో తెలుసా? నేను చెప్పందే ఎలా తెలుస్తుంది? నా అవసరం తీరాక, ఏ కంపెనీకో రెండు వేలకి అమ్మేస్తాను." త్రాగుడు మైకంలో మనసులో ఉన్నవన్నీ మాట్లాడేస్తున్నాడు కేశవ్.

అతను ఏదేదో వాగుతూ మీద మీదకి వచ్చేస్తున్నాడు. ఆమెకేం య్యాలో తోచటంలేదు.

ఉన్నట్టుండి ఆ మనసులో ఓ మెరుపు మెరిసింది.

"ఉండండి. నేనెలాగూ మీదాన్నేగా? తొందరెందుకు? కాసిని మంచి నీళ్ళు త్రాగి వస్తాను." అంటూ వంటింట్లోకి వెళ్ళింది.

"నన్ను మోసంచేసి పారిపోవలనా నీ ఎత్తు?" తూలుతూ అతను కూడా ఆమె వెనకాలే వచ్చాడు.

"భలేవారే. చాలా తమాషాగా మాట్లాడుతారు మీరు." అని మంచినీళ్ళు త్రాగుతున్నట్లు నటిస్తూ, అంతక్రితం కూరలో వేద్దామని పళ్ళెంలో పెట్టుకున్న కారం చేతిలోకి తీసుకుంది.

మైకంలో అతను అది గమనించలేదు

"నీకు కూడా మంచి నీళ్ళు కావాలా?"

"నాకు నువ్వే కావాలి."

శశిరేఖ అతని దగ్గరగా నడిచింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి

అతను ఆమెను బలంగా కౌగలించుకోబోయాడు.

ఆమె చెయ్యెత్తి కారం అతని కళ్ళల్లోకి విసిరి కొట్టింది.



"బాబోయ్ మంట, మంట........ అతను కళ్ళు చేత్తో నులుముకుంటూ నిప్పు తొక్కిన కోతిలా గంతు లేస్తున్నాడు.

అంతే. ఒక్క క్షణం ఆలస్యకుండా ముందు గదిలోకి వచ్చి మంచం క్రింద ఉన్న రేకుపెట్టె తీసుకుని వీధి తలుపు తీసింది

కేశవ్ వంటింట్లో మంట భరించలేక చెవు కోసిన మేకలా అరుస్తున్నాడు.

తలుపులు దగ్గరగా లాగి పరుగులాంటి నడకతో అడ్డతోవగుండా రైలు పట్టాల దగ్గరికి వచ్చింది. ఆమెకి దూరంగా రైలాగినట్లు కనిపించింది. ఆమె దానికేసి పరుగెట్టింది.

తీరా అది దగ్గరికి వచ్చేసరికి రైలు కాదు, గూడ్సుబండి యించుమించుగా అన్ని పెట్టెలు మూసిఉన్నాయి ఎదురుగా ఉన్న పెట్టెలో మాత్రం మూడు

గేదెలున్నాయి. వాటికి గాలి తగలటంకోసం పెట్టెకి కిటికీ అంత రంధ్రం ఉంది అ పెట్టె చాలా ఎత్తుగా ఉంది అది ఎక్కటం ఎలాగో ఆమెకి తెలియలేదు.

చుట్టూ చూస్తోంది ఇంతలో ఓ పశువుల మేపుకునే కుర్రాడు అలా పోతూ ఉండటం కనిపించింది.

అతన్ని చప్పట్లు కొట్టి పిలిచింది.

అతను దగ్గరగా వచ్చాడు.

బాబూ, నన్ను కొంచెం యిందులో ఎక్కించవా ?" ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"యిది మనుషులెక్కే బండి కాదండమ్మగోరూ."

"అవును. నాకు తెలుసు ఈ గేదెలు మావే. కొంచెం సాయం చెయ్యవా ఎక్కడానికి ?" అంది శశిరేఖ.

అ కుర్రాడు కొంచెం కష్టంమీద శశిరేఖని రెండు చేతుల్తో పైకి ఎత్తాడు. అతడి సహాయంతో ఆమె అందులోకి దూకేసింది. అతను పెట్టె అందించి వెళ్ళిపోయాడు

అమె పెట్టె ఒక మూల పడుకోబెట్టి దానిమీద కూర్చుంది. మరో ప్రక్క గేదెలు గడ్డి తింటున్నాయి.

ఆమె మధ్య మధ్య భయంగా బయటకి చూస్తోంది, ఎవరేనా వస్తారేమోనని.

ఆమె కూర్చున్న అరగంటకి కానీ ఆ గూడ్సుబండి కదలలేదు బండి కదిలిన తరువాతగానీ భయం తగ్గలేదు రేఖకి.

లోపలంతా పేడవాసన వేస్తోంది.

– ఈ గేదెలు తనని పొడిచేస్తే? అన్న ఆలోచన వచ్చింది. తని విరగడ అవుతుంది తన విషాద కథ యింతటితో ముగుస్తుంది అనుకుంది.

ఆమె వాటికేసి చూసింది ఆసలక్కడ ఓ మనిషుందనీ పట్టించుకోకుండా వాటి మానాన అవి గడ్డి తింటున్నాయి.

—అన్నం తినే మనుషులకంటే గడ్డి తినే ఈ గేదెలే నయం అనుకుంది.

అ గూడ్సుబండి చీకటి పడేదాకా ప్రయాణించి ఆదేదో స్టేషన్లో ఆగింది. శశిరేఖ అటూ యిటూ చూసి పెట్టెతోసహా దూకేసింది. ఆ దూకటంలో పెట్టె మోకాలుకి కొట్టుకుని విపరీతమైన నెప్పి పెట్టింది

బాధతో 'అమ్మా' అనుకుంది. వెంటనే సీత జ్ఞాపకం వచ్చి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి

ప్లాట్‌ఫారమ్ ఉండటంవల్ల ఎత్తుమీదనుంచి దూకినా పెద్దదెబ్బలు తగల్లేదు.

ఆమె చకచకా అక్కడనుంచి కదిలి అవతలి ప్లాట్‌ఫారమ్ మీదికి వెళ్ళింది. అక్కడ చాలా సందడిగా ఉంది.

లైట్ల వెలుగులో అది రాజమండ్రి స్టేషన్ అని తెలుసుకొని అదిరిపడింది శశిరేఖ

ఇదేమిటి? తను ఎవర్ని తప్పించుకోవాలని యింతదూరం వచ్చిందో, చివరికి అతని ఊరికే వచ్చింది. ఈ రోజు కాకపోయినా, మరో రోజయినా అతను తన్నిక్కడ చూడక మానడు. ఆమె నుదురు కొట్టుకుంది, యింతలో ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

"కొద్ది నిముషాలలో విశాఖపట్నంనుండి వచ్చే గోదావరి ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారమ్ ఒకటి మీదకు వచ్చును." మైకులో గొంతు తియ్యగా పలికింది.

రెండవసారి ఎనౌన్స్‌మెంట్ అయిన రెండు నిముషాలకి 'ధన్‌ధన్' మని పెద్ద చప్పుడు చేసుకుంటూ రైలు వచ్చి ఆగింది

శశిరేఖ యింకేమీ ఆలోచించకుండా ఎదురుగా ఉన్న కంపార్ట్‌మెంట్‌లోకి ఎక్కేసింది. అక్కడ కూర్చున్న యువకుడి ఎదురుగా సీటు ఖాళీగా ఉంటే అలసటగా అక్కడ కూలబడింది. ఆమె తలంతా దిమ్మగా ఉంది. అప్పుడప్పుడు కళ్ళుమూస్తూ, తెరుస్తూ ఆకాశంలోకి చూస్తోంది కిటికీలోంచి.

* * *

"ఆ తరువాత జరిగినదంతా మీకు తెలుసు రజనీకాంత్‌గారూ." బరువుగా నిట్టూర్పు విడిచింది శశిరేఖ

ఆమె కథంతా విన్న రజనీకాంత్‌కి మనసంతా వికలమైంది. అతను బాధగా కళ్ళు మూసుకున్నాడు.

వాతావరణాన్ని తేలిక పరచాలని కన్నట్లు, శశిరేఖ కాఫీచేసి రెండు కప్పుల్లో పోసి తీసుకొచ్చింది.

"తీసుకోండి." అంది కప్పు చేతికిస్తూ.

రజనీకాంత్ కళ్ళు తెరిచాడు. "యిప్పుడు ఎందుకు శ్రమ తీసుకున్నావు రేఖా?" నొచ్చుకుంటూ అన్నాడు. ఆమె కథ విన్నందుకు కాబోలు అతని కళ్ళు చెమ్మగిల్లి ఉన్నాయి.

"నా సోదంతా చెప్పి తలకాయ నొప్పి కల్గించినందుకు." నవ్వుతూ అంది.

- గరళం మింగిన శివుడిలా ఎలా నవ్వగల్గుతోందీమె? అనుకోకుండా ఉండలేకపోయాడు రజనీకాంత్.

కాఫీ త్రాగి రజనీకాంత్ లేచాడు.

"గుడ్‌నైట్ రేఖా. బీ బోల్డ్." అంటూ తన యింట్లోకి వెళ్ళిపోయాడు.

శశిరేఖ తలుపు వేసుకుని పడుకొంది.

* * *

రజనీకాంత్ మూడు రోజులపాటు తీవ్రమైన ఆలోచనలలో మునిగిపోయాడు శశిరేఖ కథవిన్న తరువాత, ఆమెమీద ప్రేమ గౌరవం మరింత ఎక్కువ అయ్యాయతనికి. ఆమెపట్ల విధిచేసిన పరిహాసానికి విపరీతంగా ఆవేశపడి. పోతున్నాడు. ఆమె తండ్రిని తలుచుకుంటేనే, పీకపిసికి చంపేయాలనిపిస్తోంది

అతను బాగా ఆలోచించి చివరికి ఒక నిర్ణయానికి వచ్చాడు ఏది ఏమైనా తను శశిరేఖ లేకుండా బ్రతకలేడు. ఒక్క వివాహిత అన్న విషయం తప్పిస్తే ఆమెలాంటి భార్య తనకి దొరకటం అసంభవం.

-అయినా ఎంత మంది మగవాళ్ళు అందులో పిల్లలున్న వాళ్ళుకూడా రెండో పెళ్ళి చేసుకోవట్లేదు? శశిరేఖ చేసుకుంటేమాత్రం తప్పేమిటి? మగవాడికో న్యాయం ఆడదానికో న్యాయమా? విధిచేసిన పరిహాసానికి ఆమె జీవితాంతం మోడులాగానే బ్రతకాలా? ఒకవేళ తను వేరే అమ్మాయిని పెళ్ళి చేసుకున్నా. పెళ్ళికాని అమ్మాయంతా పెళ్ళికి ముందు పతివ్రతలేనన్న గ్యారంటీ ఏముంది? అలాటి వాళ్ళకంటే గౌరవంగా బ్రతికిన శశిరేఖ ఎంతో నయం.

తాను ఆమె నొసట కుంకుమ దిద్ది తిరిగి ఆమె జీవితంలో వసంతం పూయిస్తాడు. అప్పుడు ఆమె కళ్ళల్లో వెలిగే వెలుగులు తన మనసులో మధుర సంగీతాన్ని ఆలపిస్తాయి అనుకున్న రజనీకాంత్‌కి మనసు తేలికపడింది.

మర్నాడు ఆమెకది చెప్పేవరకూ అతని ఆరాటం తగ్గలేదు అతని నిర్ణయం విన్న శశిరేఖ కంగారు పడింది.

"వద్దు రజనీకాంత్‌గారూ. ఈ విధ్యాగ్యురాలికోసం మీ బంగారు భవిష్యత్తు పాడుచేసుకోకండి. మీలాంటి సహృదయుణ్ని చేసుకోటానికి నాకంటే అన్ని విధాల యోగ్యులైన అమ్మాయిలు ముందుకి వస్తారు. నాజీవితంలో పెళ్ళి అనే అంకం ముగిసింది యిప్పటికే జీవితంలో ఎంతో అలిసిపోయిన నేను మీకేవిధంగానూ సుఖం యివ్వలేను. దయచేసి నన్ను మర్చిపోయి మరో అమ్మాయిని పెళ్ళిచేసుకోండి." రెండు చేతుల్తో నమస్కరించింది శశిరేఖ

"అవన్నీ ఎందుకు? నేనంటే యిష్టమా కాదా చెప్పు?"

ఆ ప్రశ్నకి ఆమె కంటిపాపలు చేపపిల్లల్లా అటూ యిటూ కంగారుగా కదిలాయి.







"రెండు జీవితాలు ముడిపడాలంటే కేవలం 'యిష్టం' ఒకటే సరిపోదు రజనీకాంత్‌గారూ. మీ అమ్మగారికి మీ మీద ఎన్నో ఆశలుండవచ్చు. ఆదర్శం కోసం చేసుకున్న పెళ్ళిళ్ళు జీవితాంతం ఆనందంగా సాగకపోచ్చు. మీరు ఆవేశంలో తీసుకున్న నిర్ణయానికి తరువాత విచారిస్తే మనిద్దరి జీవితాలు నరకం అవుతాయి."

"అవు రేఖా" అతను బాధగా చూశాడు.

"నేను నిన్ను ఏదో ఆదర్శంకోసం చేసుకోవాలనుకోవట్లేదు. నాకు మన స్ఫూర్తిగా నువ్వు నచ్చావు. నీ కథ తెలియకముందే పెళ్ళంటూ చేసుకుంటే నిన్నే చేసుకోవాలనుకున్నాను. నేను ఏదైనా ఒకసారి నిర్ణయం తీసుకుంటే అది జీవితంలో మారదు."

ఇక ఆవేశంలో నిర్ణయం తీసుకున్నానన్నావు. అది చాలా పొరపాటు రేఖా. నేను అన్ని విషయాలూ ఎంతో నిశితంగా ఆలోచిస్తేనేగానీ ఏపని చెయ్యను.

"ఇక మా అమ్మని ఒప్పించే భారం నాది" ఆమె ఏమంటుందోనని ఆత్రంగా చూశాడు.

నేను మరో పెళ్ళిచేసుకుని శివరాంకి ద్రోహం చెయ్యలేను రజనీకాంత్ గారూ."

"అదే నిజమైతే. నువ్వీ పెళ్ళిచేసుకోక పోతేనే అతనికి ద్రోహంచేసిన దానివవుతావు"

ఆమె ఓడిపోయినట్లు అతనికేసి చూసింది.

"మీరు మరోసారి ఆలోచించుకోండి రజనీకాంత్‌గారూ." అంటూ లోపలికి వెళ్ళబోయింది.

అతను ఆమె చెయ్యిపట్టుకుని ఆపాడు. "నేను యిక ఆలోచించవలసిందేమీ లేదు రేఖా. వ్యక్తిగతంగా నేనంటే యిష్టంలేకపోతేనే ఈ పెళ్ళి మానేద్దాం. తొందరలేదు. నీ నిర్ణయం రెండు రోజుల తరువాత చెప్పు " ఆమె చెయ్యి మృదువుగా నొక్కి వదిలేశాడు.

తరువాత రెండు రోజులు రజనీకాంత్ ముళ్ళ మీదున్నట్లు గడిపాడు. అతని మనసు ఆత్రతపడుతోంది శశిరేఖ ఏమంటుంది? ఒప్పుకుంటుందా లేదా? ఇదే ఆలోచనతో సతమతమయ్యాడు

మూడోరోజు ఉదయాన్నే రేఖ అతనిగదిలో కాఫీ కప్పుతో ప్రత్యక్షమైంది. అతను బహుమతిగా యిచ్చిన పట్టుచీరలో విరబూసిన తెల్లకలువలా ఉంది

ఆ చీరలో ఆమెనిచూసి రజనీకాంత్ కళ్ళు మెరిసాయి

"రేఖా ఏమాలోచించావు?" అన్నాడు ఆలస్యం భరించలేనట్లు

తలవంచుకుని కాలి బొటనవ్రేలు నేలమీదరాస్తూ "మీ యిష్టం" అంది. ఆ మాటకతని మొహం వెయ్యి ఓల్టుల బల్బులా వెలిగింది. మనసులో కల్గే భావావేశాన్ని అణుచుకోలేక ఆమెని రెండుచేతుల్తో గిరగిరాత్రిప్పి లేత పెదవుల పై గాఢంగా చుంబించాడు

అతని స్పర్శకి ఆమె తనువు విలువెల్లా పులకించింది. సిగ్గుతో కందిపోయిన మొహాన్ని దోసిల్లో కప్పుకుంటూ అతని గదిలోంచి పారిపోయింది.

రజనీకాంత్ తృప్తిగా నవ్వుకున్నాడు.

o o o

ఉదయం ఎనిమిది గంటల బస్సులో శాంతమ్మ రేవతి ఊర్నించి దిగారు

చెల్లెలు పోయిన బెంగవల్ల కాబోలు శాంతమ్మగారు నీరసంగా, చిక్కినట్లు కనిపించింది అవిడ చెల్లెలు పోయిందని తెలిసిన శశిరేఖ వాళ్ళని ఎలా పరామర్శించాలో తెలియక వెళ్ళి, వాళ్ళ దగ్గరగా కూర్చుంది.

కాపేపున్నాక ఆమే కాఫీ పెట్టి తెచ్చింది. అప్పటికి వంటకూడా తనేచేసి రజనీకాంత్‌తో పాటు హాస్పిటల్‌కి వెళ్ళింది.

"చూడు రజనీ." అతను హాస్పిటల్‌కి వెళ్ళబోతుంటే శాంతమ్మ పిలిచింది.

రజనీకాంత్ ఏమిటన్నట్లు వెనక్కి తిరిగాడు.

"మీ బాబాయి, పెళ్ళాం పోయిందన్న బాధలో ఏమీ పట్టించుకోవట్లేదు. ఆ

పొలం, యిల్లు అమ్మేసి పట్నం వెళ్ళాలని పిల్లలు గొడవ పడుతున్నారు. అమ్మ కాలు, వ్యవహారాలు చూచుకునే వయసా పిల్లలకి లేదు. మామరిది చూస్తే వ్యవహారాలేవీ పట్టకుండా ఉన్నాడు. అందుకని నిన్నో వారం రోజులపాటు పంపిస్తానని చెప్పాను. ఓమాటు వాళ్ళని పరామర్శించినట్లూ ఉంటుంది నువ్వు రేపురాత్రి బయలుదేరి వెళ్ళు" అందావిడ.

"రేపు వెళ్ళి చూసి వస్తాను కానీ, వారంరోజులు ఉండటం నాకెక్కడ కుదుర్తుందమ్మా?"

"నువ్విలా అడ్డు చెప్తావని ముందే అనుకున్నాను. అయిన వాళ్ళని కష్టంలో కాకపోతే ఎప్పుడాదుకుంటాము? మన పనులెప్పుడూ ఉండేవే. ఏదో వీలు చేసుకుని వెళ్ళాలి గానీ," ఆమె గొంతు నిష్టూరంగా ధ్వనించింది. తల్లి మనసు యింకా నొప్పించటం యిష్టంలేక సరేననక తప్పలేదు అతనికి. శశిరేఖతో హాస్పిటల్‌కి వెళ్తూ, దారిలో అన్నాడు రజనీకాంత్

"రేఖా. నిన్ను చూడకుండా వారంరోజులు ఎలా ఉండాలి?" అతని మాటలకి చిన్నగా నవ్వింది "నన్ను చూడకుండా యిన్నాళ్ళూ పెరిగారు"

"అది వేరు రేఖా ఒకసారి నువ్వు నాదానివి అనుకున్న తరువాత ఎడబాటు భరించటం కష్టం. అంతెందుకు నువ్వుండగలవా చెప్పు నన్ను విడిచి?"

"చూడండి కాంత్, ఎవరికైనా నువ్వీ కష్టాలు పడగలవా? అంటే, ఎవరూ సరియైన సమాధానం చెప్పలేరు. నేను భరించగలననేనా ఆ దేముడు యింత వరకూ నన్నిన్ని బాధలు పెట్టాడు?

యిప్పుడు యిదీ అంతే. ఏదైనా నెత్తిమీద వచ్చి పడిన తరువాత అనుభవించక తప్పదు" సీరియస్‌గా అంది.

అతనేదో చెప్పబోయాడు.

ఈలోగా హాస్పటల్ రావటంతో సంభాషణ అక్కడితో ఆగిపోయింది.

ం ం ం

మర్నాడు అయిష్టంగానే, అనుకున్న ప్రకారం రజనీకాంత్ హనుమకొండ వెళ్ళాడు.

శశిరేఖ హాస్పిటల్‌కి వెళ్ళి వస్తోంది. రెండురోజులు గడిచేటప్పటికి ఆమెకి కూడా రజనీకాంత్‌ని చూడకుండా ఉండలేననిపించసాగింది.

శశిరేఖ, కాంతమ్మగారిలో ఈమధ్య ఓమార్పు గమనించింది అదిదెందుకో ఊరినుంచి తిరిగి వచ్చేనప్పటినుంచీ తన నేదో చిన్న చూపు చూస్తున్నట్లనిపిస్తోంది

రేవతి కూడా ముభావంగా ఉంటోంది. తను పలుకరించినా సరిగా మాట్లాడటం లేదు శశిరేఖకి చాలా బాధపిపించింది.

ఈ పూర్వవల్ల ఆమె కూడా యిదివరకటిలా ఫ్రీగా వాళ్ళింటికి వెళ్ళలేక పోతోంది

రజనీకాంత్ ఊరు వెళ్ళి సరిగ్గా నాల్గురోజులైంది. ఇంకెంత? మరో మూడు రోజులు అనుకుంది

ఆరోజు సాయంత్రం ఏమీ తోచక తన గదిలో పడుకుని వారపత్రిక తిరగేస్తోంది.

ఇంతలో దగ్గరగా ఉన్న తలుపులు తీసుకొని రేవతి లోపలికి వచ్చింది. పుస్తకంలోంచి తలెత్తి "కూర్చో రేవతి." అంది శశిరేఖ సంతోషంగా.

"అమ్మ నిన్నోమాటు రమ్మంది." అంది రేవతి కూర్చోకుండా.

"యిప్పుడేనా?" శశిరేఖ ఆశ్చర్యంగా చూసింది.

"ఊఁ...."

శశిరేఖ గదికి తాళంపెట్టి ఆమెతోపాటు వాళ్ళింట్లోకి నడిచింది.

కాంతమ్మగారు హాల్లో సోఫామీద పడుకుని ఉన్నారు.

శశిరేఖ ఆత్రంగా ఆవిడ ప్రక్కనే కూర్చుంటూ "ఒంట్లో బావుండ్లేదా?" అంది.

"ఒంట్లో బానే ఉంది మనసే బావుండ్లేదు."

"మీరిలా బాధపడుతూ కూర్చుంటే ఎలా? మీ చెల్లెలు పోయిన లోటు ఎవరూ తీర్చలేనిదీ భరించలేనిదే అనుకోండి. కాని పోయిన వాళ్ళతోపాటు మనమూ పోతామా?" ఆ సమయంలో శశిరేఖ మనసులో శివరాం మెదిలాడు.

కాంతమ్మగారి మొహం గంభీరంగా మారింది

ఆవిడేమీ మాట్లాడక పోయినప్పటికి మళ్ళీ శశిరేఖే అంది.

"మీరిలా బెంగతో ఆరోగ్యం పాడుచేసుకుంటే, మీ పిల్లలేమైపోతారు చెప్పండి. వాళ్ళకోసమైనా మీరు సంతోషంగా ఉండాలి. మీకేదైనా అయితే వాళ్ళు భరించలేరు."

"అవును. నాకేమైనా అయితే వాళ్ళు భరించలేరు. అలాగే వాళ్ళకేమైనా అయితే నేను కూడా భరించలేను. వాళ్ళిద్దర్నీ చిన్నప్పటి నుంచీ అనేక కష్టాల కోర్చి పెంచాను కళ్ళల్లో పెంచుకున్నాను."

ఆవిడ మాటలు శశిరేఖకి వింతగా తోచాయి ఆవిడేం చెబుతోందో అర్థంగాక ఆశ్చర్యంగా చూస్తోంది.

"నాబాధ అసలు మా చెల్లెలు పోయినందుకు కాదు."

"మరి?" తెల్లబోయింది శశిరేఖ.

"మా వాడేదో, స్నేహితుడి చెల్లెలవి, ఉద్యోగంకోసం వచ్చి కొన్నాళ్ళు మనింట్లో ఉంటుందీ అంటే కాదనలేకపోయాను. ఆ తరువాత నువ్వెన్నాళ్ళకీ యింట్లోంచి కదలకపోయినా, ఏదో అనాథవై ఉంటావని, అలాంటి వాళ్ళంటే మా వాడికి జాలనీ సరిపెట్టుకున్నాను. కానీ నువ్వు ఏకంగా నెత్తికెక్కి కూర్చున్నావు. నీ అందం ఎఱజూపి వాడ్ని వల్లో వేసుకున్నావు.

నువ్వు సౌభాగ్యం పోగొట్టుకున్న దానివని తెల్సినా వాడు మనసు మార్చుకో లేదంటే, వాడ్నెంత పిచ్చివాడ్ని చేశావో అర్థం అవుతోంది. నీమీద మోజుకొద్దీ బుద్ధిలేక పెళ్ళికావల్సిన చెల్లెల్నీ, కని పెంచిన కన్నతల్లినీ వాడు మర్చిపోతే నీకైన యింగితం ఉండొద్దూ? మీ యిద్దరికీ యిష్టమైతే చాలనుకున్నావా?

మా వంశం ఎలాంటిది? నిప్పు కడిగే వంశం. ఓమాలు విధవై కూడా 'తగుదునమ్మా' అంటూ రెండో పెళ్ళికి సిద్ధమయ్యావు. నువ్వు వాడు పెళ్ళి చేసుకుంటే, రేవతికీ జన్మలో పెళ్ళవుతుందా?"....

శశిరేఖ నెత్తిన పిడుగుల వర్షం కురిసినట్లైంది.

ఆయాసం తీర్చుకోటానికన్నట్లు శాంతమ్మగారు ఓక్షణం ఆగింది.

కూతురికేసి చూస్తూ "రేవతీ!" అంది.

అది అర్థమైనట్లు రేవతి లోపలికి వెళ్ళి ఓ కవరు తెచ్చి తల్లి చేతికిచ్చింది. ఆవిడ అది టీపాయ్‌మీద పెట్టి, రెండు చేతులెత్తి శశిరేఖకి నమస్కరించింది.

ఈ కవరులో వెయ్యి రూపాయలున్నాయి. అవి తీసుకుని యిక మా మానాన మమ్మల్ని వదిలేయ్ తల్లీ. తల్లిగా నా కొడుకుమీద నాకెన్నో ఆశలున్నాయి. నేను నిశ్చింతగా బతికుండాలని నీకుంటే, ఎక్కడికి వెళ్ళినా సరే, మళ్ళీ జీవితంలో మా అబ్బాయికి కనిపించకుండా వెళ్ళిపో."

ఆవిడ కర్ణకఠోరమైన మాటలకి ఖిన్నురాలైంది శశిరేఖ. డబ్బిచ్చి తనను అవమానించినందుకు ఆమెలో పౌరుషం బుస్సున పొంగింది

"ఒకప్పుడు తల్లిలా ఆదరించిన మీరే ఈ రోజున అనరాని మాటలన్నీ అన్నారు. మీ అబ్బాయిని నేను డబ్బుకోసం వల్లో వేసుకోలేదు. అతన్ని పెళ్ళి చేసుకోమని కూడా నేను ప్రాధేయపడలేదు. మీ అబ్బాయిని మీరనుకున్న విధంగా దారిలో పెట్టుకోలేక, ఏమీ అనలేక, అతనిమీద కోపమంతా నామీద తీర్చుకున్నారు. మీ డబ్బుని, మీ అబ్బాయినీ మీరే అట్టిపెట్టుకోండి." కన్నీళ్ళతో శశిరేఖ విసురుగా వెళ్ళిపోయింది.

తన గదికి తిరిగి వచ్చిన శశిరేఖ మంచంమీద వాలిపోయింది.

అలా వెక్కి వెక్కి ఎంతసేపు ఏడ్చిందో ఆమెకే తెలియదు

– అయినా రజనీకాంత్ ఈ విషయం తల్లితో ఎప్పుడు చెప్పి ఉంటాడు? వాళ్ళు ఊర్నించి తిరిగి వచ్చిన తరువాత అతను ఉన్నది ఒక్కరోజే కదా? అసలు తనేం పాపం చేసుకుందని తన జీవితంలో యిన్ని మలుపులు, కష్టాలూ? తన పిచ్చి కాకపోతే, అతడంటే మాత్రం ఈ పెళ్ళి జరుగుతుందని తనెలా ఆశపడింది?

ముడుచుకుపోయిన మొగ్గను రేకులూ విప్పబోతే ఏమవుతుంది?

– రేకులు రాలిపోతాయి.

అదేచేసి తనను బలిపశువును చేశాడతను.

– దేముడు వరమిచ్చినా, పూజారి వరమివ్వడంటే యిదే కాబోలు

స్త్రీకి కొన్నిసమయాల్లో పురుషుడే కాకుండా, స్త్రీ కూడా శత్రువే అవుతుందని అనుకున్న శశిరేఖ విషాదంగా నవ్వుకుంది.

* * *

రజనీకాంత్ ఊరినుంచి తిరిగి వచ్చేసరికి అవుట్‌హౌస్ తాళంవేసి ఉంది

"శశి అప్పుడే హాస్పిటల్‌కి వెళ్ళిపోయిందా?" అనుకుంటూ గేటు తీసుకుని యింట్లోకి అడుగుపెట్టాడు ఆ విషయం తల్లిని కానీ, చెల్లెల్నిగానీ అడగటానికి అతనికి అభిమానం అడ్డువచ్చింది రేఖని చూసేదాకా అతనికి యింట్లో కాలు నిలవలేదు

కాఫీ త్రాగి "హాస్పిటల్‌కి వెళ్ళొస్తానమ్మా" అంటూ బయటపడ్డాడు.

కాసేపట్లో శశిరేఖని చూస్తాను అనుకుంటే అతనికి చాలా సంతోషం కల్గింది. చేతిలో ప్యాకెట్ మృదువుగా, మెత్తగా ఉంది. తను తెచ్చిన కాశ్మీరు సిల్క్ చీర చూసి రేఖ ఎంత సంతోషిస్తుందో?

ఎడబాటు తరువాత తొలి కలయిక ఎంత మధురం?

ఏవేవో ఆలోచిస్తూ హాస్పిటల్లో అడుగు పెట్టాడు.

కానీ అతనూహించినట్లు శశిరేఖ 'గుడ్ మార్నింగ్' అంటూ ఎదురు రాలేదు. ఆమె రెండు రోజులనుంచీ అసలక్కడికి రావేలేదని కాంపౌండర్ చెప్పాడు.

రజనీకాంత్ మనసేదో కీడు శంకించింది.

గోడకి కొట్టిన బంతిలా, ఎంత వేగంగా వచ్చాడో, అంత వేగంగా తిరిగి యింటికి వెళ్ళాడు.

ఇంటికి రాగానే చెల్లెల్ని పిలిచి అడగాడు "శశిరేఖ ఏది?"

ఆమె ఎక్కడికో వెళ్ళిపోయిందని కొంచెం భయపడుతూ చెప్పింది రేవతి.

అతను రాయిలా బిగుసుకుపోయాడు.

"అమ్మా! .... ...." అది పిలుపు కాదు. గర్జనే.

కొడుకు పిలుపుకి ఉలిక్కిపడ్డ శాంతమ్మ, ఓ క్షణం తరువాత తనలో తానే సర్దుకుని, "ఏమిటీ? అంటూ వచ్చింది.

"శశిరేఖ ఎక్కడికి వెళ్ళింది?" మామూలుగా అడిగాననుకున్నా, అతని గొంతు కరుకుగానే ధ్వనించింది.

"బావుంది. ఎక్కడికో వెళ్ళిందో నాకేం తెలుసు? వెళ్ళిందని మాత్రం తెలుసు. అదీ పెట్టి పట్టుకుని వెళ్ళింది గాబట్టి. అయినా ఆ అమ్మాయి ఎక్కడికో వెళ్తే నన్ను నిలదీసి అడుగుతావేం?" ఎందుకో ఆవిడ కంఠం వణికింది.

"ఎక్కడికి వెళ్తుందో మీకు చెప్పకుండానే వెళ్ళిందంటావు? అది నన్ను నమ్మమంటావు?"

శాంతమ్మగారికి అసహనం ముంచుకొచ్చింది "చేసిన పనికి సిగ్గుపడవలసింది పోయి పైగా నాతో దెబ్బలాడుతావా? మన పరువు ప్రతిష్ఠలు, చెల్లెలి పెళ్ళి ఏమైనా ఆలోచించావా అసలు? నీకు పెళ్ళి చేసుకోవటానికి ఆ పొంగునా లేంది తప్ప యింకెవరూ దొరకలేదా? నీకేం ఖర్మ? నువ్వు కావాలనుకుంటే దాన్ని మించిన అందగత్తెలే నీకాళ్ళ దగ్గరుంటారు." ఆవేశంగా అంది.

తల్లి మాటలకి అతని కళ్ళు అగ్నిగోళాలే అయ్యాయి.

- అయితే శశిరేఖని పీక్కే వెళ్ళగొట్టారన్నమాట. అయినా తల్లికి ఈ సంగతులన్నీ ఎలా తెలిశాయి? శశిరేఖ చెప్పిందా?

అంత తొందరెందుకు శశిరేఖకి? తాను ఒప్పిస్తానని చెప్పాడు కదా?

అతని మనసు పరిపరి విధాల పోయింది.

అయితే శశిరేఖకిగానీ, రజనీకాంత్‌కిగానీ తెలియని విషయం ఒకటుంది.

శాంతమ్మగారు ఊరు వెళ్ళే ముందర శశిరేఖకి సాయం పడుకోవటానికి రోజూ హనుమాయమ్మగారిని రమ్మని చెప్పింది. కానీ ఆ రోజు శశిరేఖ తొందర పడుకోవటం వల్ల హనుమాయమ్మగారికి ఆ అవకాశం రాలేదు. మర్నాడు రాత్రి వచ్చిన హనుమాయమ్మగారు, శశిరేఖ, రజనీకాంత్‌ల మాటలన్నీ తలుపు చాటున నుంచుని వింది. ఆ రోజునుంచీ వారిద్దరినీ ఒక కంట కనిపెడుతూ ఉందని, జరిగిన సంగతులన్నీ తిరిగి శాంతమ్మగారికి చెప్పేవరకూ ఆవిడ సరిగ్గా నిద్రపోలేదని, వారిద్దరికి తెలియదు.

తల్లితోపాటు తనుకూడా ఆవేశపడ్డే లాభంలేదని, తెచ్చి పెట్టుకున్న శాంతంతో, ఆవిడకి నచ్చచెప్పే ప్రయత్నంలో అన్నాడు.

"అమ్మా నాకు భార్యగా రాబోయే అమ్మాయి నన్నేకాకుండా నిన్నుకూడా సుఖపెట్టేదిగా ఉండాలి. శశిరేఖ మనలో ఎంతోబాగా కలిసిపోయింది. ఆమె నిన్ను కోడలిగా సుఖపెట్టగలదని నానమ్మకం. ఆమెకి ఒకసారి పెళ్ళైందన్న విషయం వదిలేస్తే, ఇక వేరే లోపాలు ఆమెలో నీకేమైనా కనిపించాయా అమ్మా?"

ఆమె కూడా ఇంచుమించు నీలాంటి పరిస్థితిలోనే ఉంది. కానీ నీకు యిద్దరు పిల్లలున్నారు. ఆమె వాళ్ళుకూడా లేని ఒంటరిది. ఒక వేళ నీకూతురే అలాంటి పరిస్థితిలో ఉంటే యిలా మాట్లాడేదానివా? పాటి స్త్రీగా సానుభూతితో అర్థం చేసుకొని నాతో సహకరించమ్మా. ఆమె జీవితం తిరిగి చిగురిస్తే నీకు మాత్రం ఆనందం కాదామ్మా?

ఆ మాటతో మండిపడింది, శాంతమ్మ.

"నా కూతురికే అలాంటి పరిస్థితి వస్తే నీ ఖర్మ అంటూ ఓ మూల కూచో బె తాను. అయినా అలాంటి అశుభం పలకటానికి నీకు నోరెలా వచ్చింది? (తనూ అదేమాట తిరిగి అందని మర్చిపోయింది శాంతమ్మ.)

అయినా ఆమెను ఉద్ధరించటానికి నువ్వు తప్ప లోకంలో యింకెవరూ లేరా? లేకా అంటే వాళ్ళంతా లోకజ్ఞానం ఉన్న వాళ్ళన్నమాట. ఒక వేళ నువ్వామెని




పెళ్ళిచేసుకున్నా. ఇంకా లోకంలో యిలాంటి నిర్భాగ్యులు చాలా మంది ఉన్నారు. మొత్తం సమాజం అంతా నిన్నుచూసి మారిపోయి వాళ్ళందర్నీ పెళ్ళి చేసుకోదు. కాబట్టి నువ్వీపిచ్చి యిక మాని, శుభ్రంగా మరో అమ్మాయిని పెళ్ళి చేసుకో." చాలా సింపుల్ అన్నట్లు తేల్చేసిందావిడ.

రజనీకాంత్ జీవితంలో మొదటిసారిగా తల్లికేసి అసహ్యంగా చూశాడు.

"నీలాంటి తల్లులంతా అడ్డుపడటం వల్లే ఆడదాని ప్రగతి అంతటితో ఆగిపోయిందమ్మా. ఎవరికి వారు మేమెందుకు మంచిపని చేయ్యాలి? ఎవరో ఒకరు చెయ్యక పోరులే అనుకోవటంవల్లే సమాజం కుళ్ళిపోతుంది. ఒక్కొక్క మగాడు మూడేసి, నాల్గేసి పెళ్ళిళ్ళు చేసుకోవచ్చుగానీ, 'ఆడదానికి ఒకే పెళ్ళి' అని ఎవరు పెట్టారమ్మా రూల్? అంతెందుకు? నాకే పెళ్ళాం పోతే నువ్వు రెండో పెళ్ళి చేయకుండా ఉంటావా? ఆడదానికి ఆడదే శత్రువని నిరూపించావమ్మా. సంఘంలో మార్పు రావాలంటే ఎవరో ఒకరు మొదలుపెట్టక తప్పదు. ఆ మార్పు నాతోనే మొదలవుతుంది. సంఘమంటే ఎక్కడో లేదు. మనలాంటి వారిద్దరు కలిస్తే అదే సంఘం.

ఆఖరిసారిగా చెప్తున్నాను. నేను పెళ్ళంటూ చేసుకుంటే శశిరేఖనే చేసుకుంటాను." అతను ఆవేశంగా బయటికి వెళ్ళిపోయాడు.

కొడుకు నిర్ణయం విని విస్తుపోయిందావిడ.

—అయితే ఈ పైత్యం దానిక్కూడా వీడే ఎక్కించి ఉంటాడనుకొంది.

* * *

రజనీకాంత్ నిరాశగా రోడ్లన్నీ తిరిగివచ్చి రాత్రిపదకొండు గంటలకి యింటికి వచ్చాడు.

తనకోసం టేబిల్‌మీద భోజనం కంచంలో మూతపెట్టి ఉంది. అతను మంచి నీళ్ళు మాత్రం తాగి వెళ్ళి పడుకున్నాడు. తలనొప్పితో కణతలు పగిలి పోతున్నాయి. అది టాబ్లెట్లవల్ల తగ్గే నొప్పికాదని తెలుసు తనకి. నిద్రపట్టక పక్కమీద అశాంతిగా దొర్లుతున్నాడు. అతనికి శశిరేఖ గది గుర్తొచ్చింది. వెంటనే పక్కమీదినుంచి లేచి, తాళంతీసి ఆమె గదిలో అడుగు పెట్టాడు.

ఆమె తాలూకు వస్తువులు అక్కడ ఏమీలేవు. అతను నిరుత్సాహంగా వెనుతిరగబోతుంటే, మూసి ఉన్న కిటికీలో ఒక కాగితం మడత కనిపించింది. అతడు ఆత్రంగా దాన్నందుకున్నాడు.

రజనీకాంత్‌గారూ,

మీకు చెప్పకుండా, మీ యిల్లువదిలి వెళ్ళిపోతున్నందుకు నన్ను క్షమించి, మరిచిపోండి. నాకోసం ఎక్కడా వెతికే ప్రయత్నం చేయవద్దు.

శశిరేఖ.

అది చదివి నిరాశగా నుదురు కొట్టుకున్నాడు. అంతలోనే అతని మనసులో ఆశ తళుక్కుమంది.

శశిరేఖ తల్లి దగ్గరకే వెళ్ళి ఉంటుందనిపించింది. అంతకంటే మరో చోటికి వెళ్ళేందుకు ఆమెకి ఎవరున్నారు?

అతనో నిశ్చయానికి వచ్చాడు. అది అతనికి తాత్కాలికంగా ఉపశమనం కల్గించింది.



మర్నాడు బస్‌లో విజయవాడ బయలుదేరాడు. అతను విజయవాడలో దిగేటప్పటికి రాత్రి రెండయింది.

అంతరాత్రి ఎక్కడని వెతుకుతాడు వాళ్ళిల్లు? ఆ పూటకి రైల్వే స్టేషన్‌కి వచ్చి వెయిటింగ్ రూమ్‌లో పడుకున్నాడు.

తెల్లవారుతూనే ముఖం కడుక్కుని, అదివరకు శశిరేఖ చెప్పిన గుర్తుల ప్రకారం బయలుదేరాడు.

అతను సందులు గొందులన్నీ తిరిగి ఆమె చెప్పిన యిల్లు పట్టుకునేసరికి రెండుగంటల పైగానే పట్టింది.

జేబులోంచి రుమాలు తీసి మొహానికి, మెడకి పట్టిన చెమట తుడుచుకుని యింటికేసి చూశాడు.

ఆ యిల్లు పెంకుటిల్లు. చాలా పాతది. చుట్టూ ఉన్న ప్రహారీగోడ సగం పైగా పడిపోయి ఉంది. యింటిముందు కొద్దిగా ఖాళీస్థలం మాత్రం ఉంది. . శిధిలావస్థలో ఉన్న ఆ యిల్లు–ఆ యింటివారి పరిస్థితిని చెప్పకనే చెబుతోంది.

అతను రెండడుగులు వేసి తలుపుకొట్టాడు.

అతని గుండెలు వేగంగా స్పందిస్తున్నాయి. ఒకవేళ శశిరేఖ తలుపుతీస్తే?

–అంత అదృష్టమా తనకి? ఆమె తలుపు తియ్యాలని మనసులో భగవంతుణ్ణి కోరుకుంటున్నాడు.

తలుపులు తెరుచుకున్నాయి. అతని మొహం చిన్నబోయింది. తలుపు తీసింది శశిరేఖ కాదు. ఆమె తల్లిలాగా కూడా లేదు. ఓ అరవైఏళ్ళ వృద్ధురాలు.

"ఓరు బాబూ?" అంది. కళ్ళదగ్గర చెయ్యిపెట్టుకొని చూస్తూ "భాస్కర్రావు ఉండే యిల్లు యిదేనాండి?"

…….సమాధానం రాలేదు.

ఆమె కర్థంకాలేదులా ఉందనుకొని, "ఆయన భార్య పిల్లలూ ఉండే యిల్లదేనా?" ఈసారి కాస్త బిగ్గరగా అడిగాడు.

"అయమ్మా బాబూ. కజంగా సీతమ్మ తల్లేనండి. అమెప్పుడు కూడలేదండీ. ఆ పచ్చినోడ్ని ఒగ్గేసి, పిల్లలతో ఏ ఊరో ఎల్లిపోయిందంట." అంది.

–'ఆ పచ్చినోడు' భాస్కర్రావుగా అర్థం చేసుకున్నాడు రజనీకాంత్.

"పోనీ వాళ్ళు ఏ ఊరెళ్ళారో తెలుసా?"

ఆమె అడ్డంగా తలాడించింది.

"అతనేమయ్యాడు?" అంత కుతూహలం లేకపోయినా అడిగాడు.

"అయమ్మా ఇల్లు మాకమ్మేసి బోయింది గదండీ. అడు అండీ, నీడలేక ముష్టెత్తుకొని తాగి తాగి రోడ్లమీద పడి సచ్చినాడండీ."

రజనీకాంత్ నిరాశగా వచ్చినదారి పట్టాడు.

ఉన్న ఒక్క ఆశ ఆరిపోయింది. శశిరేఖ యిక తనకి కనపడదు అనుకుంటే అతని మనసంతా ముక్కలై పోయినట్లైంది.

* * *

రజనీకాంత్ యింటికి తిరిగొచ్చేసరికి, ఒక యాభైఏళ్ళ బట్టతలాయన తల్లితో అంటున్నాడు.

"అబ్బాయిని కనుక్కొని ఏ విషయం రెండురోజుల్లో చెప్పండి. మళ్ళీ వస్తాను." వెళ్ళటానికన్నట్లు వెనక్కి తిరిగాడు.

"అదిగో. మాటల్లోనే వచ్చేశాడు. యిప్పుడే అడిగితే పోలా?" అన్నాడు కాంతమ్మవైపు తిరిగి.

ఆవిడ కంగారుగా అతన్ని ప్రక్కకి లాక్కుపోయి రహస్యంగా అంది. "నేను తరువాత కనుక్కొని మీకు కబురు చేస్తానులెండి. యిప్పుడే కదా ఊరినుంచి వచ్చాడు."

దట్టాకుల సుబ్బిషి అలాగే నన్నట్లు తల ఊపాడు.

నీకు తలపై జుట్టులేనట్లే, తలలో పరకు కూడా లేదనుకుంది కాంతమ్మ.



ఆరోజు శనివారం.

హారం, వర్జం చూసుకుని రాత్రి కొడుకు గదిలోకి వచ్చింది కాంతమ్మ.

ఆ సమయంలో రజనీకాంత్ ఏదో చదువుకుంటున్నాడు. కానీ అతని దృష్టి దానిమీద లేదు. అతను తల్లికేసి ఓమాటు తలత్రిప్పి చూసి మళ్ళీ పుస్తకంలో తల దూర్చాడు.

"మాట్లు రజనీ." అంది.

అతను ఏమిటన్నట్లు చూశాడు.

"నీతో కొంచెం మాట్లాడాలి." అంది.

"మాట్లాడుతూనే ఉన్నావుగా." అతని పెదవుల మీద చిన్న దరహాసరేఖ మెరిసింది.

అతని నవ్వుమొహం చూసి జారిపోతున్న ధైర్యాన్ని కూడగట్టుకుందికాంతమ్మ. "శాస్త్రిగారు ఓ మంచి సంబంధం తెచ్చారు. ఆయన వారం రోజులనుంచీ మనింటిచుట్టూ తిరుగుతున్నారు. నిన్నోమాట అడగాలని చెప్పాను."

– నీ మాటంటే నాకెంతో విలువ అన్నట్లు అంది.

"దాన్ని ఓసారి అడిగి నీకు మంచిదనిపిస్తే చేసేద్దాం." అన్నాడు

"దాన్ని అడగటం ఏమిటి?" అంది ఆవిడ అర్థంగాక.

"చెల్లాయి యిష్టపడకపోతే వద్దు. చేసుకునేది అదికదా." అన్నాడత.

"సంబంధం నరికనుకుంటున్నావు?" అంది అతని చేతిలో ఒక ఫోటో పెట్టి.

అప్పటికిగాని తల్లి ఆలోచన అర్థంగాలేదు రజనీకాంత్ కి

వెంటనే అతని మొహంలో రంగులు మారాయి.

"ఏమంటావు?" అంది.

అతను కనీసం ఫోటోకేసి చూడనైనా చూడకుండా, గోడకేసి చూస్తూ దాన్ని ముక్కలు ముక్కలు చేసి ఆవిడ చేతిలో పెట్టాడు.

విస్తుపోయిందావిడ. "ఏమిటీ పని."

"నీ ప్రశ్నకి నా సమాధానం" సీరియస్‌గా అన్నాడు.

ఏమనుకుందో ఏమో ఆవిడ వెంటనే ఆ గదిలోంచి బయటకి వెళ్ళిపోయింది.

ఆ రోజునుంచీ అతను తల్లితో చాలా అవసరమైతే తప్ప మాట్లాడటం కూడా మానేశాడు.

అతడు శశిరేఖని తప్ప యింకెవర్నీ చేసుకోడని అర్థం అయింది శాంతమ్మ గారికి.

ఆవిడ ఆరోగ్యం రోజు రోజుకీ క్షీణించటం మొదలుపెట్టింది.

రజనీకాంత్ పేషంట్లకి మందు లిచ్చినట్లే యిస్తున్నాడు ఆవిడకూడా.

కానీ మానసికమైన రోగాలకి మందులేం పనిచేస్తాయి?

అతనికి రోజులు నిర్లిప్తంగా గడుస్తున్నాయి.

ఒక రోజు మధ్యాహ్నం ఓ అబ్బాయిని యింటికి తీసుకువచ్చాడు రజనీకాంత్. అతని చూడటానికి ఆకర్షణీయంగా ఉన్నాడు. ఆ అబ్బాయిపేరు చంద్రశేఖర్.

"అమ్మా. ఈ అబ్బాయి నా స్నేహితుడి బావమరిది. పేరు చంద్రశేఖర్. ఇదివరకు ఒకటి రెండుమాట్లు రేవతి కాలేజీకి వెళ్తూంటే చూశాడట. అతనికి మన రేవతి నచ్చిందట." అన్నాడు. చాలాకాలం తరువాత కొడుకు మాట్లాడిన ఆ మాటలకే ఆ తల్లి మనసు మురిసిపోయింది.

"నాకంటే నీకే తెలుసు బాబు దాని మంచి, చెడ్డలు. పిల్లవాడు నాకు నచ్చాడు. దానికూడా నచ్చితే వాళ్ళ పెద్దవాళ్ళతో మాట్లాడి ఖాయం చెయ్యి." అందావిడ.

వైశాఖ మాసంలో రేవతికీ, చంద్రశేఖరికి పెళ్ళి వైభవంగా జరిగిపోయింది. ఉన్న ఒక్క చెల్లెలి పెళ్ళి, డబ్బు చాలా ఖర్చుపెట్టి పెద్ద ఎత్తునే చేశాడు. చెల్లెలి పెళ్ళిలో కాస్త ఉత్సాహంగా ఉన్నట్లు కనిపించాడు శాంతమ్మగారికి.

'నీ పెళ్ళెప్పుడోయ్?' అని పెళ్ళికి వచ్చిన స్నేహితులంతా అడుగుతూంటే చిరునవ్వే సమాధానంగా యిచ్చాడు రజనీకాంత్.

* * *

రేవతి భర్తతో అత్తారింటికి వెళ్ళిపోయింది. ఆమె కూడా వెళ్ళిపోయాక యిల్లంతా బోసిగా అయిపోయింది. కూతురు వెళ్ళేటప్పుడు శాంతమ్మగారు దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. పసిపిల్లలా వలవలా ఏడుస్తున్న తల్లిని చూసి ఒక్క క్షణం రజనీకాంత్ హృదయం జాలితో నిండిపోయింది. మళ్ళీ అంతలోనే కఠినంగా మారిపోయింది.

రేవతి వెళ్ళిపోయిన తర్వాత శాంతమ్మగారు మరింత ఒంటరిదైపోయింది. కొడుకు తనతో మాట్లాడడు ఎందుకు పెద్దవ జన్మ అనుకుంది. కొడుకు పెళ్ళి చూసే అదృష్టం తనకి లేదని తెలుసుకొని బెంగతో మంచం పట్టేసిందావిడ. ఆవిడకి బ్లడ్ ప్రెషర్.

ఇంట్లో వంటచేయటానికి, ఆవిడకి సపర్యలు చెయ్యటానికీ, ఓ ఆడమనిషిని ఏర్పాటుచేశాడు రజనీకాంత్.

చెల్లెలి పెళ్ళి అయిన తరువాత మరీ ఉదాసీనంగా తయారయ్యాడతను.

ఆ రోజు సాయంత్రం వంటమనిషి వెళ్ళిపోతూ "అమ్మగారు పిలుస్తున్నారు బాబూ. నేను యింటికి వెళ్తున్నాను. తలుపేసుకోండి." అని చెప్పి వెళ్ళిపోయింది.

రజనీకాంత్ తల్లి దగ్గరకి వచ్చాడు "ఏమిటమ్మా అంటూ ?"

"ఇలా కూర్చో బాబూ." అంది మంచం మీద చోటు చూపిస్తూ.

అతను తల్లి ప్రక్కనే కూర్చున్నాడు.

ఆవిడ అంతకు ముందు ఏడ్చిందనటానికి చిహ్నంగా, చంపలమీద కన్నీటి చారికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"బాబూ........" తల్లి ఏదో చెప్పాలని, సందేహిస్తోందని గ్రహించాడు రజనీకాంత్.

"నీ పెళ్ళి........" ఆవిడ మాట పూర్తి కాకుండానే అతను దిగ్గున లేచాడు.

ఆవిడ కంగారుపడుతూ కొడుకు చెయ్యి పట్టుకుంది. "నువ్వు శశిరేఖనే చేసుకో బాబూ. నాకు మనస్ఫూర్తిగా యిష్టమే." అంది.

శశిరేఖ పేరు వినగానే అతని మొహంలోకి కాంతి వచ్చింది. అంతలోనే ఎలా వచ్చిందో అలా మాయమైంది.

తల్లి ప్రక్కనే కూర్చుంటూ, విరక్తిగా నవ్వాడు.

"అమ్మా. అవకాశాలు వచ్చినప్పుడే వాటిని వినియోగించుకోవాలి. మనకి కావల్సినప్పుడు అవిరావు. చేజారిన తరువాత పశ్చాత్తాపపడితే, చేతులు కాలాక ఆకులు పట్టుకున్న చందమే అవుతుంది." గంభీరంగా అన్నాడు.



అవిడకి శశిరేఖ తిరిగివస్తే బాగుండునని ఉంది. కానీ ఎలా?

"బాబూ. రజనీ నన్ను క్షమించగలవా నీకు చేసిన అన్యాయానికి?" అవిడ గొంతు దీనంగా ఉంది.

— ఒక తల్లి కొడుకుని అడగవలసిన మాట కానది. అయినా అడిగింది. రజనీకాంత్ మూర్ఖుడు కాదు. చేసిన తప్పుకి పశ్చాత్తాపమే సరియైన శిక్ష అని నమ్మేవాళ్ళలో అతనొకడు.

అందుకే తల్లిని క్షమించగలిగాడు.

అవిడని ఎలా ఓదార్చాలో అతనికి తెలియలేదు. "అందుకే నా ప్రారబ్ధానికి నువ్వేం చేస్తావమ్మా" అంటూ అవిడ తలమీద చెయ్యివేశాడు.

కొడుకు అభిమానానికి చాలా ఆనందపడింది శాంతమ్మ.

తన తప్పు తను తెల్సుకుంది కాబట్టి ఈ చివరి వయసులో అవిడ్ని యిక బాధ పెట్టకూడదనుకున్నాడు రజనీకాంత్.

ఆ రోజునుంచీ అతను తల్లితో ప్రేమగానే మాట్లాడుతున్నాడు.

* * *

కాలచక్రం ఎవరికోసమూ ఆగదు. ఎవరి కష్టసుఖాలతోటీ పనిలేకుండా, దాని కర్తవ్యం అది నిర్వహిస్తూనే ఉంటుంది.

మూడేళ్ళు గిర్రున తిరిగాయి.

రజనీకాంత్ జీవితంలో మరో రెండు మార్పులు జరిగాయి. మొదటిది- అతను తల్లిని పోగొట్టుకుని మరింత ఒంటరివాడయ్యాడు. రెండోది- రేవతి కొడుక్కి- మేనమామ అయ్యాడు.

హాస్పిటల్, యిల్లూ, యాంత్రికంగా గడుస్తున్నాయి రజనీకాంత్ కి రోజులు. ఆ రోజు అతను హాస్పిటల్ లో ఉన్నప్పుడు పోస్ట్ మాన్ ఒక కవరు తెచ్చి యిచ్చాడు. అందులో శుభలేఖ, చిన్న ఉత్తరం ఉన్నాయి.

ఉత్తరం విప్పాడు రజనీకాంత్.

డియర్ రజనీకాంత్,

ఈ ఉత్తరంతోపాటు నా పెళ్ళి శుభలేఖ పంపుతున్నాను. నువ్వు ఏదో వంక చెప్పి తప్పించుకోకుండా తప్పనిసరిగా రెండు రోజుల ముందర రావాలి. అన్నట్లు పెళ్ళి 'తుని'లో. మేమంతా రెండు రోజుల ముందుగానే అక్కడికి చేరుకుంటాము.

విశేషాలు సమక్షంలో.

విజయ్.

శుభలేఖ తీశాడు.

పైన ఎంతో బావుంది. సీతా, రాముల స్వయంవరం బొమ్మ మెరుస్తోంది.

లోపల చూశాడు.

చి॥ డా॥ విజయ్ కి చి॥ సౌ॥ విద్య నిచ్చి.... .... ఆ రెండింటిమీదే నిలిచి పోయింది అతని దృష్టి. ఆ రెండు పేర్లు తనదీ, శశిరేఖదీ అయినట్లు ఊహించు కున్నాడు ఓ క్షణం.

* * *

రేపు పెళ్ళి అనగా 'తుని' బయలుదేరి వెళ్ళాడు రజనీకాంత్.

అల్లంత దూరాన అతన్ని చూస్తూనే పరుగులాంటి నడకతో వచ్చి కౌగలించు కున్నాడు విజయ్.

"నేను మిస్ విద్యను కాను." నవ్వుతూ అన్నాడు రజనీకాంత్. అతనితో పాటు విజయ్ కూడా నవ్వేశాడు.

రజనీకాంత్ కి బాత్రూమ్ చూపించాడు విజయ్. అతను స్నానం పూర్తిచేసి వచ్చిన తరువాత, యిద్దరూ డాబా పిట్టగోడ దగ్గర నుంచొని టిఫిన్ తింటూ, చదువుకునే రోజుల్లో విశేషాలన్నీ చెప్పుకుంటున్నారు. విజయ్ ని చూశాక అతని

ప్రాణం హాయిగా ఉన్నట్లు అనిపించించింది. రజనీకాంత్, విజయ్ విశాఖపట్నం మెడికల్ కాలేజీలో కలిసి చదువుకున్నారు ఆ రోజుల్లో కూడా వారిద్దరూ చాలా సన్నిహితంగా మెలిగేవారు. ఒకరి విషయాలు మరొకరికి దాపరికం లేకుండా చెప్పుకునేవారు

విజయ్ కిప్పుడు కాబోయే అమ్మాయి అతని అత్త కూతురే. అప్పట్లో విద్య ఫోటో ఒకటి క్లాసులో పుస్తకంలో పెట్టుకుని చూసుకుంటూ వుంటే తను ఏడిపించే వాడు కూడా.

అది యిప్పుడు గుర్తుచేసుకుని యిద్దరూ నవ్వుకున్నారు.

ఇంతలో "చూడండి డాక్టరు విజయ్" అంటూ తియ్యటి స్వరం తమ వెనకగా వినిపించింది

రజనీకాంత్, విజయ్ ఒక్కసారిగా తిరిగి చూశారు.

వెనక్కి తిరిగిన రజనీకాంత్ షాక్ కొట్టినట్లయ్యాడు.

శశిరేఖ కూడా అదేపరిస్థితిలో వుంది.

ముందుగా తేరుకున్న రేఖ, తెలివి తెచ్చుకున్నదానిలా క్రిందకి వెళ్ళిపోయింది.

"అరెరె వెళ్ళిపోకు" అని విజయ్ అంటున్నా వినిపించుకోకుండా.

"శశిరేఖా, శశిరేఖా" తియ్యగా మూల్గింది రజనీకాంత్ మనసు.

"ఆ అమ్మాయికి చాలా సిగ్గు. కొత్తవాళ్ళు ఎవరొచ్చినా యింతే" విజయ్ అన్నాడు.

"ఎవరామ్మాయి?" ఏమీ తెలియనట్లు అడిగాడు రజనీకాంత్.

"వైజాగ్‌లో మా నర్సింగ్ హోమ్‌లో నర్సు మూడేళ్ళ క్రితం వచ్చింది. చాలా మంచిది మంచి వర్కర్ కూడా."

మళ్ళీ అతనే అన్నాడు "ఆమెదో ట్రాజడీ లైఫ్ అసలు ఆమెతో పరిచయం నాకు చాలా చిత్రంగా జరిగింది ఒకరోజు నేను కారులో హాస్పిటల్‌కి వెళ్తుంటే ఈమె 'కళ్ళు' తిరిగి నా కారు క్రింద పడింది. కానీ అదృష్టవశాత్తూ పెద్ద దెబ్బ లేమీ తగల్లేదు. వెంటనే మా నర్సింగ్ హోమ్‌కి తీసుకెళ్ళి ఫస్ట్ ఎయిడ్ చేశాననుకో. రెండు రోజులపాటు మా హాస్పిటల్లోనే ఉంది. ఆ రెండు రోజులు కూడా ఆమెను చూడటానికి ఎవరూ రాలేదు ఆమె చాలా కష్టాల్లో ఉందని, బహుశా ఆమె కెవరూ అక్కడ లేరని అనిపించింది నాకు ఆమె గురించి తెల్సుకోవాలనీ, వీలైతే ఆమె కేదన్నా సహాయం చెయ్యాలని అనిపించి, హాస్పిటల్ నుంచి డిశ్చార్జి చేసిన తరువాత మా యింటికి తీసుకెళ్ళాను.

కానీ ఒక పట్టాన తన గురించి ఏమీ చెప్పలేదు. ఎంతో బలవంతం చేసిన మీదట తన కథ చెప్పింది.

తనకి నేను అన్నయ్యలాంటివాడిననీ, ఆమె కిష్టమైతే నర్సు ట్రయినింగ్ కోర్సు చదివిస్తానని చెప్పాను.

ఆమె సరేనని ట్రెయినింగ్ పూర్తి అయ్యేవరకూ మా యింట్లోనే ఉంది. తరువాత మా నర్సింగ్ హోమ్‌లోనే ఎప్పాయింట్ చేశాను."

రజనీకాంత్ మనసులోనే విజయ్‌కి కృతజ్ఞత చెప్పుకున్నాడు.

శశిరేఖతో మాట్లాడాలని అతని మనసు వేగిరపడుతోంది.

* * *

ఆ మర్నాడంతా పెళ్ళి హడావుడిలో మాట్లాడటానికి అతనికి వీలుపడలేదు. అతనికి శశిరేఖ ఎక్కడా ఒంటరిగా దొరకట్లేదు. రజనీకాంత్‌కి ఒక ఐడియా వచ్చింది. వెంటనే ఓ కాగితంమీద ఏదో రాశాడు. అక్కడ కూర్చున్న చిన్న పిల్లాడిని పిలిచి, దూరంగా కూర్చున్న శశిరేఖని చూపించి ఆ కాగితం యిచ్చి రమ్మన్నాడు.

ఆ పిల్లాడు శశిరేఖకి కాక మరెవరికైనా యిస్తాడేమోనని కొంచెం కంగారుగా అటువైపే చూస్తున్నాడు.

'థాంక్ గాడ్ !' అనుకున్నాడు ఆ పిల్లాడు శశిరేఖకి యివ్వటం చూసి.

అసలే రజనీకాంత్‌ని చూసి కంగారు పడిన శశిరేఖ, అతను పంపిన కాగితం చూసి మరింత కంగారుపడింది.

విప్పి చదివింది.

మై డియర్ శశీ,

నీతో చాలా మాట్లాడాలి. రేపు సాయంత్రం రామక్రిష్ణామిషన్ బీచ్‌లో కల్చుకో.

రజనీకాంత్

– ఇంకా ఏం మాట్లాడతాడు తనతో. జరిగినవన్నీ చాలకనా? అసలీపాటికి అతనికి పెళ్ళై ఉంటుంది. యిప్పుడు మళ్ళీ సంసారంలో తను కలతలు లేపిన దవుతుంది. ఏమైనా సరే అతనితో మాట్లాడకూడదు అని నిర్ణయించుకుంది శశిరేఖ

* * *




పెళ్ళి తంతు నిర్విఘ్నంగా ముగిసింది. అర్ధరాత్రి కావస్తోంది. ఎక్కడి వారక్కడ నిద్రాదేవి ఒడిలో ఒరిగారు.

ఆ రాత్రి వెన్నెల పుచ్చ పువ్వులా ఉంది.

రజనీకాంత్ మర్నాడు శశిరేఖతో మాట్లాడవలసినదంతా, ఇంటిముందు తోటలో తిరుగుతూ రిహార్సిల్ వేసుకుంటున్నాడు.

అర్ధరాత్రి కావొస్తున్నా అతనికి నిద్ర రావట్లేదు. శశిరేఖ తిరిగి కనిపించటం, పోగొట్టుకున్న పెన్నిధి దొరికినంత ఆనందంగా ఉంది. ఆమెతో మాట్లాడబోయే క్షణం ఎప్పుడెప్పుడా అని గంటలు లెక్క పెడుతున్నాడు.

ఇంతలో కాంపౌండ్ గేటు తీసుకుని ఒక ఆకారం రోడ్డుమీదకి కదిలింది. ఆలోచనల్లో ఉన్న రజనీకాంత్ గేటు చప్పుడికి ఉలిక్కిపడ్డాడు

అతను కూడా రోడ్డుమీదకి వచ్చాడు. యింతలో ఆ ఆకారం వెనక్కి తిరిగి చూసి పరుగందుకుంది

అతని మనసులో అనుమానం ధృఢపడింది. అతను కూడా ముందుకి పరుగెట్టాడు

పెద్ద కష్టం లేకుండానే ఆ ఆకారాన్ని చేరుకుని చాచి లెంపకాయ కొట్టాడు రజనీకాంత్.

ఆ అదురుకి శశిరేఖ చేతిలో రేకు పెట్టె ధన్‌మంటూ క్రిందపడింది

ప్లీజ్ రజనీకాంత్‌గారూ. నా దారిన నన్ను వెళ్ళనివ్వండి యిప్పటికే నావల్ల మీ జీవితం అస్తవ్యస్తమయింది. యిప్పుడుకూడా నా నిష్క్రమణ జరుగక

పోతే, మిమ్మల్ని మీ భార్యకికూడా దూరం చేసినదాని నవుతాను." ఏడుస్తోంది రేఖ.

"ఎంతసేపూ నీగోలే నీది కాని, నా మాట వినటంలేదా? నేనింతవరకూ అసలు పెళ్ళిచేసుకోలేదు నువ్వు ఏదేదో ఊహించి మాట్లాడేస్తున్నావు. అయినా నిన్ను కలుసుకోవాలని నేనింత ఆత్రుత పడుతూంటే నువ్వీ పారిపోవటం ఏమిటి? నీకిష్టం లేదంటే బలవంతంగా తీసుకుపోతా ననుకున్నావా? చిరుకోపంగా అన్నాడు రజనీకాంత్

— ఏమిటీ? అతను తన కోసం యింతవరకూ పెళ్ళి చేసుకోలేదా? ఆమె మనసు అనురాగంతో చలించిపోయింది.

"కానీ మీ అమ్మగారి కిష్టంలేని పెళ్ళి నేను చేసుకోలేనండీ."

యిప్పుడు యిష్టపడక పోవటానికి అమ్మలేదు రేఖా. అయినా ఆవిడ పోయే ప్పుడు నీ కోసమే కలవరించింది. నువ్వు వెళ్ళిన తరువాత నిన్ను తన కోడలిగా చేసుకోడానికి అంగీకరించింది కూడా."

ఆమె నిర్ఘాంతపోయింది, అతని తల్లి పోయిందన్న వార్త విని

ఆమె మొహంలో ఆ భావాన్ని చదివి "టేకిట్ ఈజీ" అన్నాడు ఆమె చెయ్యందుకుంటూ.

ఆమె యింకో చేత్తో క్రిందపడ్డ పెట్టె అందుకోబోయింది

"ఆ పెట్టెం వదిలేయ్ అది ఉన్నన్నాళ్ళూ నువ్వు నాకు దూరంగానే ఉంటావు" అన్నాడు నవ్వుతూ.

ఆమె కూడా అతని నవ్వుతో శృతి కలిపింది.

ఆ వెన్నెల రాత్రి వారి జీవితాల్లో శారద రాత్రి అవుతుందని యిద్దరూ అనుకోలేదు

ఒకరు చేతిలో మరొకరు చెయ్యివేసి ఆనందం నిండిన మనసులతో యింటికేసి నడుస్తున్నారు.

రజనీకాంత్ ఉన్నట్లుండి ఆమెని దగ్గరికి తీసుకొని చెక్కిలి నిమురుతూ మృదువుగా అన్నాడు. "దెబ్బ గట్టిగా తగిలిందా?"

"ఊహూం తియ్యగా తగిలింది" అంటూ అతని కళ్ళలోకి చూసి మధురంగా నవ్వింది శశిరేఖ

తన్మయమైనా శారద రాత్రీ,
రాసలీలా వేళ యిదే — దూరంగా ఎక్కడో

ఘంటసాల, జిక్కీ గొంతు వినిపిస్తోంది.

———

# పుచ్చిపోయిన జీవితం

అది కృతయుగం అనండి, స్వర్ణ యుగం అనండి, ధర్మం నాలుగు పాదాలా నడిచిందనండి, ఏమన్నా, చరిత్రలో మానవ సమాజాలు బలంగా, పుష్టిగా, "మానవత్వపు విలువలు" అని మనం అనుకునేవి అమలులో ఉండిన కాలాలు కొన్ని కనిపిస్తాయి. వాటికి విరుద్ధంగా సమాజాలు పుచ్చిపోయి, అతి స్వల్ప ఆఘాత్యాలకు కూడా తట్టుకోలేక, శిధిలమైపోయిన సందర్భాలూ కనిపిస్తాయి — యాదవ కులంలో ముసలంలాగా

ఆదిమ మానవ సంఘాలను దృఢంగానూ, పుష్టిగానూ ఉంచినవి సాంఘిక నియమాలు వాటిని అమలుపరచటానికి పెద్ద శిక్షాస్మృతులు కూడా లేవు. అన్నిటినీ మించిన శిక్ష సంఘ బహిష్కరణం. అది ఆనాటి పరిస్థితులలో మరణదండన లాటిదే గనక సాంఘిక నియమాలను ఎవరూ ఉల్లంఘించేవారు కారు.

అయితే, నాగరికత పెరిగి సమాజంలోకి అనేక సంఘాలు వచ్చి చేరి, సంపద ఉత్పత్తి అయే క్రమంలో శ్రమ విభజన ఏర్పడి, అందులో ఎక్కువ తక్కువలూ, శ్రమదోపిడీ, దానితోబాటు సామాజిక దురన్యాయాలూ పుట్టుకొచ్చి నాక. సమాజం విచ్ఛిత్తి పొందటానికి తగిన వైరుధ్యాలూ, సమాజం ఏకంగా ఉండటం అవసరం అయిన ఆర్థిక అవసరాలూ ఒకే సమయంలో ఏర్పడ్డాయి. సామాజిక ఐక్యతకోసం అంతర్గత వైరుధ్యాలను అణచిపెట్టటానికి రాజకీయ వ్యవస్థా, శాసనాలూ, శిక్ష విధానాలూ అవసరమయాయి అంటే మనుషులు రెండు రకాల కట్టుబాట్లను పాటించటం జరిగింది: ఒకటి, సమాజానికి సహజ శక్తిని కలిగించే సంఘనియమాలు. రెండు, అవసరమైతే దౌర్జన్యాన్ని ప్రయోగించగల శాసనాలు.

ఏ కాలంలో కూడా, సంఘనియమాలకున్న బలం శాసనాలకు లేదు ఈనాటికి కూడా, అత్యధిక సంఖ్యాకులకు శాసనాలతో పరిచయం లేదు. జనసామాన్యం సంఘ నియమాలలో మాత్రమే "న్యాయం" చూడగలరు అయితే సమాజం మారుతున్నకొద్దీ ఆ మార్పును అనుగుణంగా సంఘనియమాలు కూడా మారాలి లేకపోతే వాటి బలం నశిస్తుంది వాటిని జనం పాటించటం మానేస్తారు ఆ స్థితిలో సంఘం పుచ్చిపోకుండా రాజకీయ శాసనాలు ఆపలేవు.

ఈనాడు విరివిగా జరుగుతున్న రెండురకాల నేరాలను గమనిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

---

**కొడవటిగంటి కుటుంబరావు**

---

ఒకటి బలవన్మైధునాలు - రేప్‌లు. స్త్రీలను చెరచినవాళ్ళు ఏ కాలంలోనూ ఉండే ఉంటారు. మరీ ప్రాచీన కాలంలో బృహస్పతి, గర్భవతిగా ఉన్న తన తమ్ముడి భార్యతో బలవంతంగా సంభోగించ యత్నించినట్టు మనకు రికార్డు ఉన్నది అయితే, సనాతనులు కాదన్నప్పటికీ, మన పూర్వీకులకు కూడా ఒక అటవిక దశ ఉండేదన్నది నిజమే గనక బృహస్పతిది అనాగరిక చర్య అనుకోవచ్చు.

కాని నాగరికత వచ్చినాక, ఆడది సంభోగం కోరితే ఏ పురుషుడు గాని నిరాకరించటం ఎంత పాపమో, స్త్రీ ఇష్టానికి వ్యతిరేకంగా ఆమెతో రమించటం కూడా అంత పాపంగానే భావించబడేది. రాక్షస రతి అమానుషంగానూ, అనాగరికంగానూ భావించబడేది. రంభను బలాత్కరించిన రావణుడి కథ పురాణాలలో ఉన్నది. కాని ఆ రావణుడే సీతను బలాత్కరించలేదు. బ్రహ్మశాసం అడ్డొచ్చిందన్నారు గాని, ఆ మాట రామాయణంలో లేదు. రావణుడు రామాయణంలో గొప్ప రసికుడు. రసికులెవ్వరూ రాక్షసరతీ, రేప్‌లూ కోరరు.

నా చిన్నతనంలో కూడా బలాత్కార మైధునం అన్నది సంఘ నియమాల దృష్టిలో ఎంత దారుణమైన నేరమంటే, 1925-28లో, నేను గుంటూరులో చదివే రోజుల్లో, ఒక పోలీసు ఎవరో ఖైదీ భార్యను బలాత్కరించాడు. ఆమె రిపోర్టు చేసేసరికి ఆ పోలీసువాడు తుపాకితో కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. అటుతరువాత ఇటీవలి కాలంవరకు - అంటే మనకు స్వాతంత్ర్యం బాగా వంటబట్టి పోలీసులు శాంతి భద్రతలు కాపాడటానికి బీదవాళ్ళ ఇళ్ళలో జొరబడి కుండలు పగలగొట్టటమూ, ఏం నేరంచేసినదీ చెప్పకుండా కనిపించినవారిని చావగొట్టటమూ, క్రైమ్ క్రింద ఆడవాళ్ళను రేప్ చెయ్యటమూ ఆనవాయితీ అయినదాకా - పోలీసులు తమ నిత్యకృత్యాలలో బలాత్కార మైధునాలు కూడా చేర్చుకోవటం ఎరగను.

రెండోది హత్యలు. గత జీవితంలో తనజాతివాణ్ణి చంపటంకంటె దారుణమైన నేరం ఊహించరానిది గత నియమాలను శిరసావహించిన ఆఖరువాడు, చార్వాకుడు ధర్మరాజును, "నువు నీజ్ఞాతులను చంపావు. నువు చావాలి." అంటాడు గత జీవిత నియమాలు తెలిసిన ధర్మరాజు కాదనక, చావటానికి సిద్ధపడతాడు అయితే గత జీవితం బ్రాహ్మణులు అమలులోకి తెస్తున్న వర్ణవ్యవస్థకు విరుద్ధం. అందుచేత వాళ్ళు ధర్మరాజును చావవద్దని తామే చార్వాకుణ్ణి చంపుతారు.

వర్ణవ్యవస్థ ఆరంభమైనాక హత్యలు పూర్వం అంత ఘోరానేరాలు కాకుండా పోయాయి. వాటికేవో ప్రాయశ్చిత్తాలు

కూడా కల్పించారు. అన్ని హత్యలూ ఒకటి కావు కొన్ని హత్యలు నేరాలే కావు. తన తండ్రిని తిండికి మాడ్చి చంపిన అజాతశత్రువు ఉపనిషత్తులో పెద్దమనిషే. రాజ్యాధికారంకోసం అడ్డం నిలిచిన తండ్రినీ, అన్నలనూ చంపటం మామూలు రాజనీతి అయింది. మొగలులో కూడా దాన్ని ఆమోదించి, భారతీయ సంప్రదాయాన్ని నిలబెట్టినట్టున్నారు.

శిక్షాస్మృతిలో మరణదండన కూడా చేరింది. దాన్ని ఈనాటి సంస్కారులు "లీగల్ మర్డర్" అంటున్నారు. ఈ సంస్కారుల ఒత్తిడితో కొన్ని దేశాలు మరణదండనను విసర్జించి, యావజ్జీవ ఖైదు అమలుచేస్తున్నాయి. కాని ఈ సంస్కృతికి అతీతంగా హత్యలు జరుగుతున్నాయి పోలీసులు నక్సలైట్లను అడవిలోకి తీసుకుపోయి, కాల్చిచంపటం ఏ రకమైన హత్య? బిల్లా రంగాలు దారిలో దొరికిన పిల్లలను కారులో తీసుకుపోయి, ఆడపిల్లను చెరచి, ఇద్దరినీ హత్య చేయటం ఏరకమైనహత్య? వీటి వెనక పైశాచికం తప్ప ఏ రకమైన సంఘ నియమమైనా ఉండగలదా?

పైశాచికం అవతరించిన చోట సంస్కృతి సమస్య లేదు. యాదవులు కొట్టుకు చచ్చేటప్పుడు వారిని వారించటానికి ప్రయత్నించిన కృష్ణుడు చివరకు అందరికన్నా ఎక్కువమందిని తానే చంపాడట!

ఏ రకం సంఘనియమాలకూ కట్టుబడకుండా పోయిన మనుషుల సంఖ్య నానాటికీ పాపంలు పెరిగినట్టు పెరగటం మనం రోజూ పత్రికలలో చూస్తున్నాం. ఇది సమాజ విచ్ఛిత్తిని సూచిస్తుంది. పరస్పరం నియమ రహితంగా ప్రవర్తించగల వాళ్ళు ఒక సమాజానికి చెందిన వాళ్ళు కారు. ఆదిమ జాతులలో కూడా మరో జాతివాణ్ణి చంపితే అది నేరం అయేది కాదు, కీర్తి కారణంగా కూడా ఉండేది.

రాజకీయ వ్యవస్థ ఏర్పడ్డాక చిల్లర మల్లర రాజులు ఇరుగుపొరుగు దేశాల పట్ల ఆ ఆదిమజాతి మనస్తత్వమే అవలంబించేవాళ్ళు. ఇరుగుపొరుగు రాజులతో యుద్ధాలు చేస్తూండటం క్షత్రియ ధర్మంగా కూడా చెప్పబడింది!

ఈ ఆదిమజాతి మనస్తత్వం ఇప్పుడు మళ్ళీ మన "ప్రజాతంత్రం"లోకి అడుగు పెట్టింది! అవతలి పార్టీ అభ్యర్థి గెలిచేటట్టుంటే వాణ్ణి చంపెయ్యి! ఈ పుచ్చిపోయిన వ్యవస్థను మార్చటానికి కృషి చేస్తున్నవాళ్ళను ఉగ్రవాదులని పేరు పెట్టి పోలీసుల చేత చంపించు!

మన దేశం కూడా, నాగరిక దేశాలలో లాగే, మరణదండన ఎత్తేస్తే బాగుండేదా అని అనవసరంగా తర్జనభర్జనలు పడుతున్నారు. మరణదండన ఎత్తివేయటంవల్ల చంపవలసిన వాళ్ళను చంపటానికి సవాలక్షమార్గాలున్నాయి. పోలీసుల లాకప్‌లో

చ్చినవాళ్ళను గురించి విచారణా, శిక్ష ఉండదు. "ఎన్‌కౌంటర్" చావులు సుప్రసిద్ధం అయ్యాయి. మరణదండన శిక్షాస్మృతి నుంచి ఎత్తేసి, మనంకూడా నాగరికులమే అనిపించుకోటానికి నిజంగా నాగరికులం కానవసరంలేదు. నాగరికత ఈనాడు అరువుసొమ్ము. రేపు మనకు "కలర్ టి. వి." రాబోతున్నది. నూటికి అరవైమందికి తిండి లేకపోయినా మనం కృత్రిమ ఉపగ్రహాలు ప్రయోగించగలం।

అందుచేత సంఘనీతి, సంఘనియమాలూ ఛిద్రమై సమాజానికి పునాది చిట్లిపోయి, భూకంపాలతో పోల్చదగిన సంఘటనలు సమిష్టి జీవితాలో జరుగుతున్నా మనం నాగరికతగల వారిలాగా వేషంవేసే అవకాశం ఉంది.

అలా వేషం వెయ్యటమే ఈనాటి సాంస్కృతిక కార్యక్రమమంతా -అకాడమీలూ, బాహూకృతులూ సన్మానాలూ, కళాప్రదర్శనలూ, కళాదౌత్యబృందాలూ. అంతర్జాతీయ సాంస్కృతిక సమావేశాలూ। ఇలాంటివి లక్ష చేసినా మానవసమాజం ప్రపంచం అంతటా శిధిలం అవుతున్న దన్న సత్యాన్ని దాచలేవు.

• • •

సమాజంలో ఐక్యత సాధించేశక్తులు లేవని నా ఉద్దేశం-కాదు. కొన్ని అనుకూల శక్తులు కొన్ని వర్గాలను కూడగట్టి ఉంచుతున్నమాట నిజం.

అన్నిటికన్నా నిర్మలమైనదీ, దాదాపు నిరుపయోగమైనదీ కళారంగం. కళాభిరుచిలో సామ్యం సాంఘిక ప్రగతి శక్తులలో నిస్సందేహంగా ఒకటి, కాని బలీయమైనది కాదు. ఇతర శక్తులు అనుకూలిస్తే అది గొప్పగా రాణిస్తుంది.

కళాభిరుచివల్ల ఒక కవినిగాని రచయితనుగాని, గాయకుణ్ణిగాని, నటుణ్ణిగాని అభిమానించే వాళ్ళు ఏకమవుతారు. ఈ అభిరుచి సంఘంలో ఉండే మామూలు అడ్డుగోడ లన్నిటినీ దూసుకుపోగలదు. అలాంటి పరిస్థితిలో అయాకళాకారులు తమ కళల ద్వారా ప్రత్యేక సామాజిక ప్రయోజనాన్ని సాధించటానికి పూనుకున్నవారైతే కళాభిరుచులు గలవారు కనీసం మానసికంగా ఆప్రయోజనాలకు సుముఖులవుతారు.

మానసికంగా అని ఎందుకు చేర్చవలసి వచ్చిందంటే స-ఘలో సంస్కరణలు జరగాలని ఒప్పుకునేవారందరూ తామై వాటికి నడుముకట్టరు. సిద్ధాంతరీత్యా విప్లవాలు తప్పనిసరి అని ఒప్పుకునే వారంతా విప్లవాచరణను సహించగలరని అనుకోవటానికి లేదు. ఈ తేడా ఎందువల్ల వస్తుందంటే, సమాజం యొక్క భౌతిక పునాదులను కదిలించే శక్తి కళలకు లేదు; కదిలించ పూనుకున్నవారికి అవి ఊతం ఇయ్యవచ్చు, అంతే। ఇదే ప్రధానంగా కళలు సాధించే ఐక్యతలో ఉండే దౌర్బల్యం.

జనాన్ని ఏకంచేసేవి ఇంకా చాలా




ఉన్నాయి: రకరకాల బాబాలమీద భక్తి, క్రీడారంగం గురించిన ఆసక్తి, సాంస్కృతిక ఉద్యమాలలో సభ్యత్వమూ, రాజకీయ పార్టీలలో సభ్యత్వమూ వగైరాలు. ఇవి చాలామటుకు సమాజంలో ప్రత్యేక సంఘాలుగా రూపొందటానికి తోడ్పడతాయి గాని, మౌలికంగా సంఘ నియమాలపట్ల ప్రజలలో దృఢమైన విశ్వాసం కలిగించటానికి గాని, కాలానుగుణమైన మార్పులు వాటిలో తేవటానికి గాని పనికిరావు.

అంతేగాక ఈ కాలంలో ప్రజలు ఏ ప్రాతిపదికమీద ఏకంకావటానికైనా రాజకీయాలు అడ్డుతగలవచ్చు రష్యాలో జరగనున్న ఒలింపిక్ క్రీడల విషయంలో ఎంత రాజకీయ దుమారం రేగిందో మనం చూస్తూనేఉన్నాం. రాజకీయ కారణాలు అడ్డంపెట్టుకుని మంచి సాహిత్యాన్ని దుమ్మెత్తిపోస్తూ వస్తున్నవాళ్లు ఉంటూనే ఉన్నారు. "కమ్యూనిస్టు కవిత్వం", "కమ్యూనిస్టు సాహిత్యం" అనే అనిర్వచనీయమైన మాటలుకూడా సృష్టిఆయాయి। (ఏ కారణంచేతనో కాంగ్రెసు కథలూ, కాంగ్రెసు నవలలూ అన్న మాటలను ఎవరూ సృష్టించలేదు।) సాహిత్యం రాజకీయమైనదైతేనే దానికి రాజకీయమైన పేరు తగిలించాలి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, మావో రచనలను మార్క్సిస్టు రచనలు అనవచ్చు, కాని మావో కవిత్వాన్ని పట్టుకుని కమ్యూనిస్టు కవిత్వం అంటే తెలిసినవాళ్ళు నవ్వుతారు. వీరరాజకీయ వాదులు నలుగురి ఎదుటా నవ్వులపాలు కావటానికి కూడా సిగ్గు పడబోరు.

రాజకీయాల ప్రభావం ఈ విధంగా ఉన్నకారణంచేత మౌలికమైన సాంఘిక, రాజకీయ సూత్రాలమీద మనుషుల ఏకమైతేతప్ప సమాజంశాలూకు పునాదులలో నిజమైన కదలిక రాదు.

విచారకరమైన విషయం ఏమంటే, చాలా రాజకీయ పార్టీలు "బోగస్" అని పించే పేర్లు పెట్టుకుంటాయి వెనక "జస్టిస్ పార్టి" ఉండేది. కాంగ్రెస్‌పార్టీ మానిఫెస్టోను యథాతథంగా కాపీకొట్టి, 1937 ఎన్నికలప్పుడు "పీపుల్స్ పార్టీ" అంటూ వచ్చింది. ఈనాడు "కాంగ్రెస్", "జనతా", "లోక్‌దళ్" లాంటి పేర్లతో అమ్ముడవుతున్న పార్టీలు సమాజాన్ని ఎటు నడిపించటానికి పుట్టాయో వాటి పేర్లు చూస్తే తెలీదు. ఆ పార్టీల నాయకులు చెప్పేదేమో నమ్మటానికి లేదు కాలచక్రాన్ని వెనక్కు తిప్పి క్రీస్తు పూర్వ స్థితిని తిరిగి నెలకొల్పటానికో, కాలచక్రాన్ని కదలకుండా గట్టిగా పట్టుకుని ఇప్పుడున్న ధనిక, దరిద్ర వ్యవస్థను ఇలాగే శాశ్వతంగా ఉంచటానికో, భవిష్యత్తులో మరొక కృతయుగాన్నో, స్వర్ణయుగాన్నో సృష్టించి ధర్మాన్ని నాలుగు కాళ్ళమీదనో, ఎనిది కాళ్ళమీదనో నిలబెట్టటానికో అంకితమైనరాజకీయపార్టీలే వాస్తవమైన పార్టీలు. వాటిమధ్య జరిగే సంఘర్షణే నిజమైన సామాజిక చైతన్యం. అంతేగాని, దేశాన్ని దేశీయ, విదేశీయ ధనస్వాములకు తాకట్టు పెట్టేసి ఇదే సోషలిజం అనే పార్టీలు బోగస్‌పార్టీలు, ఒకటి చెబుతూ ఇంకొకటిచేసే పార్టీలన్నీ బోగస్ పార్టీలే జనసామాన్యాన్ని కూడ గట్టుకోకుండా జెండా లెత్తే పార్టీలు అసలు రాజకీయ పార్టీలేకావు. - మద్రాసులో కార్యదర్శి తప్ప సభ్యులులేని "సభం" లాగా।



# ఫుట్‌రెస్ట్

ఎమ్వీవీ సత్యనారాయణ



"జాగ్రత్తగా మార్చాలి. ఏమాత్రం అనుమానం వచ్చినా మన రాకెట్ అంతా కటకటాల వెనక్కి పోతుంది" అన్నాడు ఆ వ్యక్తి. గుబురు మీసాలూ, నల్ల కళ్ళద్దాలూ మొహం ఎప్పుడూ గుర్తుపట్ట డానికి వుండదు.

"ఆ విషయం నాకు తెలియదా!" నవ్వాడు జోగారావు.

ఆ వ్యక్తి కూడా నవ్వాడు. జోగారావు ఏడాది తిరిగేసరికి బికారిగా వుండే వాడల్లా లక్షాధికారి అయ్యాడు. ఆ సంగతి ఇద్దరికీ తెలుసు!

గుబురుమీసాల వ్యక్తి సొరుగు తెరచి నోట్లకట్ట టేబులు మీదకు విసిరాడు. అన్నీ వందరూపాయల నోట్లు! జోగారావు ఆప్యాయంగా తళతళలాడే నోట్ల కట్టను తడిమి ప్యాంటు జేబులో కుక్కాడు. గుబురు మీసాల వ్యక్తి వద్ద సెలవు తీసుకుని గదిలోంచి బయటపడ్డాడు. చకచక వరండాలో నడిచి మెట్లు దిగటం ప్రారంభించాడు.

"బూట్ పాలిష్ సార్!"

కింద మెట్లమీద కేక వినిపించింది. నత్తగుల్ల ఆకారం మెట్లు అవి. జోగారావు తనకేం పట్టనట్టు చకచక మెట్లుదిగుతూ ఆలోచనలో పడ్డాడు.

నోట్లకట్ట మారిస్తే తనచేతిలో పాతిక వేలు పడతాయి. దాంట్లో సగం గుబురు మీసాల వ్యక్తికి, సగం తనకి! ఒక్క పూటలో మార్చగలడు తాను. పూటకి ఆదాయం!

జోగారావు నవ్వుకున్నాడు...

పన్నెండున్నర వేళా! విశాఖపట్నంలో ఈ లంకంత భవనంలో_ఒక గదిలో_ అద్దెగదిలో నాలుగురోడ్ల జంక్షన్‌లో యింత పెద్ద ఎత్తున దొంగనోట్ల మార్పిడి జరుగుతోన్నా ఎవ్వరికీ తెలియదు. జోగారావు హుషారుగా ఈలవేసి మెట్ల ప్రక్కన వున్న అద్దాల కిటికీల్లోంచి రోడ్డుమీదకు చూశాడు.

జనం! జనం! ఎవరికీ ఎవరూ పట్టించుకోనట్లూ .... ఎవరి హడావిడిమీద వాళ్ళు పరుగులు పెడుతోన్నట్టు ఎవరి గొడవ వారికే విపరీతమైన ప్రాముఖ్యత వున్నట్టు...ఉరుకుల పరుగులు!

అన్ని పరుగులూ పొట్టకోసమే!

జోగారావు గర్వంగా ఉబ్బివున్న పాంటుజేబు తడుముకున్నాడు.

కాని, తన పరుగు మటుకు భవిష్యత్తు కోసం! తరతరాలు తిన్నా తన ఆస్తి తరగకూడదు.

"సార్! మీ బూట్లు పాలిష్ చేయనా!"

జోగారావు చటుక్కున నిలద్రొక్కుకున్నాడు. తను మరో రెండుమెట్లు దిగి వుంటే ఆ కుర్రవాడిని గుద్దుకుని వుండేవాడు. వాడు క్రిందకు దొర్లిపోయేవాడు. వాడిమీద కోపం ముంచుకువచ్చింది_ క్రిందపడి దెబ్బలుతింటే! అల్లరి! చుట్టూ జనం మూగరా!

"ఏరా! బతకాలని లేదా!" అరిచాడు జోగారావు.

బూట్‌పాలిష్ కుర్రవాడు తలపైకెత్తి చిరునవ్వు నవ్వి, తన చంకన వున్న మసిబారిన సంచీ తడుముకుని, "సార్! బతకాలనే గదా! గుమ్మం గుమ్మం తిరుగుతూ పాలిష్ చేసుకుంటున్నాను." అన్నాడు.

జోగారావు చిరాకుగా చూచి అతడిని తప్పించుకుని దిగబోయాడు.

"సార్!" కుర్రవాడు ప్రాధేయపడ్డాడు.

జోగారావు రెయిలింగ్ పట్టుకుని దర్పంగా అతడికేసి ఏం అన్నట్టు చూశాడు.

"మీ బూట్లు పాలిష్ చేస్తాను సార్!"

"అక్కర్లేదురా! మరో రెండు రోజులవరకూ అక్కర లేదనుకుంటాను."

"సార్! అలా అనకండి సార్! మా అమ్మ, మా తమ్ముడూ, చెల్లీ తిండి తిని రెండు రోజులవుతుంది సార్! నేను పాలిష్‌చేసి పట్టుకెళ్తే గాని ఈ పూట అయినా మాకు తిండి వుండదు సార్!"

"మీ నాన్న ఏమయాడు!"

"ఆరు నెలలయి మమ్మల్ని వదిలేశాడు సార్! బాగా తాగుతాడు. గిరాగి మా అమ్మను చితకదన్నేవాడు. మా నాన్న పోయినప్పటినించీ నేనే కుటుంబానికి గంజి పోయవలసినవాడిని సార్!"



"నీకు వట్టినే డబ్బులు యివ్వడానికే పాలిష్ చేయించుకోవాలి."

"పోనీ సగం డబ్బులివ్వండి సార్! మామూలుగా అయితే పాలిష్‌కి అర్ధ రూపాయి!"

జోగారావుకి జాలివేసింది.

"అయితే పుట్ రెస్ట్ తియ్యి."

కుర్రవాడు చటుక్కున గొంతు కూర్చుండి మోకాలు ముందుకు ఒంచి, "సార్! బూటు నా మోకాలి మీద పెట్టండి." అన్నాడు.

జోగారావు అతడి మోకాలికేసి చూశాడు. తను బూటు పెడితే విలదొక్కుకోలేనంత అల్పంగా వుంది మోకాలు.

"పుట్ రెస్ట్ కొనుక్కోలేక పోయావా?"

"కొనాలంటే మాటలా సార్! పది రూపాయలకు తక్కువకి రాదు. బూటు యిక్కడ పెట్టండి సార్!"

"పోనీ లేవోయ్! ఇదిగో అర్ధరూపాయి తీసుకో!" అన్నాడు జోగారావు జేబులోంచి అర్ధరూపాయి తీసి యివ్వబోతూ.

పాలిష్ కుర్రవాడు తల అడ్డంగా తిప్పి, "నాకు ఉచితంగా వద్దు సార్!" అంటూ బూటుమీద చెయ్యివేసి మెల్లగా ఎత్తి మోకాలిమీద పెట్టి చకచక సంచి లోంచి పాలిష్ డబ్బానూ బ్రష్‌నూ తీసి మెట్టుమీద పెట్టి వేలితో చకచక పాలిష్ బూటుమీద అద్ది మెరుపువేగంతో బ్రష్‌తో రబ్ చేయసాగాడు.

"నీకు ఎన్నేళ్ళురా!"

"పదహారు సార్!"

"..........."

"ఏం సార్!"

"ఇంకా ఎక్కువ వయసువున్న వాడల్లే కనిపిస్తావురా!"

"సార్ నేను ఎలా పాలిష్ చేస్తున్నా నంటారు?"

జోగారావు మెచ్చుకోలుగా చూసి కాలు మార్చి రెండో బూటు అతడి మోకాలిమీద పెట్టి యధాలాపంగా రోడ్డు కేసి చూశాడు.

జోగారావు మొహంలో రంగులు మారాయి. జీపు వచ్చి నిలబడింది. మనుషులు దిగారు చక చక భవంతి చుట్టూ పరుచుకుపోసాగారు. ముగ్గురు వ్యక్తులు భవంతిలో ప్రవేశించడం చూశాడు జోగారావు. అతడిలో వణుకు ప్రారంభమయింది.

వాళ్ళు క్రైంబ్రాంచ్ మనుషులు! తనకి వాళ్ళంతా తెలుసు తనూ వాళ్ళం దరికీ తెలుసనే విషయం జోగారావుకు తెలుసు.

జోగారావు చటుక్కున పాలీషు కుర్రవాడి వంక చూశాడు అతడు తదేకంగా బూటుకు మెరుగుపెట్టడంలో నిమగ్నమైపోయాడు.

జోగారావు చటుక్కున పాంటు జేబులోంచి నోట్లకట్ట తీసి మెల్లగా వంగి పాలీషు కుర్రవాడి చంకలోవున్న సంచిలోకి జారవిడిచాడు.

"పూర్తయింది సార్! పావలా యివ్వండి." అన్నాడు కుర్రవాడు, పాలీషు డబ్బానీ బ్రషునూ సంచిలోకినెట్టి.

జోగారావు అతడి చేతిలో అర్ధ రూపాయి పెట్టి, "ఒరే! జగదాంబా బస్‌స్టాప్‌లో నిలబడు నీకు పుట్‌రెస్ట్ కొనడానికి డబ్బు యిస్తాను." అన్నాడు.

పాలీషు కుర్రవాడి కళ్ళు మిల మిల లాడాయి.

"అదే వుంటేనా సార్! నా సామి రంగా! రోజుకి మూడు రూపాయలు సంపాదిస్తాను సార్!"

మెట్లమీద బూట్లు టకటకలాడుతూ చప్పుడయాయి.

పాలీషు కుర్రవాడు అటుగా చూశాడు. ఒకరి వెనక ఒకరు మెట్లెక్కుతూ జోగారావును చూచి ముగ్గురూ ఆగారు.

"జో గా రా వు గా రూ! ఇక్క డున్నారేం?" అడిగాడు ముగ్గురిలో ఒకాయన జోగారావు విశ్రాంతిగా చూసి, "మా ఫ్రెండు ఈ లాడ్జిలో దిగాడని తెలిసి వచ్చాను. ఇంతలో ఈ కుర్రవాడు పాలీషు అంటూ వెంటపడ్డాడు." అన్నాడు.

వాళ్ళ గాంభీర్యానికి పోలీసు కుర్ర వాడు భయాన్ని శంకించాడు. మెల్లగా మెట్లు దిగి రోడ్డెక్కాడు

"జోగారావు గారూ! మీ దగ్గర దొంగ కరెన్సీనోట్లున్నట్టు మాకు వార్త అందింది. వెతకవచ్చునా?" అని గాడు ఇందాక అడిగినాయన

"వెతుక్కోండి ఇన్‌స్పెక్టర్!" అంటూ జోగారావు చేతులెత్తాడు.

• • •

"చాల త్వరగా వచ్చేసారు సార్!"

"ఆ ప్రక్క సందులోకి పద! నేను సిగరెట్లు కొనుక్కువస్తా!" అంటూ అతడి జవాబుకోసం ఎదురుచూడకుండా కిళ్ళీ షాప్‌కేసి నడిచాడు జోగారావు.

పోలీసు కుర్రవాడు సందులోకి మలుపు తిరిగాడు జోగారావు కూడా చుట్టూ చూసుకుంటూ సందులోకి మలుపు తిరిగి కుర్రవాడిని సమీపించి, "ఆ సంచి యిక్కడ పెట్టి అగ్గిపెట్టె తెచ్చిపెట్టు.... మరచిపోయాను" అన్నాడు

పోలీసు కుర్రవాడు ఏమీ సంకోచించ కుండా సంచిని రోడ్డువారగా పెట్టి అతడి దగ్గర డబ్బులు తీసుకుని పరుగెత్తాడు.

జోగారావు సంచి వెతికి నోట్లకట్ట తీసి చటుక్కున పాంటుజేబులో కుక్కు కున్నాడు.

పోలీసు కుర్రవాడు అగ్గిపెట్టెతో తిరిగి వచ్చి చిల్లర డబ్బులు జోగా రావుకు యివ్వబోయాడు జోగారావు అతడి చెయ్యి ముందుకునెట్టి జేబులోంచి పదిరూపాయల నోటు తీసి కుర్రవాడి చిరుగుల జేబులో కుక్కి చకచక నడుచు కుంటూ మలుపు తిరిగి జనంలో కలసి పోయాడు.

పోలీసు కుర్రాడు వెర్రిమొహం వేసుకొని నిలబడిపోయాడు.

• • •

జోగారావు ఆ రోజు దినపత్రిక చూస్తూ విస్తుపోయాడు గుబురు మీసాల వ్యక్తి ఫోటో పేపర్‌లో పడింది ఇరవై లక్షల రూపాయల దొంగనోట్లతో సి. ఐ. డి. వారికి దొరికి పోయాడు.

"సార్!"

తలెత్తి చూశాడు జోగారావు. పోలీసు కుర్రవాడు.

అతడిని చూస్తూనే ప్రక్కలో బాంబు పడినట్లుగా చూశాడు జోగారావు.

"సార్! తమరిచ్చిన పది రూపా యలతో పుట్‌రెస్ట్ కొన్నాను సార్! సరిగ్గా రెండు రోజుల్లో పదిరూపాయలు మిగల్చగలిగాను." అంటూ పది రూపా యలు జోగారావు ముందున్న టీపాయ్ మీద పెట్టాడు.

జోగారావు తేరుకుని, "నా ఎడ్రసు ఎలా తెలిసిందోయ్!" అన్నాడు

"అదే నాకూ తెలియదు సార్! నా సంచిలో చిన్న కార్డు పడివుంది. మీ అడ్రసు వుంది"

జోగారావు మనస్సు శాంతించింది.

"నాకు యివ్వనక్కరలేదు ....... తీసుకో!" అన్నాడు

"క్షమించండి సార్! వూరకనే ఏమీ తీసుకోను... సెలవు!" ఆ కుర్ర వాడు వెనక్కి తిరిగి పరుగెత్తాడు.

---




ఉలిక్కిపడి కళ్ళు విప్పాడు మధు. కొద్ది క్షణాల వరకూ అతనికేమీ అర్థం కాలేదు. గదంతా అలుముకొన్న చీకటీ, కిటికీలోంచి ప్రవహిస్తున్న వెన్నెలా, లయగా శబ్దం చేస్తున్న గోడగడియారం అవన్నీ తనింతసేపూ విహరించింది కలలోనన్న విషయాన్ని తెలియజేస్తున్నాయ్.

మంచంమీదనుంచి లేచి కూర్చున్నాడతను. మధురమైన ఆ కల తాలూకు తీయదనం ఓ పక్కా, అది కలేనా అన్న బాధ మరో పక్కా అతనిని చలింపచేస్తున్నాయ్.

టైము చూశాడతను. తెల్లారుఝామున మూడవుతోంది. ఇంక తనకు నిద్ర పట్టటం కల్ల.

మంచంమీదకు వాలి కిటికీలోనుంచి వెన్నెలను ప్రవహింపజేస్తున్న చంద్రుడి వంక చూడసాగాడు.

అక్కడ కూడా అతనికి ఆ యువతి ముఖమే కనిపించసాగింది ఎంత అందం! ఎంతటి ఆకర్షణ! అంతటి అందమయిన అమ్మాయిలు ఇంకెవరయినా ఉంటారంటారా? ఊహూ! తనకి నమ్మకం లేదు. ఆమెను చూస్తున్నంతసేపూ తను సర్వస్వం మర్చిపోయాడు.

తను బి. ఏ. పరీక్షలు రాయడానికని హాల్‌టికెట్ తీసుకుని బయటికొస్తున్నాడనీ, తనున్నది కాలేజీలోననీ, వరండా అంతా ఇంకా చాలామంది విద్యార్థినీ విద్యార్థులతో నిండి ఉందనీ - ఇవేమీ గుర్తులేవు తనకి. ఆమె ఆఫీసురూమ్ వేపు నడుస్తూంటే కళ్ళప్పగించి ఆమె వంకే చూస్తూ నిలబడిపోయాడు ఆమె ప్రతి కదలికా తన గుండెలమీద ముద్రించుకు పోతోంది. "హాల్ టికెట్స్ ఎక్కడ ఇస్తారు?" ఓ పక్క నిలబడ్డ ఇద్దరమ్మాయిల దగ్గరికెళ్ళి అడిగిందామె

అంటే ఆమెకూడా తనలాగే పరీక్షలు రాస్తోందన్నమాట అరగంట తర్వాత హాల్‌టికెట్ తీసుకుని ఆమె తిరిగివచ్చే వరకూ మంత్రించినట్లు అక్కడే నిలబడి పోయాడు సృష్టిలోని సౌందర్యమంతా ఆమెలో పొందుపరిచాడు దేముడు. హాల్‌టికెట్ బాగ్‌లో పెట్టుకుంటూ బయటకు వెళ్ళిపోతున్న ఆమెను తనకు తెలియకుండానే అనుసరించాడు.

ఆమె రిక్షా ఎక్కి వెళ్ళిపోతూంటే తన మనసు విలవిల లాడిపోయింది. అంతే! ఆ క్షణంనుంచీ తను పూర్తిగా మతి పోగొట్టుకున్నాడు. కళ్ళముందు అందాలు చిందే ఆమె ముఖమే కనబడు తోంది.

మధు ఆలోచనల్లో తేలిపోతుండగానే తెల్లారిపోయింది.

ఆ రోజునుంచే తనకి పరీక్షలు ఆమెను చూడకముందు పరీక్షల గురించీ తన చదువు గురించీ ఆలోచించేవాడు. ఇప్పుడు ఆ విషయమే మనసుకి పట్టటం లేదు.

పరీక్షకు టైము అవకముందే కాలేజీకి చేరుకున్నాడతను. ఆలశ్యమయితే ఆ అందాల భరిణను చూసే అవకాశం తప్పిపోతుందేమోనని భయం. గేటు దగ్గర్లోనే ఉన్న చెట్టుకింద నిలబడి గేటు లోపలికి వచ్చే అమ్మాయిలను పరీక్షగా చూడసాగాడు. అరగంట తర్వాత అతని కళ్ళల్లోకి హఠాత్తుగా ప్రాణం వచ్చినట్లు అయింది.

ఆమె రిక్షా దిగి లోపలికి వస్తోంది. ఆమె నడకలో మిగతా అమ్మాయిల్లా వయ్యారాలు ఒలకటంలేదు. ఓ విధమైన ఠీవి, హుందాతనం కనబడుతున్నాయ్. ఆమెకు సమీపంగా ఆమెతోపాటు నడిచాడు మధు ఒక్కక్షణం ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. మధు శరీర మంతా ఆ చూపు విద్యుత్ ప్రవహింప జేసింది. మరుక్షణం ఆమె చూపులు మరల్చేసుకుంది. ఆమె వివరాలు తెలుసుకోవాలన్న కోరిక అధికమయి పోయిందతనికి. తనకు తెలిసిన స్టూడెంట్స్‌ని ఎంతమంది నడిగినా ఏమీ తెలీటం లేదు. ఆమె ప్రైవేట్‌గా బి. కామ్. పరీక్షలు రాస్తుందన్న విషయం ఒక్కటే తెలిసింది.

పరీక్షకు వెళ్ళేటప్పుడు, బయటికొచ్చే

ఎప్పుడూ ఆమెను చూస్తేగానీ మన శ్శాంతి ఉండటం లేదు. అయినా ఈ పాడు పరీక్షలు ప్రతిరోజూ ఉంటే ఎంత బాగుండేది! రోజు విడిచి రోజు ఉండటం మూలాన ఆమె కనిపించని రోజు తను అశాంతి పాలవుతున్నాడు. ఒక్కరోజు ఆమెను చూడకుండా గడవటం దుర్భరమవుతోంది. చూస్తున్న కొద్దీ ఆమెనే అనుక్షణం చూస్తూ గడపాలనీ, ఆమెతో కొద్దిక్షణాలు మాట్లాడే అవకాశం కలిగితే బావుండుననీ కోరిక పెరిగిపోసాగింది. ఒకటి రెండు సార్లు ఆమెను పలుకరించాలన్న మొండి ధైర్యంతో సమీపంగా నడచికూడా ఆమె గంభీరత చూసి వెనక్కు తగ్గాల్సి వచ్చింది. కానీ మనసులోని ఆవేదన పెరిగిపోసాగింది. తన మనసుని ఆమెకు ఒక్కసారి తెలియజేయాలి. ఆమె తన నెంతగా ఆకర్షించిందీ, ఆమెను చూచిన మరుక్షణం నుంచీ తనెంత ఉన్మాదుడయిపోయిందీ ఆమెతో చెప్పాలి. ఆమెను తన హృదయపీఠం మీద నిలుపుకుని రాత్రింబగళ్ళు ఎలా ఆరాధిస్తుంది, కను మూసినా, తెరచినా ఆమె అందం తన నెలా వేటాడుతోందీ — ఇవన్నీ ఆమెకు తెలియజేయాలి. కానీ ఎలా సాధ్యమది? ఆమె తనతో మాట్లాడుతుందా? తన మాటలు వింటుందా? ఊహూ! ఆమె తనతో మాట్లాడదు. ఒకవేళ ఆమె మాట్లాడినా తను ఆ ఆనందంలో నోరు విప్పగలడా?

హఠాత్తుగా ఓ ఆలోచన తట్టిందతనికి

అవును! ఆమెకి ఉత్తరం వ్రాయాలి. ఆ ఉత్తరంలో ఆమెకి తన హృదయం కనిపించాలి వెంటనే కాగితం తీసుకుని రాయసాగాడు మధు ఎంతో సేపటి తర్వాత గానీ ఆ ఉత్తరం పూర్తికాలేదు.

అందాలరాశికి,

నమస్తే. ఈ ఉత్తరం రాసిందెవరా అని ఆశ్చర్యపోతున్నారు కదూ! నా పేరు మధు నేను బి. ఏ. ఎగ్జామ్స్ వ్రాస్తున్నాను మీరు హాల్ టికెట్ కోసం వచ్చిన రోజున ప్రథమంగా మిమ్మల్ని చూశాను. మిమ్మల్ని చూడగానే నా హృదయం తీవ్రంగా స్పందించింది. ఏ అప్సరసో దివి నుండి భువికి దిగి నడచి వస్తోందేమోనన్న భ్రమ కలిగింది.

మీ అందం, ఆకర్షణ నన్ను పూర్తిగా పిచ్చివాడిని చేసినయ్. మీ అద్భుత సౌందర్యం నా హృదయం మీద ముద్రించుకుపోయింది. చూస్తున్నకొద్దీ మిమ్మల్ని ఇంకా చూడాలని తపన. ఇంత వరకూ నన్నింతగా ఆకర్షించిన అమ్మాయిలెవరూ లేరు. మీ పట్ల నా కేర్పడిన ఆకర్షణ, ఆరాధన మీకు తెలియజేయకుండా ఉండటం సాధ్యం కావడంలేదు. కానీ గంభీరంగా కనిపించే మీతో మాట్లాడడానికి సాహసం చెయ్యలేకపోతున్నాను.

అందుకే ఈ ఉత్తరం.

తరువాత నేటిల్లో చూడండి!

ఏమిటే అలావున్నావ్....




అన్యథా భావించరు కదూ! దయచేసి మీ పేరు, వివరాలు నాకు తెలియజేస్తారా? ఒకవేళ అది మీ కిష్టం లేకపోతే కనీసం ఆ విషయమైనా తెలియజేయరూ? ఆ ఉత్తరాన్నే గుండెల్లో భద్రంగా దాచుకుంటాను.

మిమ్మల్ని అమితంగా ఆరాధించే—

'మధు'

ఉత్తరమయితే పూర్తయింది కానీ అది ఆ అమ్మాయికి ఎలా అందజేయాలా అన్న సమస్య ఎదురయిందతనికి ఎంతో సేపు ఆలోచించాక గానీ ఉపాయం తట్టలేదు.

మర్నాడు పరీక్ష కొంచెం ముందుగానే పూర్తిచేసి బయటకు వచ్చాడు. బయట ఆమెను తీసుకెళ్ళడానికి రోజూ వచ్చే రిక్షా సిద్ధంగా ఉంది. ఆ రిక్షా తనకి బాగా గుర్తే. రిక్షా పక్కనే నిలబడి బీడీ తాగుతున్న రిక్షావాడి దగ్గరకు నడిచాడు మధు.

"ఇదిగో! చూడు! రోజూ నువ్వు నీ రిక్షాలో తీసుకెళ్ళే అమ్మాయికి ఈ ఉత్తరం ఇస్తావా?" అనడిగాడు మధు.

వాడు మధుని ఎగాదిగా చూశాడు.

"ఏమిటి సార్?" అన్నాడు అర్థంకానట్లు.

"ఈ ఉత్తరం ఎప్పుడూ నీ రిక్షాలో వచ్చే అమ్మాయికి ఇవ్వాలి!" అన్నాడు మధు.

"మీరే ఇవ్వండి సార్! మధ్యలో నాకెందుకు?" అనుమానంగా అన్నాడు వాడు.

మధు ఆలశ్యంచేయకుండా జేబులో నుంచి అయిదు రూపాయలు తీసి వాడి కిచ్చాడు. వాడు మారుమాట్లాడకుండా ఉత్తరం కూడా అందుకుని జేబులో పెట్టుకున్నాడు. ఈలోగా ఆమె గేట్లోంచి బయటికొస్తూ కనిపించింది. ఇంక అక్కడ ఉండబుద్ధి కాలేదతనికి. త్వర త్వరగా నడిచి ఇల్లు చేరుకున్నాడు. రెండురోజులు గడిచిపోయినయ్. ఆమె దగ్గర్నుంచి జవాబు వస్తుందన్న ఆశ సన్నగిల్లిపోయిందతనిలో.

ఆరోజు పరీక్షలేదు. 'పోస్ట్' అంటూ పోస్ట్‌మన్ అందించిన కవరు అందుకుని ఆత్రుతగా చూశాడతను. తనకు పరిచయం లేని దస్తూరి! ఫ్రమ్ అడ్రస్ చూశాడు. 'లోకత' అని ఉంది. త్వరగా కవరు చింపి కాగితం బయటకు లాగి చదవసాగాడు. రెండు పంక్తులు చదవగానే పట్టరాని సంతోషం కలిగిందతనికి.

మధుగారూ,

నమస్తే. మీరు రిక్షా అతనిద్వారా అందించిన ఉత్తరం చదివాను. ఆ ఉత్తరం నిజంగా నాకే రాశారా అన్న అనుమానం కలిగింది ఎందుకంటే మీరు మీ ఉత్తరంలో అందించిన అందం, అద్భుత సౌందర్యం ఇవేమీ నాలో లేవు. ఒకవేళ అది నాకే రాసివుంటే నన్ను అంతగా పొగిడినందుకు మీకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

నా పేరు నీలవేణి. నేను బెంగుళూరు నుంచి బి కామ్ గ్రూప్ ఎగ్జామినేషన్స్ వ్రాయడానికి కొచ్చాను. ఇంకా రెండు పరీక్షలున్నాయి. ఆఖరి పరీక్ష అవగానే బెంగుళూరు వెళ్ళిపోతున్నాను.

నా వివరాలు ఏమి వ్రాయను? వివరాలు తెలియజేయాల్సినంత గొప్ప జీవితం కాదు నది. నాకు ఏడేళ్ళ క్రితం వివాహం అయింది. నాకిప్పుడు ఆరేళ్ళ పాప, నాలుగేళ్ళ బాబు ఉన్నారు. మా వారు రెండేళ్ళ క్రితం చనిపోయారు. ప్రస్తుతం నేను మా పుట్టింట్లో ఉన్నాను. బి కామ్ పూర్తిచేసి ఏదైనా ఉద్యోగం సంపాదించుకుని నా పిల్లలను నేనే పోషించుకోవాలనుకుంటున్నాను. ఈ వివరాలు చాలనుకుంటాను. అయినా ఇంతకంటే ఎక్కువ తెలుసుకుని మీరు ఏం చేస్తారు? నాతో మాట్లాడడానికి ఎందుకు భయపడ్డారు? అంత భయం కలిగించేలా కనబడ్డానా మీకు? ఇంత ఉంటానండీ.

విష్‌యూ ఆల్ ది బెస్ట్
నీలవేణి.

ఉత్తరం చదివిన కాసేపటి వరకూ మధు ఈ లోకంలోకి రాలేకపోయాడు గుండెల్లో సన్నగా బాధ! ఆమెకు వివాహం అయిపోవడం, పిల్లల్ని కనడం, భర్త పోవడం కూడా జరిగి



పోయాయా? భగవాన్! ఏమిటీ విచిత్రం? అతని మనసంతా ఆవేదనతో నిండిపోయింది.

కుర్చీలో వెనక్కు చేరగిలబడి కళ్ళు మూసుకున్నాడు.

మరునాడు మామూలుగానే కాలేజీ

ఆవరణలో చెట్టుకానుకుని నిలబడి ఆమె కోసం ఎదురు చూడసాగాడతను. కొద్ది నిముషాల తర్వాత, ఆమె రిక్షాలోంచి దిగింది. ఆ రిక్షా అతను ఆ చెట్టుదగ్గర నిలబడి ఉన్న మధువంక చూశాడు. వెంటనే ఆమెతో ఏదో చెబుతూ తనను చూపించడం చూశాడు మధు. ఆమె తలతిప్పి మధువంక చూసింది. చూస్తూనే లోపలికి నడిచింది. మధు అప్రయత్నంగానే ఆమెవైపు అడుగులు వేసాడు ఆమె దగ్గరకు రాగానే "హలో!" అన్నాడు పలకరింపుగా.

"మీరు మధుగారూ కదూ!" అందామె నవ్వుతూ. అవునని తలూపాడు.

"నిన్న మీ ఉత్తరం అందింది" నెమ్మదిగా అన్నాడు మధు ఆమె చేతి కున్న వాచ్ వంక చూసుకుంటూ "పరీక్షకు ఇంకో అరగంట టైముంది కాస్సేపలా కూర్చుందామా" అని అడిగింది.

లాన్ప్‌లో ఓ మూలగా కూర్చున్నా రిద్దరూ.

"మీ దీ ఊరేనా!" అడిగింది నీలవేణి.

"అవును!" ఆమె చొరవకి విస్తు పోతూ అన్నాడు మధు

"మీ కింకా ఎన్ని పేపర్లున్నాయి వ్రాయవలసినవి".

"ఒకటే! ఇవాళే ఆఖరు."

"అదృష్టవంతులు. నాకు ఎల్లుండి ఇంకో పేపర్ ఉంది."

"ప్రీక్ష్యలా రోజు విడిచి రోజు కాకుండా ప్రతిరోజూ ఒకో పరీక్ష పెట్ట కూడదూ! త్వరగా అయిపోయేవి కదా!" అందామె నవ్వుతూ.

సరిగ్గా ఆమె మాటలకు వ్యతిరేకంగా తనోసారి అనుకున్న విషయం గుర్తొచ్చి నవ్వొచ్చిందతనికి. అతని నవ్వు చూసి "ఎందుకు నవ్వుతున్నారు!" అని అడి గిందామె

"నేనూ మీ లాగే అనుకున్నాను. కానీ పరీక్షలు త్వరగా అవాలని కాదు! రోజూ మిమ్మల్ని చూడవచ్చని!"

ఆమె కూడా నవ్వేసింది.

"నేనొచ్చి అప్పుడే ఇరవై రోజుల పైన అయిపోయింది. ఇంటి దగ్గర పిల్లలు ఏం గొడవ చేస్తున్నారో ఏమిటో," అందామె.

ఆమె అతి మామూలుగా బాగా పరిచయం ఉన్న వ్యక్తితో మాట్లాడి నట్టుగా మాట్లాడేస్తోంది మధు ఎందుకో ఆమెతో స్వేచ్ఛగా మాట్లాడలేక పోతున్నాడు. టైము అవడంతో ఇద్దరూ లేచి లోపలికి నడిచారు.

"వెళ్ళేటప్పుడు కలుద్దాం" అంటూ ఆమె తను పరీక్ష వ్రాసే హాల్‌వైపు నడిచింది.

మధు పరీక్ష ఎలాగో వ్రాసానని పించి బయటపడ్డాడు. బయటకు వచ్చి అదే చెట్టుకింద ఆమెకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాడు ఓ పది నిముషాల తర్వాత ఆమె బయటకు వచ్చింది. దూరంనుంచే

మధుని చూసి నవ్వింది. దగ్గరగా వచ్చి "బాగా వ్రాసారా?" అని అడిగింది

మధు తలూపాడు.

"మీరు?" అనడిగాడు

"ఫర్వాలేదు."

నీలవేణి గేటువంక చూస్తూ "ఈ రిక్షా అతను ఇంకా వచ్చినట్టు లేదే" అంది. ఇద్దరూ ప్రొద్దుట కూర్చున్న చోటే కూర్చుని కబుర్లలోకి దిగారు. మాటల మధ్యలో నీలవేణి భర్త ఇంజనీరనీ రెండేళ్ళ క్రితం ఏక్సిడెంట్‌లో పోయారనీ, ఇప్పుడామె తండ్రి దగ్గర ఉంటోందని, ఆమె తండ్రి రిటైర్డ్ కలెక్టరనీ ఆమెనూ, ఆమె పిల్లలను పోషించే శక్తి తండ్రికి ఉన్నా, ఆమె అన్నలు, వదినెలు ఆమెపట్ల స్వార్థంగా ప్రవర్తిస్తున్నారని, అందుకే ఆమె ఏదైనా ఉద్యోగం చూచుకుని వేరుగా ఉండాలని అనుకుంటోందని తెలుసుకున్నాడు మధు భర్త పోయాడని తెంపేసెత్తిపోకుండా, పుట్టింటివాళ్ళు సరిగా చూడకపోయినా అక్కడే పడి ఉండాలని అనుకోకుండా, తన కాళ్ళమీద నిలబడి తన పిల్లల భవిష్యత్తును బాగు చేసుకోవాలనే ఆమె నిర్ణయాన్ని ప్రశంసించకుండా ఉండలేకపోయాడు. కేవలం సౌందర్యమే కాకుండా చక్కగా ఆలోచించగలిగే తెలివి, పటుత్వమైన వ్యక్తిత్వం గల ఆమెపట్ల మధుకు అభిమానం ప్రేమ, గౌరవం ఎక్కువ అయ్యాయి చాలాసేపు ఎంతో పరిచయమున్న స్నేహితుల్లా చనువుగా కబుర్లు చెప్పుకుంటూ ఉండిపోయారు.

ఆమె హఠాత్తుగా బయటికి చూసి "అదిగో రిక్షా వచ్చింది. ఇంక వెళదామా" అంది. ఇద్దరూ లేచి బయటకు నడిచారు.

"మీరుండేది ఎక్కడ?" అడిగాడు మధు.

"మాకు తెలిసిన వాళ్ళింట్లో ఉంటున్నాను" అంటూ తనుండేదెక్కడో చెప్పింది నీలవేణి.

ఆమె రిక్షాలో వెళ్ళిపోతుంటే కొద్ది నిమిషాలు అక్కడే నిలబడిపోయాడు మధు

ఆఖరి పరీక్ష వ్రాసేసి బయటకు వచ్చిన నీలవేణి గేటుదగ్గర చెట్టుకింద నిలబడిఉన్న మధును చూడగానే ఆశ్చర్యపోయింది. అతని దగ్గరగా నడిచి "అదేమిటి? ఇవాళ మీకు పరీక్ష లేదన్నారు కదా!" అనడిగింది

"అవును! లేదు ఊరకే మిమ్మల్ని చూద్దామని వచ్చాను" అన్నాడు మధు

"మీ రివాళ పరీక్ష చాలా త్వరగా వ్రాసేశారే!" అన్నాడతను.

"ఊఁ! ఈ పేపరు సరిగ్గా వ్రాయలేదు" అంది కొంచెం దిగులుగా.

"మీ రిక్షావాడు మరో అరగంటగ్గాని రాడనుకుంటాను" అన్నాడు మధు వాచ్ వంక చూస్తూ.

"అవును।" అందామె గేటువంక చూస్తూ.

"కాస్సేపు కూర్చుందామా" అడిగాడతను. ఆమె తలూపింది. ఇద్దరూ ఓ ప్రక్కగా కూర్చున్నారు. నీలవేణి మధు వివరాలన్నీ ఒక్కొక్కటే అడిగి తెలుసుకుంది. కొద్దిసేపటి తర్వాత "మీరు మళ్ళీ పెళ్ళెందుకు చేసుకో కూడదూ?" అంటూ అడిగాడు మధు అకవిమాట వినగానే ఆమె తెల్లబోయింది. మరుక్షణంలో ఫక్కున నవ్వేసింది.

"నేనా? మళ్ళీ పెళ్ళా? ఎవరు చేసుకుంటారు నన్ను? నేను ఇద్దరు పిల్లల తల్లిననే సంగతి మర్చిపో తున్నారు మీరు ఇద్దరు పిల్లల తల్లిని పెళ్ళిచేసుకునేటంత విశాల హృదయం గల మగవాళ్ళున్నారంటారా ఎక్కడైనా" నవ్వుతూ అందామె.

"ఎందుకుండరు?" అడిగాడు మధు.

"ఊహూఁ। అది మీరన్నంత తేలిక కాదు..." తల వంచుకుని అందామె.

"మీరు.... మీ కభ్యంతరం లేకపోతే నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటాను" ఆవేశంగా అన్నాడు మధు.

నీలవేణి ఆశ్చర్యంగా చూసింది మధు వంక తర్వాత నవ్వేసింది.

"నన్ను .... మీరు.... పెళ్ళి చేసుకుంటారా?" అంటూనే గట్టిగా నవ్వేసింది.

"నేను మీకంటే పెద్దదాన్ని। పైగా ఇద్దరు పిల్లల తల్లిని." అంది నవ్వుతూనే.

"కానీ... అవన్నీ" అంటూ ఏదో చెప్పబోయాడు మధు

"ప్లీజ్ మీరింకేం చెప్పకండి। ఒక వేళ మీరు తొందరపడినా అయిదేళ్ళు నా భర్తతో గడిపిన జీవితాన్ని ఈ రెండేళ్ళలో మరచిపోవడం, ఇప్పుడు కొత్తగా మరొకరితో జీవితం ప్రారంభించడం ఈ రెండూ నాకు సాధ్యం కావివి। రెండేళ్ళు కాదు. మరో పదేళ్ళయినా ఆ జ్ఞాపకాలు నన్ను వదలవు. మరో ఆలోచన వేపు నా మనస్సు మొగ్గదు నా దృష్టంతా నా పిల్లల భవిష్యత్తు మీద ఉంది। దయచేసి మీరింకా విషయం మర్చిపొండి." ఖచ్చితంగా అందామె.

మధు ఏం మాట్లాడలేదు. సీరియస్‌గా తయారయిన మధు ముఖాన్ని చూసి అతని చేతిని తన చేతిలోకి తీసుకుని "కోపమొచ్చిందా నా మీద" అంది నెమ్మదిగా.

మధు జవాబివ్వలేదు.

"చూడండీ. ఆవేశంలో జీవితంపట్ల నిర్ణయాలు తీసుకోవడం మంచిది కాదు। మీ దింకా చిన్నవయసు. ఈ వయసుకి ఆవేశం ఎక్కువ. జీవితంలోని అందాల్ని, ఆనందాల్ని అనుభవించాల్సిన వయసు మీది. అన్నీ అనుభవించేసిన వయసు నాది. మీరు నన్ను పెళ్ళి చేసు

తరువాత పేజీల్లో చూడండి :

ఏం జరిగిందో నాతో చెప్పవూ ....




కోవడం న్యాయమే నంటావా? మీరు కాస్త నా తరఫున ఆలోచించండి. నా భర్తను నేను విపరీతంగా ప్రేమించాను. ప్రేమిస్తున్నాను కూడా. నా మనసులో నా భర్తకు తప్ప మరొకరికి చోటివ్వ లేను. అలాంటి నన్ను మీరు పెళ్ళిచేసు కుంటే మీకు ఒరిగే దేమిటి? మిమ్మల్ని ఓ మంచి స్నేహితుడిలా నేనెప్పుడూ గుర్తుంచుకుంటాను అలాగే మీరు కూడా నా పట్ల మీ కేర్పడిన ఆకర్షణని, అభిమానాన్ని, ప్రేమని స్నేహం వరకే పరిమితం చెయ్యండి సరేనా?" అంది నీలవేణి చిరునవ్వుతో.

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా గడచినయ్.

"మీ అడ్రస్ ఇస్తారా?" అడిగాడు మధు నెమ్మదిగా.

"ఎందుకు?"

"మీకు ఉత్తరాలు కూడా రాయ వద్దంటారా?" నిష్ఠూరంగా అడిగా డతను.

ఆమె కొద్దిసేపు ఆలోచిస్తున్నట్లుగా ఉండిపోయింది

"మనం ఉత్తరాలు వ్రాసుకోవడంలో ఏమన్నా ప్రయోజనం ఉందంటారా?" అని అడిగింది కొద్ది క్షణాల తరువాత

మధు సమాధానం చెప్పలేక పోయాడు.

"మీరు నన్ను మర్చిపోరు ఆ

విషయం నాకు తెలుసు నేను మిమ్మల్ని మర్చిపోను. ఒకరినొకరం మర్చిపోలే నప్పుడు ఇక ఉత్తరాలు వ్రాసుకోవడం ఎందుకు? మీకు అసలు విషయం చెప్పనా? నాకు ఉత్తరాలు వ్రాసే అలవాటుగానీ, అనక్తిగానీ బొత్తిగా లేవు నేను జీవితంలో వ్రాసిన మొట్ట మొదటి ఉత్తరం మీకేనంటే మీరు నమ్మ రేమో!" అంది నీలవేణి.

మధు విన్వెరపోయాడు

"వెళదామా! రిక్షా వచ్చింది." అందామె లేచి నిలబడుతూ.

మధు కూడా లేచాడు ఇద్దరూ కలసి బయటకు నడిచారు

"మీ రెప్పుడూ బెంగుళూరు వెళ్ళేది?" అడిగాడు మధు

"సాయంత్రం ట్రెయిన్‌లో."

"నేను స్టేషన్‌కు వస్తాను" —అన్నా డతను.

"ఎందుకు?" అడిగిందామె

"మీకు వీడ్కోలు ఇవ్వడానికి"

నీలవేణి మాట్లాడలేదు.

"వెళ్ళనా మరి?" రిక్షా ఎక్కబోతూ అడిగిందామె.

తలూపాడు మధు ఆమె ఎక్కగానే రిక్షా వెళ్ళిపోయింది

సాయంత్రం నీలవేణి స్టేషన్‌లో అడుగు పెట్టేసరికి ఎదురుగా మధు కని పించాడు ఆమెను చూడగానే సంతోషంగా ఎదురువెళ్ళాడు.

"మీ కోసం అరగంట నుండి ఎదురు చూస్తున్నాను" అన్నాడు నవ్వుతూ.

"ట్రెయిన్ వెళ్ళిపోలేదు కదా!" కంగారుగా అడిగిందామె.

"లేదు! ఇంకో పది నిముషాల టైముంది."

"థేంక్ గాడ్!"

"అది ఇలాగివ్వండి" ఆమె చేతి లోని సూట్‌కేస్ అందుకుంటూ అన్నా డతను ఇద్దరూ లోపలికి నడిచారు. లేడీస్ కంపార్ట్‌మెంట్ వెతుక్కొని దాని ఎదురుగా నిలబడ్డారు మధు ఇక జీవి తంలో మరెప్పుడూ చూడలేనేమో నన్నంత ఆత్రుతగా, తదేకంగా ఆమె వంక చూడసాగాడు. ఆమె ముఖం చూస్తున్న కొద్దీ అతని మనస్సు భారమవుతోంది.

"ఏమి టలా చూస్తున్నారు?" అడిగింది నీలవేణి.

"మీరు ... మీరసలు నాకెందుకు కనిపించారు?" బాధగా అన్నాడతను.

నీలవేణి సమాధానం చెప్పలేనట్టుగా చూసింది.

పిచ్చివాడిలా, ఏదో పోగొట్టుకో బోతున్నవాడిలా చూస్తున్న మధు

తరువాత పేజీల్లో చూడండి !

ఎవరైనా ఏమైనా అన్నారా? ఫర్వాలేదు
చెప్పు పళ్లు రాలగొడుతా !!




చూపుల్ని తట్టుకోలేనట్టుగా ఆమె ముఖం తిప్పుతుంది.

హఠాత్తుగా గార్డు విజిల్ వినిపించింది.

“వెళతాను” అంది నీలవేణి ట్రెయిన్ ఎక్కుతూ.

ఆమెనలా చూస్తుంటే ఆమెను రెండు చేతుల్తో చుట్టేసి “ప్లీజ్ మీరెక్కడికీ వెళ్ళొద్దు మీరూ నా దగ్గరే ఉండిపోండి. మిమ్మల్ని పూవులతో పూజిస్తాను నేను!” అని బ్రతిమాలాలనిపించింది అతనికి.

నీలివేణి ఎక్కిన రెండు నిముషాల తరవాత ట్రెయిన్ కదిలింది.

తలుపు దగ్గరే నిలబడిన నీలవేణి “గుడ్‌బై” అంది చేయి ఊపుతూ.

కదులుతున్న రైలును, కనుమరుగవుతున్న నీలవేణిని మతిపోయిన వాడిలా చూస్తూ నిలబడిపోయాడు మధు.

# జరుగుతున్న చరిత్ర

మానభంగం చేసిన వారికి మరణ దండన కఠినపు శిక్ష। ప్రత్యక్షంగా ఆ దుర్మార్గాన్ని చంపి, పట్టుబడిన వ్యక్తిని కాల్చివేయడమే ధర్మం అని బాద్‌షాఖాన్ వంటి మహనీయమూర్తి కూడా అనేవరకు పరిస్థితి వచ్చింది.

ఐతే, కేసులు రుజువు కావడం– ఆ తర్వాత ముద్దాయిలను కోర్టులో విచారించి శిక్షించడం జరిగినపుడు మరణ దండన లేక కాల్చివేయడం సంభవం. ఈలోగా మహిళలు ఆత్మరక్షణకై జయప్రదంగా పూనుకొనడానికి మార్గాన్ని అన్వేషించవలసి ఉన్నది ఇటీవల పార్లమెంటులో ఒక సభ్యుడు సాటి సభ్యురాలైన మహిళపై ఆమె మానాన్ని శంకించే మాట అన్నందుకని ఆ మహిళ క్రుద్ధురాలై వెంటనే పాదరక్ష ప్రయోగం చేయడానికి ముందుకు వచ్చింది. పిమ్మట, ఆ సభ్యుడు నోరు జారి ఒక మాటనబోయి ఇంకొక మాట అన్నందువల్ల ఈ ఉదంతం జరిగిందన్నారు.

అన్యాయానికి గురియైన మహిళలందరికీ ఆ మహిళ మార్గదర్శి నిజంగా అవలి సభ్యుడు కావలెనని చెడ్డమాట అని వుంటే పాదరక్ష ప్రయోగ స్వీకారానికి అర్హుడు.

ధైర్య సాహసాలు లేని మహిళలు– మన తల్లులు, అక్కచెల్లెండ్రు గౌరవప్రదంగా జీవించలేరని తేలిపోయింది. శాసనాన్ని మరింత కఠినం చేయడంతో పాటుగా, బాల్యంనుంచే స్త్రీకి వ్యాయమం– కర్ర తిప్పడం– కత్తి తిప్పడం– రివాల్వరును ఉపయోగించడం నేర్పించాలి. అవసరం పడినపుడు తుపాకి (రివాల్వర్) లైసెన్సు కోరితే వెంటనే యిచ్చే ఏర్పాటు చేయాలి

* * *

మన ప్రభుత్వం కంపూచియాలోని రాజ్యాన్ని గుర్తించగానే, చాలా మంది అసంతృప్తిని వెల్లడించారు. మనతో ఇప్పుడు ఎక్కువగా సఖ్యాన్ని కోరే చైనా ఆక్షేపించింది.

ఇండో–చైనాలోని ఎర్రటి సీమలు తన నాయకత్వాన్ని లేదా స్నేహాన్ని కోరి రష్యాతో ఎట్టి ప్రసక్తి లేకుండా వుండి వుంటే చైనా మహదానందాన్ని పొందగలిగి వుండేది. కాని, రష్యా సాయాన్ని విస్మరించడం ఆ రాజ్యాలకు సాధ్యం కాలేదు ఆ తర్వాత కంపూచియాను దగ్గర తీసి, చైనా వియాత్‌నాం రాజ్యంమీద దండెత్తింది పిమ్మట దండయాత్రను ఉపసంహరించుకోవలసి వచ్చింది ఇంతలో కంపూచియాలోని

మండి జగన్నాథం

కొన్ని శక్తులను తన పక్షం చేసుకొని వియత్నాం ఒక కొత్త రాజ్యాన్ని ఆ సీమలో ప్రతిష్ఠాపన చేసింది. రష్యా రాజ్యం వియత్నాం చర్యను ప్రశంసించింది. అందువలన, చైనాకు సహజంగా కోపం వచ్చింది.

కాని, ఇతరులకు అసంతృప్తి ఎందువల్ల ? కంపూచియాలో చాలా కాలం పాలించిన పోల్‌పోట్ బృందం భయంకరమైన, క్రూరమైన, అసహ్యమైన చర్యలకు పూనుకొన్నది. ఆ బృందపు పరిపాలన నిర్మూలమైతే ఎవరూ దుఃఖించరు. కాని, దాని స్థానే వచ్చినవారు ఎటువంటి వారు ? కంపూచియా ప్రక్కనున్న థాయిలాండ్, మలేషియా, ఇండోనిషియా వగైరా సీమలను ఈ సంశయం వేధించినది. చైనా-రష్యాల అంతర్యుద్ధ ప్రాంతంలో మనం ఒక వైపున వున్నట్లుగా ప్రవర్తించడం దేనికి ?– అని మన దేశంలో చాలా మంది భావిస్తున్నారు.

ఈ గొడవలన్నిటికీ స్వస్తి చెప్పడానికీ, ఈ విషయంలో చైనా– రష్యాల కక్షలను రూపుమాపడానికీ, ఒక మార్గం వున్నది నరోత్తమ సింహనాయకవర్మను –ప్రాధేయపడిరమ్మంటే వస్తాడు రష్యా చైనాలు రెండూ కలసి అయనతో సహకరిస్తే కంపూచియాకు మంచి పరిపాలన వస్తుంది. ఆ ప్రాంతాన ఘర్షణలు-డవు

సింగపూర్,ఆస్ట్రేలియా ప్రభుత్వాలు కల్పించుకుని, ఎట్లయినా సింహనాయకుణ్ణి మళ్ళీ కంపూచియాకు రప్పించవలెనని ప్రయత్నిస్తున్నారు. ఈ పరిస్థితిని గమనించి, మనివైపునుంచీకూడా– ప్రధమంలో అనధికార పౌరరంగంలోనుంచీ పిమ్మట సరియైన అదును కనిపెట్టి ప్రభుత్వం వైపునుంచీ–ఆ ప్రయత్నాలకు సాయం లభించడం వలబుగా వుంటుంది

కంపూచియా ఫ్రెంచివారి పెత్తనంలో వుండినప్పుడు సింహనాయకునికి పట్టాభిషేకం జరిగింది. కాని, రాజుగా వుండడానికి ఆయన యిష్టపడలేదు మామూలు పౌరుడుగా వుండి, ప్రజలను నడిపించి తన సీమకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి. ఆ రాజ్యానికి అధ్యక్షుడై దేశాన్ని వృద్ధికి తెచ్చినాడు. ఆ తర్వాత అనేకమైన మార్పులు వచ్చినవి. అన్ని సందర్భాలలోనూ, ఇతరులతో వ్యవహరించడంలో చాలా ఘటికుడు అని ఈయన అనిపించుకున్నాడు. ఇప్పుడాయన ఉత్తర కొరియా రాజధానిలో తలదాచుకొని వున్నాడు ఇన్నాళ్ళూ చైనాలోనే వుండేవాడు. పోల్‌పోట్ రాజ్యాన్ని బలపరిచే చైనా ధోరణి ఈయనకు ఇష్టం కాలేదు. అంతట మకాం మార్చుకున్నాడు.

* * *

ముగాబే (జింబాబ్వే ప్రధానమంత్రి) దక్షిణాఫ్రికాతో దౌత్య సంబంధాలను తెంచుకోడానికి సిద్ధమైనాడు. విముక్తి పొందిన శ్యామ వర్ణుల రాజ్యాలలో గద

విధలను దక్షిణాఫ్రికా ప్రోత్సహిస్తున్నది. ఆ రాజ్యాలన్నీ కలసి, సమావేశమై జింబాబ్వేను అహ్వానించినవి ఆ చర్చల ఫలితమే ముగాబే నిర్ణయం.

ఐతే, ఆర్థికంగా సంబంధాలు విడిపోవు. రైళ్ళు ఓడలు తదితర రాకపోకల సౌకర్యాలు- రెండు దేశాలలో వుండేవి- ఉభయులకు అవసరం

దక్షిణాఫ్రికాలో విమోచన కోసం పోరాడే శ్యామవర్ణులపై జరిగే దుండగాలు కొన్ని పాఠకులకు ఈ పంక్తే తెలిసివున్నవి. ఒక దురంతం (1977 సెప్టెంబరు 12న జరిగింది) ఇప్పుడు చర్చకు వచ్చింది 30 ఏండ్ల యువకుడు స్టీఫెన్ బైకో, శ్యామవర్ణ విమోచన స్వాతంత్ర యోధుడు బంధింపబడి, తల మీద (లోపలి మెదడుకు దెబ్బ తాకే) గాయాలకు చికిత్స చేయకుండా 700 మైళ్ళ దూరం తీసుకపోబడి, అక్కడ కూడా చికిత్స లేకపోతే 12 గంటలలో మరణించాడు. డాక్టర్లు, పోలీసులు కుమ్మక్కయి చేసిన పని యిది అవి తెలియగానే దక్షిణాఫ్రికాలోని 50 000 మంది డాక్టర్లు పోగై ఒక కమిటీని ఎన్నుకొని, దానిచేత బైకో చికిత్సాకాండను సమీక్షింపజేసారు కమిటీలో 18 మంది డాక్టర్లు నిర్దోషులన్నారు, తొమ్మిది మంది దోషులన్నారు.

ఈ డాక్టర్లు తప్పించుకున్నప్పటికీ ఇతర జైల్ డాక్టర్లు జాగ్రత్తగా వ్యవహరించవలసి వుంటుంది. దేశంలోని డాక్టర్లు తమ వృత్తికి చెందిన కొందరు, ప్రాణాన్ని రక్షించే దాని బదులుగా, ప్రాణాన్ని అంతమొందించడానికి సాయపడడం తమకు తలవంపులుగా భావిస్తున్నారు.

* * *

అఫ్గనిస్తాన్‌లో తిరుగుబాటుదారులు ఇంకా విజృంభిస్తూనే వున్నారు. కాబూల్ దాకా రాలేదు. దరిదాపుల్లోకి వస్తున్నారు. రష్యా సేనలు కొన్ని ఉపసంహరింపబడినవి; మరికొన్ని దిట్టమైన సాయుధ దళాలు వచ్చి చేరినవి. ఈ సీమలోకి రష్యా సేన రావడం వలన, అంతర్జాతీయ పరిస్థితి ఆందోళనకరమైనది. అయుధాలు, అటంబాంబుల కుప్పలుగల రాజ్యాలు సాయుధ శక్తిని హద్దుల్లో వుంచుకునే చర్చలకు అంతరాయం కలిగింది.

ఈ విషమ పరిస్థితికి విరుగుడు వేయడానికై ఫ్రెంచివారు, పశ్చిమ జర్మన్లు పూనుకున్నారు. లోగడ ఫ్రెంచి రాజ్యాధ్యక్షుడు వార్సాలో బ్రెజ్నెవును కలసుకున్నాడు. ఇటీవల పశ్చిమజర్మనీ ముఖ్యుడు మాస్కోలో బ్రెజ్నెవును కలసి వచ్చాడు ఉభయులు రష్యా నాయకునితో గావించిన చర్చలలో అఫ్గాన్ సమస్యకు పరిష్కారం కల్పించినట్లు తోచింది

వెంటనే మధ్యతరహా న్యూక్లియర్

●యివాతి ఎజల్లి బూధింద!




క్షిపణులను యూరప్‌లో ఏ విధంగా ఎంతవరకు ఎక్కడ వుంచవలెననే చర్చలను సాగించాలి. అఫ్గాన్ సీమ తటస్థంగా వుండి రష్యా ప్రయోజనాలకు, ఇతర ఇరుగు పొరుగు రాజ్యాల ప్రయోజనాలకు భంగం లేకుండా చేయాలి. ఇదే ఆ ఫ్రెంచి, జర్మన్ శాంతి దూతల పథకం.

ఏ విధంగానూ ఇక ఇక అఫ్గాన్ ప్రజల అభీష్టానికి విరుద్ధంగా రష్యా సేనలు ఆ సీమలో వుండలేవని ఈ పాటికి రష్యా నాయకులు గ్రహించి వుంటారు. అందువలన, ఏదో ఒక పరిష్కార మార్గాన సేనలను ఉపసంహరించుకోవడానికి వారు సిద్ధపడినట్లున్నారు.

అంతేగాక, అఫ్గాన్ ప్రజలు విదేశీ దురాక్రమణను ఎదిరించారేగాని, రష్యా ప్రజలపట్ల గానీ, రష్యా రాజ్యంపట్ల గానీ వారికి ఎటువంటి దురభిప్రాయం లేదు. అమనుల్లా అధ్యాయంలో రష్యనులు ఆయనను బలపరిచారు. ఐనప్పటికీ, ఆ తర్వాత వచ్చిన అఫ్గాన్ ప్రభుత్వాలన్నీ రష్యాతో స్నేహంగా వుండినవి. అఫ్గాన్ అంతర్గత రాజకీయాలలో ఇదివరకెన్నడూ రష్యా కల్పించుకోలేదు. ఇరుగు పొరుగు రాజ్యాలతో అఫ్గాన్ ప్రభుత్వాలకు ఎన్నడూ పేచీలు లేవు. ఒక్క ఫఖ్తూనిస్తాన్, బలూచీలు కోరిన స్వపరిపాలనా కేంద్రం విషయాలలో పాకిస్తాన్‌తో తప్ప!

ఆ కారణాల చొప్పున తటస్థ అఫ్గాన్ సీమ అందరికీ సమ్మతంగానే వుంటుంది. అందుకు తగినట్లుగా అఫ్గాన్ ప్రభుత్వంలో మార్పు రావలసి వుంటుంది.

•   •   •

ఇరాన్ అల్లకల్లోలమై పోతున్నది దేశం అయిదు ముక్కలైనది బేన్ సదర్, బెహెస్తీ, ఖోమేనీ, వామపక్షం తూదేపార్టీ. ఇవిగాక శాసనంతో సంబంధంలేని 'న్యాయస్థానాలు' అనేక వందల మందిని విచారించి, శిక్షించి, ఉరి తీసినవి. నాలుగు వేల మందిని సర్వీసెస్‌లో నుంచి తరిమివేసినవి.

ఖోమీన్, బెహెస్త్ అచ్చనబుచ్చనలు. "అచ్చన బుచ్చన లోపల అచ్చన్నే మేలది యెట్లన్నన్! అచ్చన మెల్లగ దెంచును, బుచ్చన తెగదీసి కాడు పెటుక్కొన తెంచున్." ఉభయులు మతోన్మాదులు వేషభాషలు, విద్య, రాజ్య పద్ధతి సర్వం ఇస్లామీ కావలెనని యిద్దరి పట్టుదల. ఖోమిన్ ఇంకా జోరుగా సాగి పోవడంలేదనీ దేశాన్ని తన కప్పగిస్తే తడాఖా చూపించగలననీ బెహెస్తీవాదం.

బేన్‌సదర్ రాజ్యానికి అధ్యక్షుడు. ఉన్మాది కాడు. సవ్యంగా అందరితో వ్యవహరించవలెనంటాడు. వామపక్షం దేశాన్ని సోషలిజం వంటి పంథాకు మర లించవలెనని అంటుంది తూదేపార్టీ ఇరాన్ కమ్యూనిస్టు పార్టీ. ఖోమీనీ తిరుగుబాటును (చక్రవర్తికి వ్యతి రేకంగా) తూదేపార్టీ, వామపక్షం బల పరిచినవి. వామపక్షం, తూదేపార్టీ కలిసి వ్యవహరిస్తే, బేన్‌సదర్ వర్గం సహక రిస్తే, ఖోమేనీ-బెహెస్తీలను ఎదిరించే ప్రతిపక్షం ఏర్పడవచ్చు. పర్దా స్త్రీలకు వుండవలెనని మతోన్మాదులు ఎంత పట్టు దలగా వున్నారో, అది హానికరమని ప్రకటించి పోరాదేవారూ అంత పట్టుదలగా వున్నారు.

ఇరాన్ ధూర్తులు పట్టుకుని బందీలుగా చేసిన అమెరికన్ దౌత్య కార్యాలయంలోని వారి భవితవ్యం ఇంకా నిర్ణయం కాలేదు. వారినీ, వారిని విడిపించ డానికని అమెరికన్లు చేసిన దూకుడు ప్రయత్నాన్ని లోకులు అపుడే మరచి పోయినట్లున్నారు.

•   •   •

పాలస్తీనా ప్రాంతీయుల సమస్యపై పశ్చిమ ఐరోపా రాజ్యాలు ఒక పరిష్కార మార్గాన్ని సూచించినవి. 39 ఇస్లామ్ రాజ్యాలు కలిసి అదే పరిష్కార మార్గాన్ని సూచించినవి ఈ రాజ్యాలు ఇతర రాజ్యాలతో కలిసి ఈ సమస్యను చర్చిస్తే బాగా వుండేది. పాలస్తీనా ప్రాంతీయుల సమస్య ఇస్లామ్ సమస్య కాదు. అది మానవ సమస్య. రాజకీయ సమస్య. దానిని ఇస్లామ్‌గా సంకుచితం చేసినందువల్ల నష్టమే గాని లాభం లేదు.

పాలస్తీనా విమోచన సంస్థ నాయకులతో సంప్రదించి, జోర్డాన్ నది పశ్చిమ తీరాన పాలస్తీనా ప్రాంతీయుల వ్యవహరి

పాలనను కట్టుదిట్టం చేసి 'ఇది మా భూమి' అనిపించవలెను - జెరుసలెం నగరాన్ని పూర్తిగా ఇజ్రాయిల్ మయం చేసి ఆ నగరానికి గల ఇస్లామ్ ప్రాముఖ్యాన్ని తుడిచిపెట్టి, దానిని ఇజ్రాయిల్ రాజధానిగా చేయవలెననే ఇజ్రాయిల్ ప్రయత్నం ఖండింపదగినది- ఈ రెండు విషయాలలో ఇజ్రాయిల్‌కు తప్ప ఇతర దేశాల కన్నిటికీ ఒకే అభిప్రాయం: అవి అన్యాయమైన చర్యలని ఆ అభిప్రాయం తాత్పర్యం.

ఇజ్రాయిల్ దురాగతులు పాలాస్తీనా ప్రాంతంలోనూ, జెరూసలెంలోనూ అగకపోతే, ప్రపంచం ఆ సీమను వెలివేస్తుంది. అమెరికన్లు కూడా దీటో అనక తప్పదు.

మళ్ళీ ఐక్యరాజ్య సమితి సర్వ సాధారణ సభలో ఈ గొడవలు చర్చకు వచ్చేలోపుగా, ఇజ్రాయిల్ సర్దుకోవడం మంచిది. అందు కవసరమైతే బెగిన్ స్థానే మరొక ప్రధాని రావలసివస్తే రానివ్వడం మంచిది.

* * *

ఖగోళ శాస్త్రమా, జ్యోతిష శాస్త్రమా? అనే ప్రశ్న ఆఖరున వచ్చిపడింది. వారఫలితాలు లేని పత్రిక లేదు-'యువ' వంటి కొన్ని పత్రికలు మినహా:

192 మంది సైంటిస్టులు (ఇందులో 16 మంది నోబెల్ బహుమతి పొందిన వారు) ఈ సమస్యపై పరీక్షచేసి, ఈ విధంగా అందర్నీ హెచ్చరించారు:

"ప్రజలు జ్యోతిశాస్త్రాన్ని ఎందుకు విశ్వసిస్తున్నారు? అయోమయంగా వుండే ఈ రోజుల్లో నిర్ణయాలకు రావడానికి ఒక సుకరమైన మార్గం కోసం పాకులాడుతున్నారు. ఆకాశానవుండే శక్తులు మన విధి నిర్ణేతలనీ, మన వశమై జీవితం లేదనీ వారు భావిస్తున్నారు. ఇది మేము ఎరుగుదుము. కాని, ప్రపంచం తెచ్చిపెట్టే సమస్యలను ముఖాముఖీ ఎదిరించవలెను. మన భవిష్యత్తు మన వశమై వున్నదనీ, నక్షత్రాల అధీనం కాదనీ మనం గుర్తించవలెను."

ఖగోళశాస్త్రానికి సంబంధించినదే జ్యోతిషశాస్త్రం. ఐనప్పటికీ జ్యోతిషం మరొక త్రోవన నడుచుకుంటూ వచ్చింది.

పైన ఉదహరించిన సైంటిస్టుల ప్రకటనను బొంబైలోని హేతువాద సంఘం వారు విడుదల చేశారు. విడుదలచేస్తూ వారు చేసిన విజ్ఞప్తిలో ఇట్లన్నారు. "పత్రికలు మనకొక నూత్న సామాజిక వ్యవస్థను నిర్మించడానికి తోడ్పడగల సాధనాలు అందువలన, పత్రికల వారందరికీ మేము విన్నవించుకుంటున్నాము. దయచేసి జ్యోతిషపరమైన forecasts (రాబోవుదానిని ముందుగా చెప్పడం) ప్రచురించకండి; ఒక సైంటిఫిక్ ప్రవృత్తిని పెంచడానికి సాయపడండి; మన రాజ్యాంగంలో ఇటువంటి ప్రవృత్తినే ప్రాధాన్యంగా పరిగణించినారు."

---

# గుండె గుండెకీ మధ్య



యామినీ సరస్వతి

స్టేషన్లో రైలాగ్గానే దిగేడు వెంకట్రామయ్య.

ఇష్టం లేకున్నా అత్తారింటికి వెళ్ళక తప్పక వెళ్ళే కొత్త పెళ్ళికూతురిలా దిగేడు. ఆయన్ని చూస్తే బీదవేషం వేయటానికి ఎంతో శ్రమపడి మేకప్ చేసిన నటుడిలా కనిపిస్తారు. బాగా మాసిన చొక్కా, అక్కడక్కడా కుట్టిన చిరుగుల పంచా, కుట్టవలసిన అవసరం లేక మడతల్లో దాగిన చిరుగుల పైపంచె, చేతిలో ప్లాస్టిక్ చేతిసంచీ, ముక్కుపైకి జారుతున్న కళ్ళద్దాలు ఆయన్ని చూడగానే ఆయన అంతస్థుని చాటుతాయి.

ఎవరు దిగినా ఎవరెక్కినా నాకేం సంబంధం 'నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్' అన్న గీతోపదేశం విన్న దాని లాగా రైలు వెళ్ళిపోయింది. మెల్లిగా బయటికి నడిచాడు వెంకట్రామయ్య.

"పెదనాన్నా!"

హఠాత్తుగా ఆగేడు ఆ పిలుపుకి.

"పెద నాన్నా!"

దగ్గరిగా వినిపించి తల తిప్పి చూసేడు.

మసక కళ్ళకి వెలుగొచ్చినట్టుగా కనిపించేడు రామం. కాని వెంకట్రామయ్య గారికి అతనలా కనిపించటం యిష్టం లేనట్టుగా వుంది, ముఖం చిట్లించేడు. అయితే రామం అది గమనించలేదు.

ఆనందంగా ఈ రైల్లో దిగేవా పెదనాన్నా? పెద్దమ్మా, అక్కయ్యా బావున్నారా? పెద్దమ్మకి కీళ్ళనొప్పు లెలా వున్నాయ్? అక్కయ్యకి యింకా ఫిట్స్ వస్తున్నాయా? బావ బావున్నాడా? అన్నట్టు నీ నడుం నొప్పి ఎలా వుంది? తమ్ముడు బావున్నాడా? ఏం చేస్తున్నాడు? వాడికి పిల్ల లెంత మంది?" కెనడియన్ రైలింజన్లా అడిగేడు.

వెంటనే సమాధానం యివ్వలేదు వెంకట్రామయ్య.

మళ్ళీ రామమే అన్నాడు "నేనిక్కడ స్టేషన్ మాష్టరుగా వుంటున్నాను. నాకిద్దరే పిల్లలు. పెద్దాడు ఎం బి బి యస్.

మొకటి సంవత్సరం చేస్తున్నాడు అమ్మాయికి పెళ్ళయ్యింది అల్లుడు టి సి పక్క స్టేషన్లోనే వాళ్ళుండేది. చూచి రావాలంటే కొన్ని నిముషాల ప్రయాణం అంతే! పద! పద ఇంటికి వెళదాం. మీ కోడలు మిమ్మల్ని ఎప్పుడూ అనుకుంటూ వుంటుంది. మిమ్మల్ని తీసుకుని రాలేదని చెప్పుతూ వుంటుంది."

ఒక్క క్షణం ఆగి "మళ్ళీ వస్తాలేరా రామం వూర్లోకి వెళ్ళరావాలి ముందు" అన్నాడు,

రామం ముఖం మాడిపోయింది.

"ఎక్కడికి పెద్ద నాన్నా?"

"కృష్ణ వద్దకి"

"కృష్ణ యిక్కడున్నాడా? ఏం చేస్తున్నాడు?" ఆత్రంగా అడిగాడు.

"మునిసిపల్ కమిషనర్‌గావున్నాడు."

"అరే! చూడు విచిత్రం. నేనిక్కడ ఆరేళ్ళగా వుంటున్నాను. అయినా ఒక్క రోజూ వూళ్ళోకి వెళ్ళలేదు మా జీవితాలింతే! వెలివేసినట్టుగా వూరికి దూరంగా క్వార్టర్స్‌లో వుంటాము వూళ్లోకి వెళ్ళే అవసరం ఉండదు పిల్లల చదువులకి మా మిక్సెడ్ స్కూలు ఉంది. ఏంకావాలన్నా స్టోర్సు వుంటుంది ఇక గుడ్డలు కావాలంటే పట్నం వెళతాం. పాసు వుంది కదా చార్జీల గొడవ లేదు. ఉదయం వెళితే రాత్రికి తిరిగొచ్చెయ్యొచ్చు. అయినా ఏం జీవితాలో చూడు! అన్నదమ్ముల పిల్లలం అన్నదమ్ములం ఒకే వూళ్ళో వుండికూడా ముఖాలు చూసుకోలేదు"

ఉసహనంగా కదిలేదు వెంకట్రామయ్య.

"నేను వాడి దగ్గరికి అర్జంటుగా వెళ్లాలిరా! మళ్ళీ సాయంకాలం రైలుకే వెళ్ళాలి చాలా అర్జంటు అప్పుడే పది కావస్తోంది. వాడు ఆఫీసుకి వెళ్ళిపోతే నా పని అంతా వ్యర్థం అవుతుంది." అని రామం మాటకి ఆగకుండా కదిలి గేటు దాటాడు వెంకట్రామయ్య.

చివుక్కుమన్న మనస్సుతో ఆగిపోయాడు రామం.

గబగబా యింటికి వెళ్ళి "కమలా! కమలా!" అని పిలిచేడు.

తలుపు తీసిన వెంటనే, "కమలా? మా పెదనాన్నా వచ్చేరు. ఇన్నేళ్ళకి మనం పిలవకుండానే వచ్చారు" అన్నాడు.

కమల ముఖం ఆనందంతో వెలిగింది. "ఏరీ!" అంది ఆత్రంగా.

కొద్దిగా చిన్న బుచ్చుకున్న ముఖంతో "వూర్లోకి వెళ్ళేడు. మా తమ్ముడు కృష్ణ యిక్కడే వున్నాట్టలే! అక్కడికి వెళ్ళి వస్తా మన్నారు" అన్నాడు.

"అదేమిట డీ! ఇంటికి వచ్చి కాళ్ళు, ముఖం కడుక్కొని కనీసం కాఫీ అయినా పుచ్చుకుని వెళ్ళొచ్చుగా?" అంది విచారంగా

"ఆయన ఎప్పుడూ అంతే! నామీద

ప్రేమ చూపేవాళ్ళు కాదు తల్లీ తండ్రీ లేని నేను వాళ్ళపైపడ్డానని బాధ పడేది పెద్దమ్మ. ఆయన తమ్ముడ్ని మరదల్ని నేనే మింగేసినట్టుగా బాధపడేవారు ఈయన. వారాలబ్బాయికి పెట్టినట్టుగా పెట్టేవారు. కానీ నేను అవన్నీ గుర్తుంచుకునేవాడిని కాదు. అనాధగా ఆశ్రమాల్లో, రోడ్లల్లో బ్రతికే బ్రతుకు తప్పినందుకు సంతోషించేవాడిని. కష్టపడి చదివే వాడిని. అందుకే ఎప్పుడూ ఫస్ట్‌గా వుండేవాడిని. ఎసెసెల్సీలో అయిదొందల మార్కులు రాగానే హోస్టల్‌కి ఎప్లై చేయగానే ఉద్యోగం దొరికింది. వెళితే చాలు అన్నట్టుగా వుండిపోయా రిద్దరూ. చాలా మంది పై చదువులు చదివి ఇంజనీరువి తమ్మన్నారు. అయినా ఉపాధ్యాయుల సలహా కంటే స్తోమత ముఖ్యం అనుకుని హోస్టల్లో చేరిపోయాను. తర్వాత ప్రయివేటుగా ఎం ఏ చేసి యీ రైల్వేలోకి వచ్చాను."

కమల మాటాడ్లేదు.

"కమలా! మళ్ళీ సాయంత్రంపూట రైల్లో వెళతార్ట ఆయన. ఏదైనా స్వీటు తయారుచెయ్. ఆయనకి స్వీట్సంటే చాలా యిష్టం. దొడ్లో కొబ్బరి కాయలు తెంపి బర్ఫీ కూడా చెయ్ అదంటే ఆయనకు నోరూరుతుంది. మిరపకాయ బజ్జీలు చెయ్ దొండకాయ వేపుడు చెయ్ వీలయితే భోజనం చేస్తారు నేను వెళుతున్నాను." అని హడావిడిగా వెళ్ళిపోయారు.

భర్త కళలు తెలిసిన కమల ఆశ్చర్యపోలేదు ఆయన అభిరుచికి అనుగుణంగా తయారు చెయ్యటానికి వెళ్ళింది.

• • •

రైలు స్టేషన్ దాటగానే రిక్షావాళ్ళు చుట్టుముట్టేరు వెంకట్రామయ్యని. ఎవరికి సమాధానం యివ్వకుండా కాస్త ముందుకి నడిచి ఒక్కడే వున్న రిక్షా దగ్గరికి వెళ్ళేరు.

"బాబూ! మునిసిపల్ కమీషనర్ గారిల్లు తెలుసా?"

"ఓ!"

"టిక్కా కడతావా?"

"వూఁ"

ఎక్కి కూర్చుని "పద బాబూ!" అన్నారాయన.

కానీ అతను ఎక్కకుండా "రూపా యవుతుంది" అన్నాడు.

"అంత దూరమా?"

"అవును."

"సరే పద"

రిక్షా కదిలింది.

పది గజాలు సాగగానే "నీకు ఆ యిల్లు తెలుసా?" అని మళ్ళీ అడిగేరు.

"తెల్లేమిటండీ! బంగళా అది! బంగళా! మునిసిపాల్టీ వాళ్ళు కమీషనర్ గారి కోసం కట్టించారు. చైర్మన్‌గారి తప్పులు కాయటానికి కమీషనర్ని బుట్టలో వెయ్యటానికి కట్టించారది. ఇక్కడ యింతగా ఎండ మండిపోతుందా!

ఆయన హిమాలయాల్లో వున్నంత చల్లగా వుంటారు గదిలో! ఎందుకో తెలుసా? ఏర్‌కూలర్స్ వున్నాయి గది గదికీ."

వెంకట్రామయ్యగారు మాటాడ్లేదు. కానీ ఆయన మనస్సు మాత్రం తృప్తిగా నిట్టూర్చింది. అయితే ఆ క్షణాన తన యింటి దీనావస్థ గుర్తొచ్చింది మనస్సు ముడిగింది.

మరో అయిదు నిముషాలు గడిచాయ్. రోడ్లు దాటి వెళుతున్నారు షాపులు, థియేటర్లు, పెద్ద పెద్ద మేడలు వెనకబడి పోతున్నాయ్.

"ఇంకా ఎంత దూరం బాబూ! యిల్లు బాగా తెలుసా?"

ఆ ప్రశ్నకి షడన్‌గా బ్రేకు వేసి, 'బాబుగారూ! మునిసిపల్ కమీషనర్ యిల్లు, ఆస్పత్రి, మునిసిపల్ అఫీసు, కలెక్టరాఫీసు, తాలుకాఫీసు, సినిమా హాళ్ళు, పోలీస్ స్టేషన్, కోర్టు, రిజిష్ట రాఫీసు, బస్టాండు, స్టేషన్ యివి రిక్షా వాళ్ళు నిద్రపోతూ కూడా వెళ్ళగలిగిన చోట్లు. మీకేం భయం లేదు." అని మళ్లీ రిక్షా తొక్కటం ప్రారంభించేడు.

స్వచ్ఛంగా మాటాడుతున్న అతడి భాష చూసి "చదువు కున్నావా?" అని అడిగేడు వెంకట్రామయ్య.

"ఆఁ టెన్త్ పాసయ్యా. ఫస్ట్ క్లాసులో. అయినా పైకి చదివించే స్థోమత లేదు మా నాన్నకి. ఉద్యోగం దొరకలేదు నాకు. స్టేట్ బ్యాంక్‌లో సెల్ఫ్ ఎంప్లా యిమెంట్ క్రింద ఈ రిక్షా తీసుకున్నా. రోజూ పది బ్యాంక్‌కి కట్టినా హీనంగా పది మిగులుతాయి. మా నాన్నకి వచ్చే పెన్షన్ ఈ డబ్బూ కలసి నాకూ, మా అమ్మకూ, చెల్లికి, నాన్నకి చాలు నేను రాత్రి కాలేజీలో యింటర్ చదువుతున్నా. మా చెల్లెకి పెళ్ళి ఖాయం అయింది. కట్నం రెండు వేలు. పెళ్ళి ఖర్చు వాళ్ళదే ఇంకో నెల రోజులుంది పెళ్ళి. కట్నం డబ్బు యీ మూడేళ్ళలో దాచింది చాలు. కానీ ఎంత లేదన్నా మరో రెండు మూడొందలు ఖర్చు వుంటుంది. అది యీ నెలలో సంపాదించాలి." అని రిక్షా ఆపి, "అదిగో! అదే బంగళా!" అన్నాడు.

రూపాయి చేతిలో పెట్టేసి, "నీ పెళ్ళి నీ చెల్లి పెళ్ళి సుఖంగా జరుగనీ!" అని వెళ్ళేడు ముందుకి.

చుట్టూ ప్రహారీ గోడతో చాలా అందంగా వుంది బంగళా. ముందు గూర్ఖా వుండి వుంటే అది ఏ సినిమా నటుడి యిల్లో అన్నట్టుగా వుంది. గేటువద్ద గూర్ఖా లేకున్నా వరండాలో మాత్రం జవాన్ ఉన్నాడు. 'ఇంకా టయం అయినట్టు లేదు. ఇంట్లోనే వున్నట్టుంది' అనుకున్నాడు వెంకట్రా మయ్య.

అంతలో పిల్లవాడిని తీసుకుని వచ్చింది ఓ స్త్రీ బయటికి. కుంచన

బొమ్మలా వుంది ఆమె. అంతవరకూ కోడలు ముఖం చూడకపోయినా ఆమె 'తన' కోడలే అయి వుంటుంది అనుకున్నాడాయన.

ఆ బాబు కూడా డాల్‌లాగా వున్నాడు. తెల్లని వొళ్ళు, నల్లని కళ్ళు, గీచినట్టున్న ముక్కు, వుంగరాల వెంట్రుకలు అచ్చం చిన్నప్పుడు కృష్ణలాగే వున్నాడు. కానయితే కృష్ణ కొద్దిగా నలుపు. మనవడికి కోడలి రంగొచ్చింది అనుకున్నాడు.

"సీతయ్యా! బాబుని కాన్వెంట్‌లో వదిలేసిరా!"

వీణ మీటినట్టుగా వుంది ఆ స్వరం.

"టా! టా! మమ్మీ."

వెంకట్రామయ్య తన జన్మ ధన్యమైందనుకున్నాడు ఆ కాస్తకే. అంతలో కారు తోసుకుని వచ్చింది అక్కడికి గేరేజినుంచి.

డ్రైవింగ్ సీట్లోవున్న కృష్ణని గుర్తుపట్టారు ఆయన.

'కృష్ణ కూడా రంగు తేలాడు.'

డోర్ తీసి 'నే నొదిలేస్తా లే!' అన్నాడు కృష్ణ.

'ఆఫీసుకు వెళుతున్నాడు' అనుకుని గబగబా నడిచాడు.

'ఏయ్! ఏయ్! తప్పుకో. ఎవరు నువ్వు. అయ్యగారిని ఆఫీసులో కలుసుకో. ఇంటి వద్దకి ఎవ్వరూ రాకూడదని తెలీదూ?'

జవాన్ మాటలతో బిక్కచచ్చిపోయాడు ఆయన. ఆ మాటలకి అటు చూసిన కృష్ణ వెంటనే తండ్రిని గుర్తించేడు. అతని భార్య మాత్రం నిర్వికారంగా కొడుకుని కార్లో కూచోబెడుతూ వుంది.

గబగబా కారువద్దకి నడిచి "కృష్ణా" అన్నారాయన.

"ఏం యిలా వచ్చారు?" సూటిగా ప్రశ్నించాడు.

షాకు తిన్నట్టై "కృష్ణా!" అన్నాడు బాధగా.

"ఏం యిప్పుడు అవసరమయ్యానా నేను? ఇన్నేళ్లూ మీకు గిట్టనివాడినేగా? కులాంతర వివాహం చేసుకున్నానని వెలివేశారే యిప్పుడేం అవసరం వచ్చింది? చెల్లాయి పెళ్ళికా? అమ్మ జబ్బుకా? డబ్బు కావాలి కదూ! నేనూ నా భార్యా నా బిడ్డలూ మీకు అక్కర్లేదు. మేం అంటరాని వాళ్ళమయ్యాం మీకు. కానీ డబ్బు మాత్రం అలాకాదు కదూ?"

ఒక్కోమాటా బాణంలా దూసుకొచ్చింది.

క్షతగాత్రుడిలా అయ్యారాయన.

"మామగారూ!" అప్రయత్నంగా పిలిచిందామె.

"వందనా!" కఠినంగా పిలిచాడు కృష్ణ.

"ఎవడు మామగారూ! ఎవరు కోడలు? డోంటాక్ రబ్బిష్. మనకీ వాళ్ళకీ చుట్టరికాల్లేవు. మనం వాళ్ళు వేరు వేరు. అవసరాలకి దగ్గరికొస్తే



బంధుత్వాలు కలియవు. గుర్తుంచుకో. మీరు వెళ్ళిరండి. నేను ఆఫీసుకు వెళ్లాలి."

కారు స్టార్టుచేయబోయాడు.

అభిమానం పూర్తిగా చచ్చిన వెంకట్రామయ్య "బాబూ!" అన్నాడు మళ్ళీ.

"నేను మాటల మనిషిని కాను. నాకొకటే మాట! ఒకటే ధర్మం! ఒకతే భార్య!"

రివ్వున కారు దూసుకుపోయింది.

వెంకట్రామయ్య ముఖాన దుమ్ము కొట్టి వెళ్ళింది.

పైపంచతో ముఖం తుడుచుకుని వెనుదిరిగాడు. అంతరాంతరాల్లో యిక్కడ జరిగేది ఛీత్కారమేనని అనుకుంటూ వున్నా మరీ యింత ఘోరంగా జరుగుతుందని అనుకోని వెంకట్రామయ్య మనస్సు బాగా గాయపడింది. అందుకే వందన పిలుస్తున్నా, వినిపించుకోకుండా ముందుకి కదిలేడు. ఒకనాడు తాము నిర్దాక్షిణ్యంగా తిరస్కరించిన కొడుకు వద్దకి రావటమే దౌర్భాగ్యం! ఇక్కడ చెప్పుచ్చుక కొట్టినట్లుగా జరిగిన సత్కారమే చాలు! ఇంకా ఆమె పరామర్శలా!

కొన్ని వి ము షా ల క్రింద మనవడిని ఎత్తుకుని, ముద్దులాడాలని వచ్చిన వూహాకి కూడా కించపడ్డాడు. బరువుగా కాళ్లీడ్చు కుంటూ స్టేషన్ వేపు కదిలాడు.

* * *

సాయంకాలం! రైల్లో కూర్చున్నాడు వెంకట్రామయ్య

"భద్రం పెదనాన్నా! జాగ్రత్త మామయ్యా!" అంటున్న రామం, కమల లిమాటలు దూరమయ్యేయి. రైలు వేగం పుంజుకోవటంతో, రైలు వేగం పుంజుకుని ప్లాట్ ఫాం దాటి వెళ్లిపోయింది. వాళ్లిద్దరూ చేతులు వూపుతూనే వున్నారు బాగా కనుమరుగయ్యేదాకా!

జేబులోంచి రామం యిచ్చిన చెక్కు తీసి చూసుకున్నాడు. "పదివేలు! ఒక్క క్షణంలో వెనకా ముందూ ఆలోచించకుండా చెక్కు రాసిచ్చాడు. ఈ డబ్బుతో సత్యవతి పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోతుంది" మళ్లీ చెక్కు తీసి జేబులో పెట్టుకున్నాడు.

సంచి తెరిచాడు. లడ్డుండలు! తనకి లడ్డుపై ఎక్కువగా కనిపించేట్టు జీడి పప్పు, ద్రాక్ష వుంటే చాలా యిష్టం! కొబ్బరి బర్ఫీ! అది బళ్ళకొద్దీ తినాలన్నంత ఆపత్రయం తనకి ఓ కేజీ దాకా వుంటాయి రెండూ! మిరపకాయ బజ్జీలు! పొట్లం బాగా పెద్దగా వుంది.

కొత్త పంచల జత! జరీ కండవా! పొందూరు చొక్కా గుడ్డ. తానెప్పుడూ ఖద్దరు ధారి. గాంధీగారిచ్చిన మాట ఆజన్మాంతం నిలుపుకుంటున్నాడు.

అవన్నీ చూసిన ఆయన మనస్సు పాడైపోయింది.

గతం ... ప్రస్తుతం ... గిరగిరా తిరిగేయి.

మెల్లిగా జేబులోంచి చెక్కు తీసి రెండుగా చించేడు. తర్వాత సాధ్యమైనంత ముక్కలు ముక్కలుగా చించి విసిరేశాడు! పదివేలు గాల్లో కలసిపోయాయి. ఆ తర్వాత స్వీట్సు, బజ్జీలు గాల్లోకి, ఆ తర్వాత పంచలు, చొక్కా గుడ్డ, ఉత్తరీయం బయటికి గిరాటేశాడు.

పిచ్చివాడిని చూసినట్టుగా చూస్తున్న తోటి ప్రయాణికులవైపు చూడ్లేక కళ్ళు మూసుకుని అటు తిరిగాడు. అవిరళ ధారగా కురుస్తోన్న కన్నీళ్ళు ఆయన మాసిన చొక్కాని తడుపుతున్నాయ్

అవమానం కంటే ఆదరం కూడా బరువే! ఆ బరువు దించుకున్న ఆయన మనస్సు మెలమెల్లిగా తేలికపడుతోంది



# జీవితం ఎందుకు?

వింధ్యవాసిని



అది ఒక సముద్రతీరం. అంతగా మనుష్య సంచారం లేనిచోటు. సమయం సాయంకాలం ఆరుదాటి వుంటుంది. చలికాలపు సాయంకాలమేమో చిక్కగా చీకటి ముసురుకోవడాని కింక ఎక్కువ వ్యవధి లేదు. ఆ కనుచీకటి వేళలో ఒక స్త్రీ - వయసు దాదాపు ముప్ఫయి వుండొచ్చు — ఒక ఎనిమిది సంవత్సరాల పిల్లవాడు కూచునివున్న చక్రాలబండిని గబగబా తోసుకుపోతుంది సముద్రం వయిపుగా.

ఇసుకలో బండి తోయటం కష్టంగానే వుంది. అయినా ఆమె దృష్టి ఆ కష్టంపైన లేదు. ఏదో నిర్ణయించుకుని, అందుకోసం తెగించినదానిలా, ఎదురుగా అలలతో ఎగిరిపడుతున్న సముద్రం వయిపే దీక్షగా చూస్తోంది. ఆవిడ మనసులో వున్నదేమిటో, కుర్చీలో కూచునివున్న పిల్లవాడికి తెలియదు. అతని కిదేమీ అర్థంకావటం లేదు తల్లి తననిలా, ఈ నిర్మానుష్యమయిన సముద్రతీరానికి తీసుకురావటమే కొత్తగా వుంది. అందులోను నీటి వయిపుగా బండి తోసుకుపోవటం ఒక వింత.

నిముష నిముషానికీ తలఎత్తి అమ్మ ముఖాన్ని చదవటానికి ప్రయత్నిస్తున్నాడా కుర్రవాడు కానీ ఆవిడ కివేం పట్టటంలేదు. ఆమె కొడుకుతోపాటు ఈ లోకంనించి శాశ్వతంగా దూరం కావాలనే ప్రయత్నంలోనే సముద్రంలోకి వెళుతోంది. ఆమెకీ అవిటికొడుకు తప్ప జీవితంలో ఏమీ మిగలలేదు. అందుకనే జీవితాన్నిలా అంతంచేసుకోవాలని వెళుతోంది. ఆ ఆవేశంలో తనతోపాటు, కుర్రవాడి ప్రాణాలు కూడా తీసేహక్కు తనకుందా అని ఆవిడ తన్ను తాను ప్రశ్నించుకోలేదు.

రానురాను బండి ముందుకు వెళ్ళటం కష్టమయింది. అతికష్టంమీద కుర్రవాడ్ని గుండెలకి అప్పుకుని నడుచుకుంటూ

ముందుకు సాగిందామె. బాగా నీటి దగ్గరికి చేరేసరికి పిల్లవాడు అడిగేడు.

"అమ్మా, ఎక్కడికమ్మా? ఇంకా వెళితే కొట్టుకుపోతాం. పదమ్మా వెనక్కి" అన్నాడు.

"వద్దుబాబూ. మనలాంటి వాళ్ళకి లోకంలో చోటులేదు నేనీ జీవితాన్నిదచ్ఛ లేను. మనిద్దరం కలిసి ఒక్కసారే చచ్చిపోదాం" అంటూ ముందుకి నడు స్తోంటే మెల్లిగా పాదాల కిందకి అలలు తాకి, అక్కడున్న ఇసుక కదిలిపోతోంది.

కుర్రవాని కెటూ తోచడంలేదు.

"వద్దమ్మా నాకు చావాలని లేదు. వద్దు వద్దమ్మా....నాకింకా చాలా ఏళ్ళు బతకాలని వుంది....అమ్మా, నా మాట వినవూ."

ఈ మాటలా తల్లి చెవికెక్కటం లేదు. పిల్లవాడి కేం తోచటంలేదు. ఆఖరుకి, "నన్నైనా వదిలేయ్యమ్మా" అని గట్టిగా అరిచాడు.

బలాన్నంతా ఉపయోగించి ఆమె చేతుల్నించి విడిపించుకుని, పత్తువలేని కాళ్ళపై నిలబడలేక, ఒక్క గెంతుతో అలల తాకిడికి తడిఅయిన ఇసకలో కూలబడి, దేకుతూ బండి వయిపుగా వెళ్ళసాగేడు.

తలమీద పిడుగుపడినట్టిలా అయి పోయింది తల్లి పరిస్థితి. పేడు-తన కొడుకు-రెండు కాళ్ళులేని ఈ పసివాడికి బ్రతకాలని ఆశ. 'నీవు చచ్చినా సరే, నన్ను వదిలెయ్యి'అని వెళ్ళిపోతున్నాడు. కర్తవ్యతా విమూఢురాలై కొడుకు వయిపు చూస్తోండిపోయింది.

ఇంతవరకూ తన ఆవేశంలో గమ నించలేదు. ఎవరో ఒక వృద్ధుడు పిల్లాణ్ణి లేవనెత్తి చక్రాల బండిలో కూచోబెట్టు న్నాడు. ఈ వేళప్పుడు ఇక్కడ తిరు గాడుతున్న ఈ వ్యక్తి ఎవరా అనే ఆశ్చర్యంతో, తెలియకుండానే ఆమె అడుగులు అటుగా పడ్డాయి.

ఆయన తలఎత్తి చూసాడు. కొద్దిగా మిగిలివున్న వెలుతురులో అతని వయిపు చూసింది. వయసెంతో చెప్పటం కష్టం. మెడలకిందికి వున్న జుట్టు, బాగా పెరి గిన బవిరి గడ్డమూ, చూస్తే సన్యాసిలా కన్పించాడు. చిన్న కాషాయ రంగు గావంచా కట్టుకుని, అదే రంగు తుండు గుడ్డ ఒకటి భుజాన వేసుకుని వున్నాడు. అప్పుడే స్నానంచేసి వస్తున్నట్లుగా, ఒంటిమీద నీటిచుక్కలున్నాయి.

బాగా దగ్గిరయాక ఆ ముఖం వయిపు చూసి, తప్పుచేసిన దాన్లా తలవంచుకుంది. 'నేను మొదట్నించీ అంతా చూస్తూనే వున్నానులే' అన్నట్లున్నాయా చూపులు.

ఆయన, "నే నిప్పుడు నిన్నేమీ అడగను. భయపడొద్దు. అల్లదిగో ఆ గుబురు చెట్లకవతల ఉంది మా ఆశ్రమం. అటు వెళదాం, పదండి" అని జవాబుకోసం చూడకుండా బండీని తోసుకుని ముందుకు నడిచాడు. మౌనంగా ఆయన వెంట నడిచిందామె.

తరువాత పేజీల్లో చూడండి :

ఏమన్నాడు... అడ్డదిడ్డంగా వాగాడా చెప్పు !




పది నిముషాలలో ఆశ్రమం చేరారు. అక్కడ, చుట్టూ నిలువెత్తు గోడలు, పైన గడ్డికప్పిన విశాలమయిన పర్ణశాల ఒకటి, దానిచుట్టూ చిన్నచిన్న తాటాకు గుడిసెలు కొన్ని వున్నాయి. సముద్ర తీరానికి కొంతదగ్గరగా వున్న ఈ ఆశ్రమాన్ని ఆమె ఎప్పుడూ చూడలేదు.

వీళ్ళు వెళ్ళేసరికి పూర్తిగా చీకటయింది.... నలుగురయిదుగురు కాషాయ దుస్తులు వేసుకునివున్నవారిటువచ్చారు. వారిలో ఇద్దరు యువకులు; ఇద్దరు నడివయస్కులూ కూడా వున్నారు. వారు వేసుకున్న దుస్తులవల్ల తేడా లేమీ లేక, ఒకేలా కనిపిస్తున్నారు. ఎంతో భక్తిగా ఎదురొచ్చి, "ప్రార్థనకు వేళయింది స్వామీ" అన్నారు. ఆయన వారి గురువు కాబోలు అనుకున్నదామె.

ఆయన వీళ్ళిద్దర్నీ చూపుతూ, "వీరు మన అతిథులు. వీరికి భోజనానికి పడకకీ ఏర్పాట్లు చూడండి. అంతులేని మనస్తాపంతో వున్న వీరికే కష్టమూ రాకుండా చూసుకోవటము మన బాధ్యత" అన్నారు. ఆ మాటల్లోని దయకు ఆ తల్లి హృదయం కరిగి నీరయింది. మంత్రముగ్ధురాలిలా వారివెంట ప్రార్థనా మందిరానికి తరలి వెళ్ళింది.

* * *

పార్వతికి ఉదయం మెలకువ వొచ్చేసరికి బాగా తెల్లారిపోయింది. [illegible] తను రాత్రి పక్కనుంచుకునే [illegible]

వంక చూడబోయింది. అప్పుడు గుర్తొచ్చాయి రాత్రి జరిగిన సంఘటనలు.

పక్కనే కొడుకు శ్రీధర్ అదమరిచి నిద్రపోతున్నాడు. ఇలా ఈ రోజుని ఈ సూర్యోదయాన్ని చూడకుండా వెళ్ళాలని ప్రయత్నించింది. ఆ ప్రయత్నం ఫలించలేదు. ఈ స్వామివారు అడ్డు పడ్డారు–అనుకుంది.

రాత్రి తోడుగా ఒక వృద్ధురాలు పడుకుంది. ఆవిడెప్పుడు లేచిపోయిందా అని పార్వతి అనుకుంటుండగానే, రెండు పెద్ద కంచు గ్లాసులలో వేడి పాలు తీసుకొచ్చి, "ప్రార్థన అయిపోయింది. స్వామి మిమ్మల్ని రమ్మన్నారు. లేచి కాలకృత్యాలు తీర్చుకుంటారా?" అని సౌమ్యంగా చెప్పింది.

అరగంటలోపల పార్వతి, ఆ కొడుకు మరొక పర్ణశాలలో, పులిచర్మంపై ఆసీనులై వున్న స్వామిముందు, మోకాళ్ళు చాపకుండ కూచుని వున్నారు. వారిద్దరే కాక ఇంకా కొందరు శిష్యులు కూడా వున్నారు. కానీ వారంతా పుస్తకపఠనమో, ధ్యానమో, జపమో తమ పని తాము చేసుకుంటున్నారు.

"ఇప్పుడు చెప్పమ్మా. నీ కష్టమేమిటో? ఎందుకంత దైర్యం చేయబోయావ్?" అని మెల్లిగా అడిగేడు స్వామి.

పార్వతికెలా చెప్పాలో తోచలేదు. చెప్పటమంటూ జరిగితే ఒక్క మాటలో అయేదికాదు. విపులంగా విప్పి చెప్పాలి.

"ఫరవాలేదు చెప్పమ్మా. నే నీకేమయినా సహాయం చేయగలిగితే సంతోషిస్తాను. లేదా నీ దారికి అడ్డురాను. సరేనా? అయినా కూడా ముందొక మాట చెబుతాను. జీవాన్నిచ్చిన దేవుడికే దాన్ని తిరిగి తీసుకునే శక్తి వుంది. ఎంత కష్టం వచ్చినా ఆ బాధ్యత మనపై వేసుకునే హక్కు మనకి లేదు. విలువ టావికి కాళ్ళులేవి ఈ పిల్లవానికే బ్రతకాలని అంతటి ఆశ, అమ్మ పోయినా సరే, నాకు చావు వద్దు అనే తెగింపు వున్నాయే? మరి నీ కెందుకింత విరాళి? పడిన కష్టం చెప్పుకుంటే కొంత భారం తీరుతుంది చెప్పమ్మా."

పార్వతి మొదలుపెట్టింది స్వామి కళ్ళు మూసుకొని వింటున్నారు.

* * *

పార్వతి బాగా ధనవంతుల ఇంటనే పుట్టింది. తల్లిదండ్రులకు ఒక్కతే కూతురు. అందుచేత ముద్దుగా పెరిగింది. అయితే ఆ అదృష్టం బాల్యంలోనే తీరిపోయింది. తండ్రి, చేస్తున్న వ్యాపారం దెబ్బతిని గుండెపోటుతో మరణించాడు. అప్పటికి పెళ్ళీడుకొచ్చిన పార్వతితో ఎలా బ్రతకాలో తోచలేదు తల్లికి. కొందరు చుట్టాల సహాయంతో, ఒక రెండో పెళ్ళివానికి కట్టబెట్టింది పార్వతిని. తానేదో ఓ చిన్నగుడిసె పెట్టుకుని బ్రతకసాగింది. ఇప్పుడామె లేదు కాలం చేసి వెళ్ళిపోయింది.

గుడ్డిలో మెల్లలాగా పార్వతి భర్త రామ్మూర్తి ఆమెని రాగానే చూసుకునే వాడు మొదటి భార్యవల్ల పిల్లలు కలగ లేదు అందుకని ఆవిడ పోయాక సలభై అయిదేళ్ళ వయసులో, మళ్ళీ పార్వతిని పెళ్ళిచేసుకున్నాడు. అతను అంతదాకే భార్యనుండిపొందాల్సిన సుఖాలన్నీఅనుభ వించేడు ఇప్పుడింక ఒక్క సంతాన అపేక్ష తప్ప వేరే ఆశలేదు.

తండ్రిపోయిననాడే ఆశలన్నీ కూలి పోయిన పార్వతి ఈ పెళ్ళివల్ల పెద్దగా బాధపడిందేం లేదు. కానీ రామ్మూర్తి గురించి, సంబంధం కుదిర్చిన పెద్దలు చాలాగొప్పగా చెప్పారు. తండ్రిచావుతో పోయిన ఆస్తి, అంతస్తు తిరిగి పొంద వచ్చని ఆశపడిన పార్వతికి నిరాశే ఎదురయింది. చెప్పిన గొప్పల్లో వున్న నిజం చాలాతక్కువనీ, అతనికి ఆస్తితో పాటు, అతని తండ్రి మిగిల్చిన అప్పులు కూడా వున్నాయనీ, పెళ్ళయ్యాక ఎన్నా ళ్ళకో తెలుసుకుంది.

ఒక విధమయిన నిస్పృహ ఆవరించిం దామెని. అయితే రామ్మూర్తి ఈమె నే కోరికతో పెళ్ళాడాడో ఆ కోరికమాత్రం తీర్చగలిగింది.

శ్రీధర్ పుట్టటంతో ఏదో ఒక ఆశ చిగురించింది పార్వతి మ న సు లో. 'మొదటగా కొడుకుపుట్టటం నా అదృష్టం; వీడ్ని చూసుకొనయినా అన్నీ మరచి పోతాను" అని మనసు కుదుటపర్చుకో వాలని ప్రయత్నించింది. వారి ఇంట యువరాజులా వెలిగిపోయాడు శ్రీధర్. ఎంతో ముద్దుగా చూసేవాడు తండ్రి.

పెద్దగా ఆస్తి లేకపోయినా, తరాల నించీ వచ్చిన వంశప్రతిష్ఠ ఒకటి మిగి లుంది రామ్మూర్తిలో. ఆ చిన్నవారిలో నానా అలగాజనంతో, తన కొడుకుని స్కూల్‌కి పంపటం అతనికి నచ్చలేదు. ప్రత్యేకం ఒక మాష్టార్ని పెట్టి చదివించ సాగేడు. పార్వతి కిదేం ఇష్టం లేదు. ఇనొక దుబారా ఖర్చు అనునేది. కానీ అమె చెప్పినా ఉపయోగం వుండదని తెలుసు.

పిల్లలకోసం మొహం వాచివున్నా డేమో, అతనికి తన కొడుకు దేవుడిచ్చిన వరమని, వాడిని ప్రత్యేకంగా పెంచాలనీ అనుకునేవాడు ఆ పిచ్చి ప్రే మ లో పార్వతి మాటలేం తలకెక్కుతాయి ?

శ్రీధర్ పుట్టిన మూడేళ్ళకి మళ్ళీ గర్భవతయింది పార్వతి అంతవరకూ కొడుకును చూసుకుని మురిసిపోతున్న రామ్మూర్తి ఈసారి కొత్త ఆలోచనలో పడ్డాడు. తన వయసు చూస్తే ఏభై దాటు తోంది. తనున్నాపోయినా ఉన్న ఆస్తిలో పార్వతికి శ్రీధర్‌ని పెంచటం ఏమంత కష్టంకాదు. ఇంకొక అమ్మాయో, అబ్బాయో పుట్టినా ఫరవాలేదు. అంతకు హెచ్చుఅవుతే కష్టమే-అని ఆలోచించు కుని, ఈసారి పార్వతికి పిల్లలు పుట్ట కుండా ఆపరేషన్ చేయిద్దామని నిర్ణయించు

తున్నాడు. ఇందుకు పార్వతి ఒప్పు కుంటుందనే నమ్మకం లేదు. అందుకనే ఆమెతో చెప్పలేదీ విషయం.

అతననుకున్నదే నిజమయింది. పార్వతికి ఇద్దరు పిల్లలతో నిలిపేయాలని లేదు. కనీసం నలుగురయినా కావాలని ఆశ. ఎలాగో కష్టపడి పెద్దవాళ్ళని చేస్తే పిల్లలయినా తన ఆశలు తీరుస్తారని తలచింది. ఈ మధ్యలో రామ్మూర్తి ఆరోగ్యము అంతంత మాత్రంగానే వుంది. అతను పోయినా తనకు తోడుగా తన పిల్లలయినా నిలవాలని కోరుకుంది. తన తల్లికి తనొక్కతే. అందులోనూ ఆడపిల్లయి ఏమీ చేయలేకపోయింది. తనకయినా నలుగురు బిడ్డలుంటే, వాళ్ళే తనకి ఆసరా అవుతారు. ఇంక దేనికీ భయపడకుండా జీవితాన్ని సాగించగలను అని ఆశపడింది.

ఇలాంటి ఊహాల్లో వున్న పార్వతికి మగపిల్లవాడే పుట్టేసరికి మరింత సంతోష మయింది. దేవుడీ రూపంలోనే అయినా తన ఆశలు తీర్చుతున్నాడని తృప్తి పడింది. పిల్లవాడు పుట్టినాక మూడో రోజు డాక్టర్లు చెప్పారు ఆపరేషన్ చేస్తారని. ఆమె ఎంత వ్యతిరేకించినా లాభం లేకపోయింది.

వారం పదిరోజులపాటు ఏడుస్తూ భర్తని ఆక్షేపిస్తూనే వుంది పార్వతి. ఆమె కళ్ళనిండా చెప్పలేనంత కసిగా వుంది.

అతను నెన్నోవిధాల నచ్చజెప్ప బోయాడు. "అదికాదు పార్వతీ! నాకా వయసయిపోయింది. ఎన్నాళ్ళుంటానో తెలీదు. ఇలాంటి పరిస్థితిలో ఇద్దర్ని మించి పిల్లల్ని కంటే నీకే కష్టం అవు తుందనే నేనీపని చేశాను. అంతో ఇంతో చదువుకున్నదాని విలా పిచ్చిదాన్లా, ఏడుస్తూ కూచుంటే నీ ఆరోగ్యమేంకాను? కొంచం నన్నర్థం చేసుకుని, నీ మనసు సంబాళించుకో" అని ఎంతో సౌమ్యంగా చెప్పేడు.

తనతో ఒక్క మాటయినా చెప్ప కుండా అతనలా అన్ని ఏర్పాట్లూ చేసి, తన తలవంచి మోసంచేశాడని అను కుందామె. ఇదంతా ఒక కుట్రలా అని పించిదామెకి. ఆ బుద్ధిమాంద్యతలో, భర్త చెప్పినమాటలే చెవినెక్కలేదు.

"అసలు నలుగురు పిల్లల్ని కనే యోగ్యత లేనివారు, ఈ వయసులో పెళ్ళెందుకు చేసుకోవాలి? నా బ్రతుకు మట్టుపెట్టటానికి కాకపోతే. మీ కేదో గొప్ప ఆస్తి, అంతస్తు వున్నాయని నన్ను మీకు కట్టబెట్టింది మా అమ్మ. అయినా మిమ్మల్నేం లాభం? నా ఖర్మ మీరే అడ్డుపడకపోతే, డబ్బులేకున్నా కనీసం భార్యని ప్రేమగా చూసుకొనే వాడయినా నాకు దొరికుండేవాడు.

"నేను సుఖపడటం సంతోషంగా వుండటం మీకసలు ఇష్టంలేదు. అందుకే ఇలా చేశారు" అని ఎన్నాళ్ళో వాధించింది.

తరువాత పేజీల్లో చూడండి !




ఆమె ఎన్నిమాటలన్నా, రామ్మూర్తి చెక్కుచెదరలేదు. తను చేయవలసింది తాను చేశాననీ, తన బాధ్యత తాను తీర్చుకున్నాననీ సంతృప్తిపడ్డాడు. కొడుక్కి శ్రీనివాసు అని పేరు పెట్టుకున్నాడు.

శ్రీధర్ తండ్రికి చేరికయితే, శ్రీనివాసు తల్లికి దగ్గరయ్యాడు. అమ్మంటే ఎంతో ప్రేమగా వుండేవాడు కాస్త బుద్ధి తెలిసినప్పట్నుంచీ. అమ్మానాన్నపట్ల ఏర్పరచుకున్న ఉదాసీనత, పెంచుకొన్న కోపం వయసు పెరుగుతున్న కొద్దీ ఒక్కొక్కటీ అర్థమవుతున్నాయి వాడికి. దాంతో ఏదో తెలీని అయిష్టత ఏర్పడింది తండ్రి అంటే. ఆయనతో ఎక్కువగా మాట్లాడేవాడు కాదు దగ్గరికి వెళ్ళేవాడు కాదు. ఆయన అమ్మకేదో అన్యాయంచేశాడనే భావం వాడిమనసులో నిల్చిపోయింది. రామ్మూర్తి మాత్రం భార్యకోపాన్ని హాలాహలాన్ని మింగిన శివుడిలా భరిస్తూవొచ్చాడు. కొడుకులిద్దరూ రెండు కళ్ళనుకునేవాడు.

ఆరోజు - కొడుకులిద్దరూ ఆడుకుంటామని పక్కవీధిలోకి వెళ్ళి, హఠాత్తుగా మొదలయిన జడివానలో తడిసి వణుకుతూ వచ్చి ఇల్లుచేరినరోజు - ఒక దుర్దినం, ఆ తల్లిదండ్రుల జీవితాల్లో. తెల్లవారేసరికి పిల్లలిద్దరూ జ్వరంతో పడ్డారు. ఊళ్ళోవున్న ఒకే డాక్టర్ని పిలిపించాడు రామ్మూర్తి. అతను మామూలు జ్వరమే అని మందిచ్చి వెళ్ళాడు. అది మెల్లగా

నిమోనియాలోకి వెళ్ళటానికి మూడు రోజులు పట్టింది. ఎన్ని మందులిచ్చినా బూడిదలోపోసిన పన్నీరయినాయి.

పదోరోజుకి కాటోలు టెంపరేచర్ ఎక్కువయి, శ్రీనివాస్‌కి ఫిట్స్‌వచ్చి, డాక్టర్ వచ్చేలోగా ప్రాణాలు విడిచాడు. ఈ విషయం తెలిసినవెంటనే రామ్మూర్తికి షాక్‌తో గుండెనెప్పి వచ్చింది. అతనికిలా రావటమిది నాలుగోసారి. చాలా స్ట్రాంగ్ స్ట్రోక్ వచ్చిందనీ, ఇంకొక్కసారిలా వస్తే బ్రతకడం కష్టమనీ చెప్పాడు డాక్టర్.

సరిగ్గా అప్పుడే కొడుకుపోయిన దుఃఖానికి తోడు, భర్త ఆరోగ్యాన్ని గూర్చిన దిగులు పట్టుకుంది పార్వతిని. ఎటువంటివాడయినా కట్టుకున్న భర్త. అతను బతికున్నన్నాళ్ళు ఒక రక్షణ. తనకి చేతనయినంతలో ఏదో వ్యాపారం చేసి సంపాదిస్తున్నాడు. అతను పోతే తనేం చేయగలదు ఇంతవరకూ బాధ్యత లంటే ఏమిటో ఎరగదు తను. అందుకే భయం వేసింది.

భర్త ఆరోగ్యం బాగుంటే చాలు - ఉన్న ఒక్క కొడుకూ చాలు - అని వాణ్ణి చూసుకుని సంతృప్తి పడింది. శ్రీనివాసు పోయిన దుఃఖాన్ని కూడా మరిచి, కొడుక్కీ, భర్తకీ శ్రద్ధగా సేవలు చేసింది.... ఆ కొన్ని రోజుల్లో రామ్మూర్తి ఆమెలో మంచితనమూ, అభిమానమూ వున్న మరో మనిషిని చూసాడు. ఇలాగే గడిచిపోతే చాలు అనుకున్నాడు.

కానీ అదీ ఎన్నాళ్ళో నిలవలేదు. జ్వరం తగ్గి పథ్యం తిన్నాడు శ్రీధర్. నెల రోజులకి బాగా కోలుకున్నా డను కున్న ఒక రోజు, నడవబోయి కింద పడితే తెలిసింది కాళ్ళు పడిపోయాయని. విషయం తెలుసుకున్న డాక్టర్, రామ్మూర్తికి చెబితే ఇంకోసారి గుండె నొప్పి రావచ్చనీ, అందులోనే మరణించ వచ్చనీ భయపడ్డాడు. కానీ చెప్పక తప్పలేదు. నరాలు బలహీనమయి కాళ్ళు పోయాయని, ఏదయినా పెద్దాసుపత్రిలో చూపితే నయమేమోనని అన్నాడు.

చిత్రంగా ఈ దెబ్బని తట్టుకున్నాడు రామ్మూర్తి. అప్పుడు కొంత పశ్చాత్తాపం చెందాడు. తను భార్యకి ఆపరేషన్ చేయించి తప్పుచేశానేమో అని. అందు కనే ఎలాగయినా, ఎంత ఖర్చయినా సరే, కొడుక్కి బాగుచేయించాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు.

నీరసంతో మంచంలోపడ్డవాడు కాస్త బలాన్ని పుంజుకుని లేచి తిరగసాగేడు. తన దగ్గర ఉన్నాళ్ళు చేర్చుకున్న డబ్బులో కొంత చేతపట్టుకుని పట్నానికి ప్రయాణమయాడు.

అత నెందరు డాక్టర్లని చూసేడో, ఎన్ని ఆస్పత్రులు తిరిగాడో లెక్క లేదు. డబ్బు నీళ్ళలా ఖర్చయింది కానీ పిల్ల వాడికి కాళ్ళు మాత్రం రాలేదు. ఖర్చు

లతో చేర్చుకున్న డబ్బంతా కరిగిపోయింది. పార్వతి సొమ్ములూ అమ్మేశాడు. దగ్గిరుండి చూసుకోక వ్యాపారం దివాలా తీసింది. అన్ని విధాలా గాలి తీసిన బంతిలా అయిన రామ్మూర్తి మూడొందలు ఖర్చుచేసి చక్రాల బండి కొని, కొడుకుని కూచోబెట్టుకుని ఇల్లు చేరాడు.

ఎప్పుడో మరిచిన కోపమూ, కసి తిరిగి చోటుచేసుకున్నాయి పార్వతి మనసులో. అన్ని విధాలా తన బ్రతుకిలా అవడానికి కారణం భర్తే ననే అభిప్రాయ మామెలో బలంగా నాటుకుపోయింది. కానీ రామ్మూర్తి మెదడు మొద్దుబారిపోయింది. దెబ్బమీద దెబ్బ తగలటంతో అతనికి ఆమె మాటలు అంత బాధను కల్గించేవిగా కన్పించ లేదు. నిజంగా తానామెకి అన్యాయమే చేశాననే భావ మతనిలోనూ చోటుచేసుకుంది. దేనికీ జవాబు చెప్పేవాడు కాదు. పల్లెత్తి మాట్లాడేవాడు కాదు. ఆ సమయంలో అతనికి కాళ్ళులేని కొడుకు మాటలే తోడయాయి. ఆ కుర్రవాడు చాలా గుండెధైర్యం కలవాడు. ఎప్పటికయినా తన కాళ్ళు బాగవుతాయనీ తను మళ్ళీ మామూలుగా నడవ గలుగుతాననీ ఆశ వుంది అతనికి.

ఎవరో తెలిసినవాళ్ళు చెప్పారు, రాయవేలూరు హాస్పిటల్‌కి తీసుకెళితే బాగవచ్చుని. అక్కడ ఎలాంటి ఆశ వదిలేసిన రోగాలైనా బాగుచేస్తారనీ, ఫారిన్ డాక్టర్స్ ఎందరో వుంటారనీ అన్నారు. రామ్మూర్తికి అదీ ప్రయత్నించాలని వుంది. కానీ వేలూరు వెళ్ళటం అంటే మాటలు కాదు. అయిదారు వేలయినా చేతబట్టుకుని వెళ్ళాలి. అంత డబ్బు తన కెక్కడిది? మిగిలిందల్లా ఉన్న ఇల్లు, తినడానికి గింజలు పండుతున్న మూడెకరాల భూమి. ఏదో ఒకటి తాకట్టుపెట్టి డబ్బు తేవాలి.

'ఏమి చేద్దా'మని పార్వతిని అడిగాడు. పెళ్ళయిన నాడే ఆమె తల్లి పట్టుదల మీద ఆ భూమి, ఇల్లు పార్వతి పేరనే రాసేశాడు రామ్మూర్తి. అందుకని ఇప్పుడామె ఒప్పుకుంటే తప్ప ఏమి చేయటానికి లేదు. కానీ పార్వతి మాత్రం, "తినటానికి తిండి, తల దాచుకునేందుకు ఇల్లు అయినా లేకుండా చేస్తారా?" అని చీత్కారమాడింది. "అంత డబ్బు ఖర్చయినా, వీడికి బాగవుతుందనేం నమ్మకం? నేను చచ్చినా సంతకం చెయ్యను" అనేసింది.

అంతదాకా కూడదీసుకున్న ధైర్యం మెల్లిగా జారిపోయింది రామ్మూర్తిలో. క్రమంగా మళ్ళీ జబ్బుపడి ఆరునెల్లపాటు మంచాన పడి ప్రాణాలు వదిలాడు. ఆ ఆరునెలలూ అతన్ని పార్వతి తిట్లు, శాపనార్థాలు కంటే, తాను పోతే, పిల్లలగతి ఏమిటా అనే దిగులు ఎక్కువగా కుంగదీసింది.

మనిషి పోయాకగానీ విలువ తెలిసి రాదంటారు. అలాగే అయింది పార్వతి పరిస్థితి కూడా. బ్రతికున్నన్నాళ్ళూ చీద రించుకున్న భర్త పోతే, నెల రోజులు తిండీ, నిద్రా లేకుండా ఏడ్చింది.

రామ్మూర్తెప్పుడు చస్తాడా అని కాచు కుని కూచున్న రాబందుల్లాంటి అప్పుల వాళ్ళు ఉన్నది కాస్తా, లేనిది కాస్తా అప్పుచూపి, మోసంతో ఉన్న కాస్త పొలాన్ని అమ్మి పంచుకున్నారు. అప్పు డనుకుంది పార్వతి - కనీసం, భర్త అడిగినప్పుడే ఒప్పుకుని భూమి అమ్మ నిచ్చినా బాగుండేది. పిల్లాడికి కాళ్ళయినా వచ్చుండేవేమో - అని. ఇప్పుడనుకుని ఏం లాభం?

సరిగ్గా అటువంటి పరిస్థితిలోనే ఆత్మ హత్య చేసుకుంటే అన్ని కష్టాలు అంత రిస్తాయి - అనే భావం వచ్చిందామెకి. ఏకంగా తనూ, పిల్లాడు సముద్రంలో దూకేస్తే ఏ పీడా వుండదు. అసలింకా బ్రతికుండటం ఎందుకు? ఏం బావుకో వాలని? అని ఎన్నాళ్ళో ఆలోచించి, అనాడా ప్రయత్నం చేయబోయింది. తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తా దన్నట్లు అదీ తప్పింది. ఈ విధంగా కూడా తనకి అన్యాయమే జరిగిందను కుంది పార్వతి.

* * *

చెప్పటం ముగించింది. కొన్నిక్షణాల పేపు మవునంగా వుండిపోయాడు స్వామి ఏదో ఆలోచిస్తున్నట్లుగా.

"ఇప్పుడు నీ వయసెంత?" అన్నాడు.

ఎందుకడుగుతున్నారో అర్థంకాలేదు పార్వతికి అయితే అతను చీకటివేళలో హఠాత్తుగా ఎదురుపడినప్పుడే ఆయన పట్ల ఏదో పూజ్యభావ మేర్పడిం దామెలో. ఆ భక్తివల్లనే సమాధానం చెప్పింది.

"ముప్ఫయి స్వామీ" అని.

"కాదు.... నీ కిప్పుడు అరవయి ఏళ్ళనుకో. ఎన్నో విధాల రోగాలతో నీ శరీరం క్షీణించి వుంది. మరణశయ్య మీద వున్నావు. అరవయ్యేళ్ళ జీవి తంలో నేను సాధించిన దేమిటో అని గత జీవితాన్ని నెమరు వేసుకుంటు న్నావు. ఇలా ఊహించుకో. ఇక నీ జీవితాన్ని గూర్చి నేను చెబుతాను" అని మొదలుపెట్టారు గంభీరంగా ఆయన నోట వస్తున్న మాటల్ని మంత్ర ముగ్ధలా వింటూ వుండిపోయింది పార్వతి. ఆయన ఆదేశంలో వున్న మహిమ ఎమిటో గానీ, అచ్చంగా అది తన కథే అయినట్లు ఊహించటంలో కృతకృత్యురాలయింది.

* * *

కోటికి పడగెత్తిన జమీందారు చంద్ర బోసు గారి ముద్దుల బిడ్డ శివాని. జమీం దారుగారు గొప్ప శివభక్తులు. అందుకే శివాని అని కూతుర్ని ముద్దుగా పిల్చు కున్నాడు. తల్లిలేని బిడ్డని బాగా

తరువాత పేజీల్లో చూడండి :




గారాబం చేస్తూ వొచ్చారు. ఆమె చదువు అంతా చిన్నప్పట్నుంచీ మంచి కాన్వెంట్‌లో సాగింది. ఆమె స్కూలు చదువు ముగిసేసరికి, కూతురి మీద ఓ లక్ష రూపాయలు ఖర్చుచేసి వుంటారు జమీందారు. తన మాట కద్దులేదనీ, తను కోరటం, అది తీరకపోవటమూ అనేది లేదని, శివానికి బాగా గర్వం. అందుకు తోడు చదువూ బాగానే అబ్బింది. అది ఆమెలో మరింత అహంకారాన్ని పెంచింది. జీవితమంటే ఒక ఆటలా, పాటలా గడిపేయటమే అనుకుంది.

అప్పుడే వచ్చిన వయసుతోపాటు మారిన ఆలోచనలకి, కాలేజీ వాతావరణం దోహదం చేసింది. ఎన్నో రకాల మనుషులతో పరిచయాలు, స్నేహాలు, సరదాల్లో చదువు వెనకబడింది. కూతురు చదవటం ఏదో ఒక గౌరవంకోసమే గానీ, కష్టపడి చదవాలని చంద్రబోసు గారెన్నడూ అనుకున్నది లేదు అందుకే కాన్వెంటునుంచీ బయటపడ రెక్కలొచ్చిన పక్షిలా ఎగుర్తున్న కూతుర్ని చూసి ముచ్చటపడ్డారె. సరదాలు తీరే వయసిదే. మళ్ళీ పెళ్ళి, సంసారము అంటూ మీదబడితే, ఇంక స్వాతంత్ర్యమేం వుంటుంది? అనుకునేవారు. ఆమె ఖర్చులు వందలకు వందలు అయిపోతా

యని దివానుగా రెంత మొత్తమున్నా పెడచేతిన పెట్టేవారు

ఇలా ఆటపాటల్లో కాలం గడుపుతున్న ఈ కోటీశ్వరుని ముద్దుబిడ్డని ఒక అమాయక యువకుడు ప్రేమించాడు అందమూ, ఆ స్త్రీతో పాటు మంచి మనసు కూడా వున్నదని తెలిసి మోసపోయాడు ఒక మామూలు మధ్య తరగతి వాణ్ణి మనసారా కోరి పెళ్ళాడేందుకు శివాని పిచ్చిదికాదు. అతను తనపై చూపుతున్న ప్రేమకి వేరే అర్థం చెప్పుకుంది తన అభిమానాన్ని తన ఆస్తిపై ఆశగా అపార్థం చేసుకుంది

అయినా తన మనసులో భావాలేమీ బయిట పెట్టకుండా, అతన్ని తనవెంట తిప్పుకుంది ఒక ఆటబొమ్మలా ఆడుకుంది అతన్ని రూపాన్ని తన గర్భంలో చేర్చుకునేదాకా, మోహంతో మూసుకుపోయిన ఆమె కళ్ళు తెరచుకోలేదు

విషయం తెలిసిన చంద్రబోసుగారు మొదట్లో గాభరాపడ్డారు తర్వాత ఆలోచించారు డబ్బున్నవారికి చేయలేని పని ఏముంది? కొన్ని నెలలపాటు మరో వూరికి తీసుకువెళ్ళి కూతురు చేసిన పాపాన్ని తుడిచేసి, మామూలు మనిషిగా చేయటం అతని చేసిన మొదటి పని. వెను వెంటనే తమ ఆస్తికి తగిన సంబంధాన్ని వెతికి పట్టారు ప త లి వా ళ్ళ జ సీ ం దా ట్లు కపోయినా తమ అంతస్తుకు తగినవాళ్ళేనని తెలిసిన శివానికి అభ్యంతరమూ లేకపోయింది.

అన్ని రోజులూ చెప్పకుండా మాయమయిన ప్రియురాలికోసం, ఎంతగానో వగచిన శేఖరం, తిరిగి ఆమె కనిపించే సరికి దగ్గర చేరి తన బాధనంతా వెళ్ళబోసుకున్నాడు ఆమెని విడిచి వుండలేనని, వెంటనే పెళ్ళి చేసుకుందామని అన్నాడు.

అయ్యో పిచ్చివాడా అన్నట్లు చూసిందతనివంక శివాని. "నీలాంటి బుద్ధిహీనుణ్ణి పెళ్ళాడేంత తెలివిలేనిదాన్ని కాదు. నేను వేసుకునే ఒక జత బట్టల ఖరీదు అయినా నువ్వు నెలరోజులకి సంపాదించ గలవా? నా కోరికలు తీర్చ గలవా? అష్టైశ్వర్యాల్లో వున్న నన్ను నీ మురికి జీవితంలోకి ఈడ్చి, సంతోషిద్దామనుకున్నావా? చాల్చాలు వెళ్ళు. నీతో చేసిన స్నేహానికి నాకిప్పటికొచ్చిన కష్టం చాలు. . అసలు సంగతి చెబుతాను విను. నా పెళ్ళి కప్పుడే సంబంధం కుదిరింది. వరుడు ఎమ్బియే చేసి, స్వంత కంపెనీకే మేనేజరుగా వున్నాడు! లక్షల వ్యాపారం చేస్తున్నాడు "అని పొగరుగా చెప్పింది. ఆశలన్నీ కూలిపోయి పిచ్చివాడిలా అయిపోయినాడా అబ్బాయి. ఆ పరిచయానికి అలా ఫుల్‌స్టాప్ పెట్టేసిన శివాని తన జీవితంలో అటువంటి అధ్యాయమే జరగనట్లుగా మరచిపోయింది.



పెళ్ళికుమారుడు చక్రపాణి అందమూ, చదువూ, ఆస్తితోపాటు మంచి బుద్ధి కూడా కలవాడు. ధనంతోపాటు వచ్చే చెడు అలవాట్లేమీ రాలేదు. నలుగురితో కలసి మెలసి తిరిగినా తన హద్దుల్లోపలే వుండేవాడు. శివాని కనీసం పెళ్ళయినాక అయినా భర్తను ప్రేమించి, బుద్ధిగా మసలుకొని వుంటే, జీవితం ఒడిదుడుకులు లేకుండా సాగిపోయేది.

కానీ ఆమె జీవితాని కొక ధ్యేయమంటూ లేదు. ఒక నీతి లేదు విధానం లేదు. పెళ్ళయిన కొన్ని నెలల్లోపలే కొత్త మోజు తీరింది శివానికి. తనంటే ఎంత ప్రేమవున్నా, రోజులో కొన్ని గంటలు మాత్రమే తనతో గడిపే భర్త ప్రవర్తన ఆమెకి నచ్చలేదు. అతను పనిచేయటమన్నా, వ్యాపారమన్నా చూపే శ్రద్ధని, చేతకానితనంగా జమ కట్టుకుంది. తనదారి తాను చూసుకోవటం మొదలుపెట్టింది.

కనీసం పిల్లలయినా పుట్టివుంటే, జీవితంపట్ల ఆమె అభిప్రాయం మారి వుండేదేమో! ఆ అదృష్టమూ లేకపోయింది. తనకు తగిన స్నేహితుల్ని సంపాదించుకుంది. పార్టీలనీ పిక్నిక్‌లనీ మునుపట్లా తిరగటం మొదలుపెట్టింది. చక్రపాణి కిలాంటివి ఇష్టంలేకపోయినా, అతని సంస్కారం ఆమెకి అడ్డుపడనీయ

లేదు. అదే అతను చేసిన పొరపాటు. ఏదో తోచక క్లైము గడపటానికి వెళు తున్న పార్టీలు క్రమంగా అలవాటు క్రమంగా రోజుకొక స్నేహితుడితో అర్ధరాత్రి, అపరాత్రి ఇల్లు చేరేదాకా వచ్చింది పరిస్థితి

నయానా భయానా, ఎంతగానో చెప్పి చూశాడు చక్రపాణి. వాళ్ళు తెలివి అహంకారంతో, మర్యాదకూడా మరచిన శివాని, భర్తనే దుర్భాషలాడటాని క్కూడా వెనుదీయలేదు.

"చేవాత పనికిరాని వాడివి. డబ్బు సంపాదించటం మొక్కటే నీకు తెలుసు. నీలా నన్నుండమని శాసించాలని నీ ప్రయత్నం అది నావల్ల కాదు తాళి పేరుతో నీతో నాకు ముడిపడిపోయిం దనుకుంటే అది నీ మూర్ఖత్వం. నీ చేత గానితనాన్ని మంచితనంగా చూపెట్ట లేవు. భార్యను సుఖపెట్టలేని నువ్వెం దుకు పనికొస్తావు? నా దారి కడ్డురావద్దు నీకెలాగూ ఆనందించే రాత లేదు నేనైనా అనుభవించనీ" అని తెగేసి చెప్పింది. ఇలాంటి వెన్నో సంఘటనలు. ఎన్నో మాటలు.

ఈ గృహ కలహాలతో, ఛిన్నాభిన్న మయిపోతున్న తామిద్దరి బాంధవ్యంతో మునుపట్లా పని చేయలేకపోయాడు. ఎటు వెళ్ళినా అందరూ తనని ఎగతాళిగా చూస్తున్నట్లు ఎందుకూ పనికిరాని వెధవ అని అవమానిస్తున్నట్లు ఊహించుకొని బాధపడసాగేడు. చివరికి విసిగిపోయి పెళ్ళయిన పది సంవత్సరాలకి ఒక రోజు ఎవరికీ చెప్పకుండా ఇల్లు వదిలి పోయాడు - సన్యాసి అయిపోవాలని.

ఇందుకు పెద్దగా బాధపడలేదు శివాని 'ఇదీ ఒక స్టంటు నన్ను లొంగ దీయటానికి. తీసుకెళ్ళిన డబ్బులన్నీ అయిపోతే, తిండికీ, ఇంటికీ ముఖం వాచి తిరిగిరాడూ?' అని సరిపుచ్చు కుంది.

నిజాని కామెకు అతన్ని గురించి ఆలో చించేంత టయిం కూడా లేదు. ఆమె స్నేహితులకి ప్రోగ్రాంలకి ఇరవయి నాలుగ్గంటలు చాలడం లేదు తన కంటికి వచ్చిన మగవాడితో స్నేహం చేయటానికి, ఎంత డబ్బు ఖర్చయినా వెనుకాడలేదు. అతను సంసారి అయితే ఆ సంసార విచ్ఛిత్తి అయేదాకా తృప్తి పడేది కాదు.

కానీ ఆ సంతోషమూ, అనుభవమూ ఎన్నాళ్ళు? ఎన్నేళ్ళు? వయసు, పొగసు చూసి ఆడిన ఆటలన్నీ, అవి కాస్త పోయాక నిల్చిపోయాయి సగం ఆస్తి, సగం వయసు కరిగిపోయాక, మిగిసి పోయాయి ఒక చేదు రుచి మాత్రం మిగులుంది. అప్పటికే ఆమెకి తాగుడు బాగా అలవాటయింది.

నలభై సంవత్సరాలకే రక్తపోటు, దానితో పాటు మరికొన్ని రోగాలు సంక్రమించాయి. అప్పుడనుకుంది తినీ




పెళ్ళిచేసుకుని ఏం సాధించానా అని. ఆఖరికి తనకంటూ ఒక బిడ్డయినా మిగలలేదుకదా అనిపించింది. కానీ ఒకప్పుడు పిల్లలు పుడితే తన అందం పాడవుతుందని, పుట్టకపోవటమే మంచిదయిందనీ అనుకున్నదని ఇప్పుడు గుర్తు రాలేదు.

రోగిష్టి అయాక మంచంపాలు కావడానికి ఎన్నో రోజులు పట్టలేదు. పక్షవాతం వచ్చి, ఓ కాలూ చెయ్యీ పడిపోయాయి. అప్పుడు ఆ అసహాయ స్థితిలోగానీ ఆమెకి జ్ఞానోదయం కాలేదు కానీ అప్పటికే సమయం మించిపోయింది జీతానికి పనిచేసే సేవకులు సమయానికి భోజనం పెట్టి, అన్ని సేవలూ చేస్తున్నారు కానీ తన మనసు విప్పి చెప్పుకోవటానికి గానీ, ఒక్క సానుభూతి వచనం చెప్పటానికి గానీ ఒక్క మనిషయినా మిగల్లేదు.

ఏనాడీ ప్రాణం నన్ను విడుస్తుందా అని నిరీక్షిస్తూనే ఎన్నో ఏళ్ళు గడిపింది. ఈ జన్మలోనో, ముందు జన్మలోనో, ఎంతో పాపంచేసి వుంటేనే దీర్ఘవ్యాధులు సంక్రమిస్తాయి రావటం అంటూ జరిగేక త్వరగా ప్రాణం పోదు అది ఒక రకమయిన శిక్ష తన తెలివితక్కువతనంతో బంగారం లాంటి భర్తను పోగొట్టుకున్నందుకు, ఒకప్పుడు ఒక అమాయకుణ్ని నమ్మించి మోసగించినందుకూ, చేసిన తప్పు చాలక భ్రూణహత్యకి పాల్పడినందుకూ, తలచుకొని తలచుకుని కుమిలిపోయింది. ఆమె శీలం, చరిత్ర తెలసినవాళ్ళెవరూ,

పెంపకానికయినా తమ పిల్లల్నివ్వలేక పోయారు.

* * *

"ఇప్పుడా శివాని మరణశయ్య మీదుంది. నేను చెప్పినట్లుగా ఆ శివాని నువ్వే అనుకో. ఇప్పుడు నువ్వు మరణిస్తే నీకు ఆత్మశాంతి లభిస్తుందను కుంటున్నావా?" అడిగేరు స్వామి.

ఈ కథ వింటూంటేనే పార్వతి మనసు కలచినట్లయింది. ఇటువంటి జీవితం తనది కావటం కన్నా వేరే దురదృష్టం వుండదు. దీనికంటే తన వ్యగతం ఎంతో మేలు. అంతటి పాప పంకిల మయిన మనిషి కన్నా, నా బ్రతుకే మెరుగు. ఏదో ఒక కొడు కంటూ వున్నాడు తనకి ఆ శివానికేం మిగిలింది? చేసిన పాపాలకి అదీ జన్మ లోనే శిక్ష అనుభవించింది ఆఖరుకామె చస్తే, కంటనీరు పెట్టేవారు కూడా లేకుండా అయింది ఎంత సిరిసంపదలతో ఓలలాడితేనేం లాభం? నా కవేవీ లేక పోయినా, దైహికంగా, మానసికంగా ఒక పవిత్రత దక్కింది. ఒద్దు నాకయితే ఆ బ్రతుకొద్దు — అనుకుంది.

ఆమె మనసులో చేస్తున్న ఆలోచ నల్ని చదివేస్తున్నారు స్వామి.

"ఇప్పుడు చెప్పమ్మా. ఇంకా నీ బ్రతుకులో సార్థకత వుందని అను కోవటం లేదా నువ్వు. ఇంకా ఆత్మ హత్య చేసుకోవాలని అనిపిస్తోందా?" నవ్వుతూ అడిగారు స్వామి.

"అవును-" అనలేకపోయింది పార్వతి.

"చూడు తల్లీ. ప్రతి మనిషి జీవితం లోనూ 'ఒక అర్థం వుంటుంది అని తెలుసుకోవటానికే మనం ప్రయ త్నించాలి. ఎందుకు జీవించాలి అనేది అర్థం అవుతే, ఎలా బ్రతకాలి అనేది సమస్య కాదు నీ కొడుకే నీకు ధ్యేయం. తల్లిగా నీ అవసర మతని కెంతైనా వుంది."

"ప్రతి తల్లిదండ్రులు, తమ సంతానం తమ కేదో చేయాలని కోరుకునే ముందు తాము వాళ్ళపట్ల తమ బాధ్యతల్ని చక్కగా నిర్వహించామా అని ప్రశ్నించు కోవాలి."

అలా ఆయన చెబుతోంటే, ఆ మాటలే వెలుగు కిరణాలై తన కళ్ళ ముందు చీకట్ని తొలగిస్తున్నట్లుగా తోచ సాగింది.





# సూర్యుడికి చీకటేమిటి?

పంతుల జోగారావు

చంద్రకి విసుగ్గా ఉంది. ఆలోచనల్తో తలవేడెక్కిపోయి దిమ్ముగా వుంది. అసహనంగా మంచంమీద అటూ యిటూ దొర్లుతోంది. ఆమెకి అందరిమీద కోపంగా వుంది. తనమీద తనకే చిరాగ్గా వుంది. ప్రక్కనే బొంతమీద రజని

వాళ్ళెరక్కుండా నిద్రపోతోంది. ఏడేళ్ళ ఆ పిల్లని చూసి భారంగా నిట్టూర్చింది చంద్ర.

ఏడుపొస్తోంది.

ఆమెకి తెలీకుండానే కన్నీరు ఆమె చెంపలమీద నుంచి జారి చారలు కట్టింది

సిలింగుఫేను రొదచేస్తూ, తిరుగుతోంది. ఆ శబ్దం చంద్రకి భరించలేనిదిగా తోచింది. తలలో సూదుల్తో పొడుస్తున్నట్టుగా దాని కిర్రు శబ్దం వినలేకపోతూవుందామె ఫేను కట్టేద్దామా అనిపించింది కాని ఉక్కపోతతో ఊపిరాడదు. చెమట్లుపట్టి, శరీరమంతా ముద్దగా తడిసిపోతోంది. ఆ పరిస్థితి మరీ రోత.

చంద్రకి వంటింటి వసారాలోనుంచి మాటలు వినిపిస్తున్నాయి.

అమ్మ సన్నగా ఏదో గొణుగుతోంది. మధ్య మధ్య ఆవిడ గొంతు దుఃఖంతో పూడ్చుకుపోవడం తెలుస్తూనే వుంది. మధ్యలో నాన్న కలగజేసుకుని ఏదో అంటున్నాడు. వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో తనకి తెలుసు తెరలు తెరలుగా వచ్చే దుఃఖాన్ని బిగబట్టుకోడానికి ప్రయత్నిస్తూ ఆ మాటలు అవతలి గదిలో వున్న తనకి వినిపించేస్తాయేమో నన్నట్లుగా అమ్మ బొంగురు గొంతుతో మాట్లాడుతోంది.

ఛీ. వెధవకొంప. ఎన్నాళ్ళని యిలా భయాల తెప్పలమీద ప్రయాణించడం? తల్లీ, తండ్రీ, చెల్లీ – అందరూ తనతో బెంగగా బెరుగ్గా ఒదిగిపోతూ ప్రవర్తించడం – ఎంత దుస్సహంగా వుంది!

ఎవరూ తనతో ఫ్రీగా వుండలేరు. ఎక్కడ ఏ మాట జారితే తమ మధ్య నిలదొక్కుకునివున్న ఆర్థిక సంబంధాల దారం పుటుక్కున తెగిపోతోందోనన్న బెంగ. అంతేనా? అది తప్ప తమ మధ్య మరే అనుబంధమూ లేదా!

ఇంట్లో బియ్యం నిండుకుంచే – బియ్యం లేవని చెప్పడానికి జంకుతూ, 'చంద్రా, ఆ బియ్యం డబ్బాలోనుంచి ఓ గ్లాసుడు కొలిచి తీసుకురామ్మా ఎసరు మరుగుతోంది' అని కేకేస్తుంది అమ్మ. బియ్యం నిండుకున్నాయనీ – ఆ పూటకి మాత్రమే వున్నాయనీ – ఆవిడ ఉద్దేశ్యాన్ని అలా తెలియజేస్తుంది.

ఓణీలు చిరిగిపోయేయని చెప్పడానికి బదులు – ఆ చిరుగుల ఓణీలోంచి పెల్లుబికే అందాల్ని తనముందు ప్రదర్శిస్తూ అదే పనిగా తన కళ్లెదుట తిరిగే చెల్లీ.

బీడికట్టకోసం తన పర్సు తడుముతూ తన కంటపడేసరికి – 'చిల్లర డబ్బులు యేమైనా వున్నాయేమోనని –' అంటూ వెకిలిగా నవ్వడానికి ప్రయత్నం చేస్తూ – నాన్న . ..

తను తెచ్చే జీతంతో ఇల్లు గడవాల్సిన మాట నిజమే కానీ – కేవలం ఆ ఒక్క వాస్తవంకోసం – పూర్వపు అనురాగాలూ మమతానుబంధాలూ, ప్రేమలూ అన్నీ

విఫలమై విచ్ఛిన్నమై పోవాలా! అంతా యాంత్రికంగా కృత్రిమంగా తయారవ్వాలా?

చంద్రకి ఏడుపొస్తోంది.

నాన్న ఏదో అంటున్నారు. అమ్మ వెక్కిళ్ళు హార్మనీ నొక్కులు లాగా వినిపిస్తున్నాయి.

'ఉష్.... ఏడవకే- అది లేస్తే వింటుంది, అంటున్నాడు నాన్న. ఏడుపుని ఆపుకునే ప్రయత్నంలో అమ్మ ఉచ్ఛ్వాస నిశ్వాసలు బరువుగా వినిపిస్తున్నాయి.

వరండాలో క్లాసు పుస్తకం పట్టుకుని దిక్కులు చూస్తోంది చెల్లి ఉమ. దానికి పుస్తకం మీద ధ్యాస నిలవటం లేదు. దాని మనసిప్పుడు కల్లోల సముద్రంలాగ వుంది కాబోలు, ఇంట్లో ఎదురవుతున్న పరిణామాలని చూస్తూ- ఆకలింపు చేసుకోగలిగే వయసూ, అవగాహన లేక దాని మనసు ఎంత అస్తవ్యస్తంగా తయారయిందో?

చంద్రకి పిచ్చెత్తిపోతున్నట్టనిపిస్తోంది. వెర్రిగా కేకలు వేయాలనిపిస్తోంది.

కరెంటు పోయింది.

తిరుగుతున్న ఫేను శబ్దం ఒక్కసారిగా ఆగిపోయింది. కాలమే స్తంభించిపోయినట్లయింది చంద్రకి. లేచి లైటు వెలిగించే ఓపిక లేదనిపిస్తోంది.

రెండు నిముషాలు గడిచేయి.

ఉక్కపోత భరించలేనిదిగా ఉంది.

కోడిగుడ్డు లాంతరు వెలిగించి తెచ్చి గదిలో పెట్టి వెళ్ళిపోయింది ఉమ.

నిశ్శబ్దం. ఒక మాట లేదు. పలకరింపు లేదు.

తరతరాల శత్రుత్వం, ద్వేషభావం తమ మధ్య తిష్టవేసుకున్నట్టు-

లాంతరు పెట్టేసి వెళ్ళిపోతున్నదాన్ని జడ పుచ్చుకుని లాగి, ఆ చెంపా యీ చెంపా వాయించా లనిపించింది చంద్రకి.

'నేను నీ అక్కనే దెయ్యాన్నా! నాతో అంత నిర్లిప్తంగా ప్రవర్తిస్తా వెందుకే?' అని అరవాలనిపించింది చంద్రకి.

ఉద్వేగంతో వశం తప్పిన మనసుని స్వాధీనపర్చుకోవడం సాధ్యం కావటం లేదు చంద్రకి. దబదబ తలమీద చేతుల్తో బాదుకుంటూ వెక్కివెక్కి ఏడవటం ప్రారంభించింది.

చంద్ర ఏడుపు విని ఇంటిల్లిపాదీ గాభరాగా అక్కడికి చేరారు.

'చంద్రా, ఏమయిందే?' అంటూ సముదాయించబోయింది తల్లి జానకమ్మ. ఒక్క విసురున ఆవిడ చెయ్యి విసిరి కొట్టింది చంద్ర.

'ఇంకా ఏం కాలేదు- కాలేదనే ఏడుస్తున్నాను' అంది రోషంగా.

'ఏమిటి తల్లీ?' ...విస్తుపోతూ అడిగింది జానకమ్మ.

'నా చావు' విసురుగా వచ్చింది

జవాబు. ఆ జవాబు కసుక్కున పదునైన కత్తిలా గుండెలో దిగబడిందో యేమో- 'అయ్యో, చంద్రా' అంటూ ఏడుస్తూ కుప్పలా కూలబడిపోయిందావిడ నోట మాట రాక చూస్తూ వుండిపోయేరు అవధానిగారు.

ఈ హడావిడికి మెలకువ వచ్చేసిన రజని భయంతో చప్పున లేచికూచుంది. అందరివేపూ భయం భయంగా చూస్తూ వుండిపోయింది. శబ్దమే తప్ప పలుకు లేని ఆ పిల్ల గొంతులోనుంచి బాధాకర మైన అస్పష్టపు ధ్వనులేవో వెలు వడ్డాయి.

చంద్ర చప్పున తలెత్తి ఆ పిల్లవేపు చూసింది. 'ఈ మూగిముండొక ర్తి- శనిలాగ నా బ్రతుక్కి దాపురించింది' కసిగా అనుకుంది. మరు క్షణంలో నిలువునా కంపించిపోయింది. అంత క్రూరంగా ఆ పసిదాని గురించి ఎలా అనుకోగలిగింది! చంద్రకి తనమీద తనకే అసహ్యంగా వుంది

నోరులేని ఆ పిల్లగురించి అంత కఠినంగా, కరుగ్గా, విసుగ్గా ఎలా అనుకో గలిగింది తను? తనలోని ఆదర్శం, ఆలోచన, ఔన్నత్యం, ప్రేమ- అన్నీ ఏ మారుమూలలకి చెదిరిపోయేయి? 'నీకు స్థిరమైన నిర్ణయాలు లేవు. నమ్మిన దాన్ని ఆచరించగలిగే దృఢచిత్తం లేదు. ఆవేశం తప్ప ఆలోచన లేదు. అందో ళన తప్ప అవగాహన లేదు-' అని తన మనసులో ఎవరో కేకలు వేస్తున్నట్టని పించింది చంద్రకి. బాధతో కృంగిపోతూ 'భగవాన్' అనుకుంది చంద్ర.

* * *

రజనిని తను ప్రేమించలేకపోతోంది. ప్రేమతో ఆదరించలేకపోతోంది. మరెం దుకు ఆ పిల్లను తీసుకొచ్చి యింట్లో పెట్టుకున్నట్టు? ఏం ఉద్ధరిద్దామని? ఎన్నో ఆదర్శాలుపలికి, ఎంతో గొప్పగా సూర్యం వద్దని మరీమరీ చెప్తున్నా విన కుండా ట్టుదలగా రజనిని తీసుకొచ్చింది. మొదట్లో ఎ వ రి నీ పట్టించుకోకుండా ధైర్యంగా, తన మనసుకి నచ్చినట్లు- రజనిని ఎంతో అభిమానంగా చూసు కునేది.

కాని. రానురాను తన చుట్టూ సమాజం తనవేపు వేలెత్తి చూపుతూ, హేళనచేస్తూ, తనని దోషిగా నిలబెట్టి, సిలువ వేస్తున్నట్టనిపించి- ఆ సంఘటనల పరంపరకి తట్టుకోలేకపోతోంది తను. తనలోని ఆశయాల గాలిపటాలు వాస్త వాల ముళ్ళ కంచెలకి తగులుకొని శకా? వికలైపోయాయి

పట్టుదల పట్టుతప్పి, ధైర్యం సడలి- అధైర్యం చోటుచేసుకుంటోంది. పరిస్థి తులకి ఎదురాడి పోరాడగలిగే గుండె దిటవు తనకి లేదు గాక లేదు. ఈ నిందల పల్లకి తను మోయలేదు. ఈ వెక్కి రింతల అగ్నిగుండంమీద తను నడవ లేదు. తను మామూలు మనిషి. కోరికలు,




ఆశలు, దుఃఖాలు, సంతోషాలు, స్వప్నాలు, స్వార్థాలు- అన్నీ ముప్పిరి గొంటూ వుంటే ఆకులా అల్లల్లాడిపోయే సామాన్యమయిన వ్యక్తిత్వం తనది.

కేవలం వుద్రేకం, ఏదో చేసేయాలనే తపన. ఏదో సాధించేస్తున్నానన్న అహంకారం. ఎవరిమీదో, దేనికో కసితో- క్రోధంతో ఏదో చేయడం. అంతా అయోమయం. తన మానసికస్థితి తనకే అగమ్యగోచరం. అంధకార బంధురం.

నమ్మిన విశ్వాసాలని దృఢ చిత్తంతో కడదాకా దీక్షతో నిర్వర్తించ గలగే చేవ తనకిలేదు

అది తనకి తెలుసు. తన మనసు అనుక్షణం విలదీసి ఆ విషయాన్నే ఎత్తి చూపుతూ తన గుండె గూడుపట్లను కుదిపి కుదిపి వదిలిపెడుతోంది.

అందుకే సూర్యం అన్నాడు: "చంద్రా నీకు తెలియదు - జీవితాన్ని జీవితంలాగే చూడగలగడం నేర్చుకోవాలి. జీవితం సినిమా సన్నివేశాల లాగానో, నవలల్లో దొర్లే సంఘటనల మాదిరిగానో నడిచేది కాదు. అది కఠిన వాస్తవాల పుట్ట. అందులో ఎన్నో దొంకదార్లు. ముళ్ళ పొదలు-ఏమాత్రం అజాగ్రత్తగా వున్నా వాళ్ళంతా చీరుకుపోతుంది సుమా! నా జీవితంపట్ల యింత దయ, సానుభూతి, కరుణ చూపిస్తున్నావు. నాకది చాలు ... రజనిని చేరదీస్తే నీకెదురయ్యే పరిస్థితులు ఎంత గడ్డుగా వుంటాయో

నీకు తెలియదు. అదెన్ని బాధలను సమస్యల్ని సృష్టించి - నీచుట్టూ ఎంత బీభత్సకరమయిన వాతావరణం ఏర్పరుస్తుందో నువ్వు ఊహించ లేకపోతున్నావు వద్దు చంద్రా-రజనిని తీసుకెళ్ళావని అనకు నాకోసం భగవంతుడు సృష్టించి యిచ్చిన ఆ నరకంలోనే దాన్ని వుండనీ-"

తను దుఃఖంతో మైనంలా కరిగిపోయింది.

ఏం మనిషి యితను! కష్టం, బాధ, చికాకు- ఇన్ని అతన్ని చుట్టుముట్టి- జీవితాన్ని ఛిద్రుపలు ఛిద్రుపలు చేస్తున్నా - ఇంత నిబ్బరంగా, ఇంత ధైర్యంగా-మొండిగా-ఎలా వుండగలుగుతున్నాడు. విషాదసాగరంలో మునిగిపోతూ కూడా ఎలా నిర్వికారంగా మసలుకోగలుగుతున్నాడు! ఏమిటీతని తత్త్వం!

తను ఆవేశంతో అంది: "నా చుట్టూ సమాజం నన్నెన్ని అవహేళనలకి గురి చేసినా నేను బెదిరిపోను సూర్యం-- నా నిర్ణయం మారదు. ప్లీజ్ రజనిని సంరక్షించే అవకాశం నాకివ్వు సూర్యం- నేను నీ కష్టంలో చేయూతనివ్వాలి. అంతే రజని చిన్నారి బ్రతుకు చీకటి గుయ్యారంలా తయారవడానికి వీల్లేదంతే. అహరహమూ దాని బ్రతుకులో చీకటి, నిరాశ, దైన్యం- చోటుచేసుకోడానికి వీల్లేదు. అసలే దానికి నోరివ్వకుండా భగవంతుడు తీరని ద్రోహంచేసాడు.

"కష్టంవస్తే నోరువిప్పి, ఎవరికయినా ఎలా చెప్పుకోగలదు? దాని గోడువెళ్ళని కన్నీళ్ళు తుడిచిపెట్టడానికయినా ఒక స్త్రీహస్తం అవసరం ఉందని గుర్తించలేవా సూర్యం! ఆ స్త్రీమూర్తిని నేనే ఎందుకు కాకూడదు? రజనిని నేను సాకుతాను. ఆ పిల్ల ఆలనా పాలనా చూస్తాను. పెంచి పెద్దదాన్ని చేస్తాను. బ్రతుకులో విషాదంతో ఆ పిల్ల మానసికంగా క్రుంగిపోతూ- బ్రతుకంటే విరక్తిగా, హేయంగా, భరించలేని నరకంగా- బెదిరిపోతూ, బెంగబెంగగా కాలం గడపటాన్ని నేను ఊహించలేను సూర్యం.... నాకీ అవకాశం యివ్వు ఇదే నేను నా జీవితాదర్శంగా పెట్టుకుంటాను-ఎండిపోయిన నా ఎడారి మనసులో మమతల మధురిమలు నింపుకుంటాను సూర్యం అర్థంచేసుకోవూ?" అంది ఉద్వేగంగా.

సూర్యం చిన్నగా నవ్వి చూసేడు.

ఈ మనిషి గుండె ఎంత కఠినమైనది! ఇలాంటి స్థితిలోకూడా ఎలా నవ్వగలుగుతున్నాడో!

'రిస్క్ తీసుకుంటున్నావు '

'ఓడిపోతావు సుమా!' అనే ధోరణిలో అతనలా అనేసరికి తన మనసు చివుక్కుమంది. పట్టుదల మరింత హెచ్చింది.

'రిస్క్ కాదు సూర్యం-ఈ పరిస్థితుల్లో ఇది నాకనీస బాధ్యతగా భావిస్తున్నాను-' అంది గంభీరతని నిలుపుకోడానికి ప్రయత్నిస్తూ.

సూర్యాన్ని ఎలాగో అంగీకరింప జేసింది. రజనిని ఓ వంచీనిండా ఆ పిల్ల బట్టలతోపాటు తీసుకొచ్చి యింట్లో దిగబెట్టాడు. ఆ రోజెంతో గర్వంగా అనిపించింది తనకి. ఏదో సాధించ బోతున్నదనే ఆలోచనలతో మనసు ఉద్రేకంతో సంబరపడిపోయింది.

"రజనిని తీసుకొచ్చేస్తూ వుంటే కాంతంగారు ఏమీ గొడవ పెట్టలేదు కదా?" అడిగింది కుతూహలంగా.

సూర్యం తన సహజ ధోరణిలో తేలికగా నవ్వేస్తూ "పెద్ద తుపాను పెట్టి వెలిసింది యింట్లో. ప్రాణనష్టం ఏదీ జరగలేదనుకో-" అన్నాడు.

అతని మాటలకి తనకి నవ్వొచ్చింది. నవ్వుతూ రజనిని దగ్గరకి తీసుకుంది.

సూర్యం వెళ్ళిపోయేక అంతవరకూ ఆ దృశ్యం ఆసక్తికరంగా చూస్తూ వుండి పోయిన తల్లీ తండ్రీ కొంచెం ముందుకు వచ్చేరు.

"ఎవరమ్మా చంద్రా - అతను?" తండ్రి అడిగేడు

చెప్పింది.

"ఈ పాప. .?" అర్థోక్తిలో ఆపింది అమ్మ.

"ఈ పాప పేరు రజని. ఆయన కూతురు. వారి యింట్లో పరిస్థితులు ఏమీ బాగులేవు. ఆ దుర్భర వాతావరణంలో ఈ పిల్ల జీవితం ఛిన్నాభిన్నమై పోతుందని చెప్పి దీని సంరక్షణభారం నామీద వేసుకున్నాను.. "

"అంటే...?" విత్తరపోతూ అడిగింది అమ్మ.

"అంటే అర్థంకాలేదా అమ్మా? ఇకపై రజని మనింట్లోనే వుంటుంది." అంది డ్రమెటిక్‌గా. తనుతెచ్చే జీతంరాళ్ళమీద బ్రతకాల్సిన అగత్యం వుండడంచేత-తనెంత నాటకీయంగా ప్రవర్తించినా, మాట్లాడినా - ఆ యింట్లో ఎవరికీ ఎదురు చెప్పే ధైర్యం, చేవ లేవని తనకి బాగా తెలుసు.

అమ్మ అచేతనస్థితిని అనుభవిస్తున్నట్టుగా ఉండిపోయింది.

"అదికాదమ్మా..." తండ్రి ఏదో అనబోయేడు.

"నా నిర్ణయానికి తిరుగులేదు నాన్నా- మరేం చెప్పొద్దు- నా సంపాదన నలుగురికి తిండిపెట్టడంలేదూ - అందులోనే మరో ముద్ద- ఈ నోరులేని పసిదానికి చాలదా నాన్నా?"

దెబ్బతిన్న పక్షిలా విలవిలలాడిపోయేడు తండ్రి. తనంత క్రూరంగా ప్రవర్తించగలగడం తనకే రోతగా అనిపించి ఆ తరువాత చాలాసేపు గదిలో రహస్యంగా రోదించింది చంద్ర.

"పాపా .. నీ పేరేమిటమ్మా?" అడుగుతోంది ఉమ, రజనిని.

"ఆ పిల్లకి మాటలురావే. మూగది."

ఆ క్షణంలో-

ఆ గదిలో ప్రాణవాయువు ప్రసరించడం మానలేదు. కేవలం అందువల్ల

మాత్రమే అక్కడా సమయంలో మూడు ప్రాణాలు ఊపిరి నిలుపుకోగలిగాయి...

.... .... ...

ఆఫీసులో కొత్తగా ట్రాన్స్ఫరు మీద వచ్చి జాయినవుతున్న గుమస్తాగా పరిచయమైన వ్యక్తిని చూస్తూనే విభ్రాంత పోయింది చంద్ర.

అతను అతను- సూర్యం!

అంత మంది మధ్య- సూర్యాన్ని పరిచయస్థుడిలా పలకరించాలో, అపరిచిత వ్యక్తిలాగా సంబోధించాలో నిర్ణయించు కోలేక తటపటాయిస్తూ వుండిపోయింది.

'నమస్తే.నా పేరు సూర్యం' నిశ్శబ్దాన్ని భ్రమయ్యలుచేస్తూ అతనే మాట్లాడేడు. ముందు మౌనంగా ప్రత్యభివాదం చేసింది.

ఎన్ని జ్ఞాపకాల వంతెనలు దాటేక - మళ్ళీ ఎన్నాళ్ళకి కనిపించేడు సూర్యం! చంద్ర కళ్ళలో నీళ్ళు నిలిచాయి. ఎవరూ చూడకుండా కళ్ళు వొత్తుకుని- వశం తప్పి, చెదిరిపోతూన్న ఆలోచనల్ని, మనసునీ ఉగ్గబట్టుకోడానికి ప్రయత్నం చేస్తూ ఫైపు మిషనుమీదికి చేతులు పోనిచ్చింది.

తరువాత — సూర్యంతో వంటరిగా మాట్లాడే అవకాశం నాలుగయిదు రోజు లకి కానీ కలగనేలేదు.

ఓ రోజు కాంటీన్లో కాఫీ తాగుతూ ఒక్కడూ కనిపించేడు. నెమ్మదిగా అతని ప్రక్కకి వెళ్ళి కుర్చీలో కూచుంది.

"సూర్యం-ఎలా వున్నావు?"

అదేం ప్రశ్న! నవ్వేసాడు. "మీ ఆవిడ బాగుందా సూర్యం?"

తలూపేడు.

ఓ అరక్షణం నిశ్శబ్దం వేడిగా, వాడిగా తమమధ్య తాండవించింది.

"పిల్లలెందరు?"

"ఒక్క-పాప-పేరు రజని"

ఆ తరువాత ఏం మాట్లాడాలో తోచ లేదు. ఇంటికి రమ్మనయినా పిలవలేదు సూర్యం-చంద్రకి మనసంతా కల్లోలంగా తయారయింది.

సూర్యం విందుకుండలా కనిపిస్తు న్నాడు కళ్ళకి ఆ పెదవులమీద చిరునవ్వు అలాగే వుంటుందెప్పుడూ. ఆ నవ్వే తనని సూర్యానికి దగ్గర చేసింది. కాని- పరిస్థితులు మాత్రం తమని దారుణంగా విడదీసాయి. సూర్యం పెళ్ళి వాళ్ళ మేనమామ కూతురుతో జరిగిపోయింది. సూర్యం తండ్రి చిక్కుకున్న ఆర్థిక విషవలయంలో సూర్యం మేనమామ చేసిన సహాయానికి ప్రతిఫలంగా సూర్యం ఆయన కుమార్తెను చేపట్టక తప్పలేదు.

తను... ?

తన మీద ఆధారపడ్డ చెల్లెల్నీ, తల్లినీ, తండ్రినీ అన్యాయం చేయలేక అవివాహితగా వుండిపోవలసి వచ్చింది. ఇలా ఎన్నాళ్ళు? ఈ త్యాగానికి ఏది పర మార్థం? తన జీవితానికి ఏది గమ్యం? ఎక్కడికీ విరవధిక యాత్రాపథం?

ఒక్కొక్కసారి తనకి ప్రాణం తడతేరి పోయినట్లుగా అయిపోతుంది. మనసు

చించుకున్నట్టుగా గందరగోళంగా తయారవుతుంది.

ఎవరూ తన భవిష్యత్తు గురించీ, వివాహం గురించి, సుఖం గురించీ పట్టించుకోవటం లేదన్న ఆలోచన వచ్చి నిలువునా దహించుకు పోతున్నట్లని పిస్తుంది. అసలా ఆలోచన మనసులకి తరిదాపుగా రానివ్వడానికే భయంతో కంపించిపోతున్నట్లు కనిపిస్తారు.

ఒక్కో ఆవేశపుక్షణంలో - జీవితం మీద విరక్తి పెచ్చుపెరిగిపోయి-అందర్నీ పేరుపేరునా తిట్టిపోయా లనిపిస్తుంది. చుట్టూ వెలుగు ప్రసరింపజేస్తూ తనెం దుకు కొవ్వొత్తిలా హరించుకు పోవాలని పిస్తుంది. ఏడుపొస్తుంది. పిచ్చెత్తినట్టు అరవాలనిపిస్తుంది.

కాని-వారి ప్రవర్తనలో నిబిడీకృత మైన దైన్యం అవసరం గుర్తొచ్చి మన సంతా ఆర్ద్రీభూతమై చలించిపోతుంది.

తన ఆవేదన తనలోనే అణచుకుని తన విషాదం తనకే మిగుల్చుకుని-ఇలా నిస్సారంగా కాలం గడపాల్సిందే.

కాని-జీవితం ఎంత విచిత్రమైనదో!

తనవాడు కాకుండా పోయిన సూర్యం కూడా-సంసార జీవితంలో ఎన్నో ఒడిదుడుకులనీ, కష్టాలనీ - అనుభవిస్తు న్నాడని తెలుసుకుని నివ్వెరపోయింది.

ఆ గంభీరత వెనుక ఎంత దీనత్వం?

ఆ చిరునవ్వు వెనుక ఎంత విషాదం!

ఇంటి పరిస్థితుల గురించి సూర్యం ఎప్పుడూ పెదవి విప్పి ఒక్కమాట కూడా అనలేదు. ఒక్కసారి కూడా తన బాధలు వెళ్లబోసుకోలేదు-

సూర్యం గురించి ఆఫీసులో అంతా తలోరకంగా వ్యాఖ్యానాలు ప్రారంభిం చేరు. ఎవర్నీ ఎప్పుడూ యింటికి పిలవ డనీ-ఎవరయినా ఆ ప్రసక్తి తీసుకొస్తే దాటవేస్తుంటాడనీ - భార్యని నలుగుర్లోకి తీసుకురాని మూర్ఖుడనీ-ఒట్టి అనుమానపు మనిషి అనీ - అతని భార్య బొత్తిగా అనాకారి అనీ - ఆమెని అప్తమానం గొడ్డుని బాదినట్టు బాదుతూ హింసిస్తూ వుంటాడనీ-ఇలా ఎన్నెన్నో-

ఇవన్నీ తెలిసి కూడా సూర్యం పట్టించుకోలేదు. నిర్వికారంగా ఊరు కుండేవాడు.

కనీసం తననయినా యింటికి పిలవ లేదు సూర్యం. తనే కుతూహలం చంపుకోలేక అతని యిల్లు కనుక్కుని, తనంతట తానుగా వెళ్ళింది.

వెళ్ళి ?

అక్కడ పరిస్థితి చూసి విస్తుపో యింది. నిబ్బరంగా, ధైర్యంగా కనిపించే సూర్యం-అంతరంగంలో ఎన్ని వ్యధలకి లోనవుతున్నాడో స్వయంగా చూసి ప్రాన్పడిపోయింది.

సూర్యం భార్య-మతిస్థిమితంలేని మనిషని గ్రహించి చంద్రకి గుండె ఆగినంతపనయింది. ఆవిడకా లక్షణాలు చిన్నప్పటినుంచీ వున్నాయనీ-వివాహం

అయ్యేక మరింత విజృంభించాయనీ తెలిసికొని వణికిపోయింది చంద్ర

అంతేకాదు–

సూర్యం కూతురు రజని–ఆ పిల్ల మూగదని తెలిసాక చంద్రని ఎవరో ఛెళ్ ఛెళ్ మని కొట్టి హింసిస్తున్నట్టుగా వేదన కలిగింది.

ఆపిల్ల తల్లి చేత దెబ్బలు తినని రోజు లేదుట. ఉన్మాదంలో చేతికందిన వస్తువుతో పిల్లని కొడుతుందిట ఆమె. కన్నబిడ్డ అనే గ్రహింపు కూడా లేకుండా ప్రవర్తించే ఆమెతో సూర్యం ఎన్ని ఆరాటాలకి లోనవుతున్నాడో– ఎంత యాతనకు గురవుతున్నాడో తలుచుకుంటే గుండె ద్రవించుకు పోయింది చంద్రకి.

తల్లి అనాదరణతో– ఇంట్లో అను క్షణం నరకంగా మారే ఆ దుర్భర వాతావరణంలో మానసికంగా చితికిపోయి– తిన్నది హితవుకాక– రజని ఎండిన పుల్లలా– కళ్ళలో జీవం నిలుపుకొని కనిపించేసరికి తను మనసు నిగ్రహించుకో లేకపోయింది.

ఆ పిల్ల నెలాగయినా తను రక్షించా లనీ – ఆ పిల్ల బాగోగులు చూసే బాధ్యత తను తీసుకోవాలనీ—ఆ విధంగా సూర్యం మందే గుండెకి ఊరట కలిగించాలనీ అనిపించింది.

ఇదే విషయం సూర్యంతో చర్చించి, సూర్యం చెప్పినా వినకుండా ఎన్నో ఆదర్శభావాలతో – ఎంతో ఉన్నతమయిన ఆలోచనలతో– ధైర్యంగా రజని బాధ్యత స్వీకరించింది.

అంతే...

కాని రజని యింట్లోకి వచ్చిన తరువాత కానీ సూర్యం మాటల్లోని చేదు సత్యాలు, జీవితానుభవం గుర్తింపుకి రాలేదు.

ఉద్వేగంతో, ఒక మంచి పని చేయా లన్న ఆరాటంతో తను చేసినదానికి ఎన్ని ప్రతిఘటనలు ఎదురవుతాయో ఊహించ లేకపోయింది. తీరా ఆ పరిస్థితి ఎదురై ఉక్కిరి బిక్కిరి చేస్తూవుంటే నిలద్రొక్కు కునే గుండెదిటవులేక కంపించిపోతోంది తను.

ఆఫీసులోనూ, బయటాకూడా తమ గురించి రకరకాల వదంతులు బయలు దేరాయి. రజనిని అడ్డంగా పెట్టుకుని పిచ్చి భార్యతో వేగలేకపోతున్న సూర్యాన్ని తనవెంట తిప్పుకుంటోందని అంతా రకరకాలుగా పిచంగా చెప్పుకోవ టం, అనటం ప్రారంభించేరు. సూర్యం కుటుంబ పరిస్థితి ఎంత గోప్యంగా వుంచినా ఆ విషయాలన్నీ కూపీ లాగందే నిద్రపట్టని మనుషులు తలో రాయి విసరటం ప్రారంభించేరు. తమ యింట్లో అమ్మకీ నాన్నకీ కూడా ఆ పిల్లని తను చేరదీయడం సుతరామూ యిష్టంలేదు. తమ అభిప్రాయం వెల్లడించుకోలేని




పిరికితనంతో వాళ్ళు లోలోనే సతమతమైపోతూవుండటం గమనిస్తూనే వుంది

ఆ ములుకుల్లాంటి మాటలు, నిందలు అంతై యింతై తనని చుట్టుముట్టి రోజు రోజుకీ ఊపిరాడనివ్వకుండా చేస్తున్నాయి ఈ పరిస్థితిని ఎదుర్కొనగలిగే సత్తా తనకి లేకపోతోంది.

తన చుట్టూ పరిస్థితులు వికటించి, హేళనలు శ్రుతిమించి-తను మానసికంగా వ్యధకి లోనవుతూ వుంటే - ఒక్కొసారి రజని బాధ్యతను తను స్వీకరించడం పొరపాటేమోనని కూడా అనిపించ సాగింది .

అన్యాయంకాదూ! మరెందుకు రజనిని గొప్పగా తీసుకొచ్చినట్టు? తన చిత్త ప్రవృత్తి తనకే అవగతం కావటం లేదు. తన మనస్థితి తనకే రోతగా వుంది. వెగటు కలిగిస్తోంది.

ఏ సమాజాన్ని ఖాతరుచెయ్యకూడదని గర్వించిందో- ఆ సమాజాన్ని చూసే తనిప్పుడు బెదిరిపోతోంది. గజ గజా వణికిపోతోంది. పిరికిగా దాని నీడ కూడా తనమీద పడటాన్ని భరించలేక పోతోంది.

సూర్యం చెప్పే మాటలు పదే పదే గుర్తొస్తున్నాయి:

'జీవితం మనం చెప్పేలా నడిచేది కాదు చంద్రా- జీవిత వాస్తవాల కఠిన శిలల తాకిడికి తట్టుకోడానికి సతతమూ సిద్ధంగానే వుండాలి. అదే అనుభవం. ఆదర్శం వేరు. ఆచరణ వేరు. రెంటికీ మధ్య అనంతమయిన అగాధం వుంది. ఊహ వేరు- వాస్తవం వేరు. ఏదో అనుకుంటాం. ఏదో సాధిస్తామనీ - సాధించగలమనీ- అందుకు మార్గం సుందరంగా, సూటిగా, సజావుగా

వున్నట్టుగా కనిపిస్తుంది. కాని- ప్రయత్న సాఫల్యంలో తమ యాత్రాపథంలో ఎదురయే కష్టాలు- అటుపోటులు- వీటికి తట్టుకోగలగడం చాలా కష్టం- అందుకెంతో ధైర్యం, పట్టుదల, ఆత్మశక్తి, అవగాహన వుండాలి....'

విజం....

తనలో ఉద్రేకం తప్ప అభినివేశం లేదు. ఆశయం తప్ప — సమ్యగవగాహన లేదు. అందుకే ఓడిపోయింది తను....

ఇంక- రజనిని తను యింట్లో ఒక్క-క్షణం కూడా వుంచుకోలేదు. చంద్ర కళ్ళనుంచి వెచ్చగా కన్నీరు వరదగా ప్రవహిస్తోంది.

కరెంటు వచ్చి, లైటు వెలిగింది. ఫేను మళ్ళీ శబ్దంచేస్తూ తిరగటం ప్రారంభించింది. చంద్ర పమిటతో ముఖం తుడుచుకుంది. అలారం పీసు వేపు చూసింది.

పదవుతోంది. మరో గంటలో జనతా బయల్దేరుతుంది.

సూర్యాన్ని కలియాలి తన అశక్తతనీ, అసమర్థతనీ అంగీకరిస్తూ రజనిని అప్పగించా లతనికి....

సూర్యం భార్యతోపాటు వెళ్ళిపోతున్నాడు. అంతటా నిప్పులు చెరిగినట్లు చెలరేగిన పుకార్లతో — సిగ్గుతో, అవమాన భారంతో క్రుంగిపోతున్న తన ముఖంలోకి చూడలేక - ప్రయత్నం మీద బదిలీచేయించుకుని మరీ వెళ్ళిపోతున్నాడు.

వెళ్ళి, రజనిని అప్పగించాలి. సూర్యం ఏమనుకుంటాడో? తనని చూసి నవ్వుకుంటాడేమో ? ఎన్నో ఆదర్శాలు వల్లించి, డాంబికాలు పలికిన తను - ఇప్పుడిలా అర్థాంతరంగా 'నీ ఖర్మ నువ్వు అనుభవించు'అన్నట్టుగా రజనిని, ఆ నోరులేని పసిపిల్లను- తిరిగి అ పిచ్చి తల్లి బారిని పడేస్తూవుంటే - సూర్యం ఎంత బాధపడతాడో ? తనెంత చులకనగా చూస్తాడో ?

'కాని, తప్పదు -' నీరసంగా అనుకుంది చంద్ర - ఈ పిల్లని యింట్లో వుంచుకుని తను మరింక యీ ఎదురు తిరిగే కలతల సముద్రాలని అధిగమించలేదు. అవమానాలని, దూషణలని, తిరస్కారాలనీ, తట్టుకుని భరించగలిగే దృఢసంకల్పం, ఆత్మస్థైర్యం తనకి లేవు గాక లేవు.

ఒక నిర్ణయానికి వచ్చినదానిలా చప్పున మంచంమీద నుంచి లేచింది చంద్ర. ముఖంమీద నీళ్ళు చల్లుకుంది. రేగిపోయిన జుత్తుని చేత్తో సవరించుకుంది.

రజని బొంతమీద అమాయకంగా నిద్రపోతూంది తల్లిదగ్గర లభించని భద్రతని సంతోషంగా అనుభవిస్తున్నట్టుగా విశ్రాంతగా పడుకునివుంది.

చంద్ర భారంగా నిట్టూర్చింది.

రజనిని లేపింది. ఆ పిల్ల బట్టలన్నీ పంచీలో సర్దింది. రజని అయోమయంగా చూస్తూ వుండిపోయింది

జానకమ్మ వచ్చి ద్వారానికి ఆనుకుని ఆశ్చర్యంగా యిదంతా చూస్తోంది.

"రజనిని సూర్యానికి అప్పగించి వస్తాను." ముక్తసరిగా చెప్పి రజనితో పాటు బయల్దేరింది చంద్ర.

* * *

చంద్ర రజనితో స్టేషనుకి చేరేసరికి రైలు వచ్చి ఆగివుంది సూర్యం భార్య కిటికీ దగ్గర కూచుని ఎటో వెర్రిచూపులు చూస్తోంది. సూర్యం ప్లాట్ ఫారం మీద నిలబడి వున్నాడు.

"సూర్యం... " పిలిచింది చంద్ర.

ఎటో చూస్తున్నవాడల్లా ఆ పిలుపుతో అటు చూసేడు. "చంద్రా - వచ్చేవా !" అన్నాడు, తను రావటం తప్పదని గ్రహించినట్లు. ఆ గొంతులో ఆత్రుత లేదు. ఆశ్చర్యం లేదు. తొట్రుపాటు లేదు.

"ఇదిగో, రజని .. రజని...." ఏం చెప్పాలో తెలీక సగంలో ఆపేసింది చంద్ర ఆమె గుండె సహస్రదా ఛిద్రమైపోతున్న దనిపించింది. మాటలు గొంతు దాటి వెలువడలేదు కళ్ళు ధారాపాతంగా వర్షించసాగాయి

"బాధపడకు చంద్రా - రజని బాధ్యత నువ్వు స్వీకరిస్తానన్నప్పుడు దాని భవిష్యత్తు బాగుండదనుకున్నదని నేమకూడా కొంచెం అశపడ్డమాట నిజం. కాని.... రజని నీకు కూడా భారంగా, ఒక తీరని సమస్యగా అవుతుందని నాకు తెలుసు. ఆ పరిస్థితులకి తట్టుకునే నిబ్బరం నీకుండదనీ - రజనిని తిరిగి అప్పగిస్తావనీ తెలుసు..."

చంద్ర ఆశ్చర్యంగానూ అయోమయంగానూ అతని వేపు చూడసాగింది.

"అందుకే చంద్రా - ఇదిగో మొత్తం మూడు టిక్కెట్లు తీసుకున్నాను. రెండు మాకూ- అరటిక్కెట్టు రజని కోసమూ"

ఆ మాటలు వింటూనే భళ్ళున రోదించసాగింది చంద్ర. "ఛ- ఊరుకో చంద్రా- ఇప్పుడేం జరిగిందనీ-" ఓదార్చడానికి ప్రయత్నించాడు సూర్యం.

"సూర్యం నీ గుండె బ్రద్దలయిపోవటం లేదూ? నీకు దుఃఖం రావటం లేదూ !" వెక్కిళ్ళ మధ్య అడిగింది చంద్ర.

సూర్యం పెదవులమీద ప్రాణవంతమయిన చిరునవ్వు మెరిసి మాయమైంది.

చిమ్మిన ఉబికివస్తున్న కన్నీటి తరంగాల మధ్య సూర్యం రూపం మహోన్నతంగా గోచరించింది చంద్రకి.

'ఈ మనిషికి ఎప్పటికీ అర్థం కాదు' అనుకుంది మనసులో.

అవును -

సూర్యుడికి చీకటేమిటి?



———

# నీలవేణి

పాటిబండ్ల విజయలక్ష్మి



తన కిష్టంలేని పని తనని చేయమంటే తను మాత్రం చేస్తుందా? అలా ఆలోచించుకున్న అనుపమకు తనెంత తప్పుగా ఆలోచిస్తోందో అర్థమైంది.

"సారీ నీలూ! నిన్ను అనవసరంగా బాధపెట్టాను" అంది.

"ఓ.కే. మీ యిద్దరూ కబుర్లు చెప్పుకుంటూండండి. నేనువెళ్ళి అశోక్‌ను వెదకి పట్టుకొస్తాను" అంటూ మధు అశోక్ వెళ్ళినవైపు సాగిపోయాడు.

మరికొంత సేపట్లో అశోక్ వున్న ప్రదేశానికి చేరుకున్నాడు మధు. మధును చూడగానే నవ్వడానికి ప్రయత్నిస్తూ "పదరా, నువ్వు వచ్చేశావేం? అసలే కోతిమూక ఆ పిల్లలు. మేడమ్స్ మనకు వప్పచెప్పి పోయారు. వీళ్ళ దారిన వీళ్ళు తలా ఓ బోటు తీసుకుని వెళ్ళినా వెళ్ళగల సమర్థులు. పద పద" అంటూ ముందుకు నడుస్తున్న అశోక్ చేయి పట్టుకొని మెల్లిగా అడుగు లేస్తూ-

"నాదగ్గిర కూడా ఎందుకురా నటిస్తావు? నీకేం బాధలేదని నువ్వు మామూలుగానే వున్నావని ఎవరినైనా నమ్మించగలవేమో గానీ నన్ను నమ్మించ

లేవు పరేపద, మనఇద్దరి అదృష్టాలూ ఒక్కలాగే వున్నట్లున్నాయి. అందుకే ఒక్కచోట చేరామేమో! కనీసం నువ్వైనా కోరుకున్న అమ్మాయిని పొందగలుగుతున్నావని ఎంతో సంతోషించాను. కానీ, వ్చ్" అంటూ భారంగా అడుగులు వేస్తున్న అశోక్‌తో పాటే మళ్ళీ తాము కూర్చున్న వైపు అడుగులు వేశాడు మధు.

అశోక్ ఏమీ మాట్లాడలేదు. అతనికి ఎవరితోనూ మాట్లాడాలని లేదు. మనసులో ఏదో తెలీని బాధ. కొంచం సేపు జరిగిందంతా ఓ కల అనీ అసలు తనకు వీలూ పరిచయమే కాలేదనీ అనుకుంటున్నాడు. కానీ అది ఒక్క క్షణం కూడా నిలవడం లేదు. మళ్ళీ ఒకొక్క జ్ఞాపకమే మనసును పిండేస్తోంది. తను మధును చూసి అనేవాడు ఒకప్పుడు—

"మోనం చేసిపోయిన రమను గురించి ఆలోచనలతోనే నీ అమూల్యమైన కాలాన్ని ఎందుకురా వేస్ట్ చేస్తావు? ఏదైనా స్పెషలైజ్ చేయి. జీవితంలో యిదో చక్కటి అనుభవమనుకో. ఇలాటి అందమైన అనుభవాలు అందరికీ కలగవురా. అందులో బాధ వుందేమో కానీ ఆ బాధలోని తెలీని తీపికూడా వుంటుంది" అంటూ ఏవేవో తను ఎక్కడెక్కడో విన్న కబుర్లు చెప్పాడు. ప్రేమ గురించి అనుభవం లేకపోయినా, స్నేహితుడిని ఓదార్చాలనే తపనతో, కానీ తనదాకా వస్తే గానీ తెలీదు ఏదైనా! ఆ బాధెలాంటిదో అది మరచిపోవడమెంత అసాధ్యమో యిప్పుడు తెలుస్తోంది తనకు.

అంతా తిరిగి ఢిల్లీవైపు సాగిపోయారు. వాళ్ళందరినీ గెస్ట్‌హవుస్ చేర్చి తెల్లవారి స్టేషన్‌లో కలుస్తానని చెప్పి అనుపమను తీసుకుని బయలుదేరాడు అశోక్. అనుపమ నీలిమ దగ్గర శలవు తీసుకుంది కన్నీటితో. కారెక్కి వెళ్ళిపోతున్న అనుపమను పంపడానికి గేటువరకూ వచ్చిన నీలిమ—

"థాంక్యూ డాక్టర్ అశోక్! నేనుంటాను" అంటూ చేతులు జోడించింది. అటు చూస్తే తనెక్కడ కారు ఆపేస్తానో అనే భయంతో "మెన్షన్ నాట్" అని పళ్ళబిగువున చెప్పేసి కారు స్పీడుగా పోనిచ్చాడు. కళ్ళు మసకలు బారి రోడ్డు సరిగా కనిపించడం లేదు అశోక్‌కు, కన్నీటితో.

అనుపమ కూడా మౌనంగా కూర్చుంది. మామయ్యకు కోపమొస్తుందని ఆగిపోవలసి వస్తోంది గానీ నిజానికి ఈ పరిస్థితుల్లో ఢిల్లీలో బావ బాధ కళ్ళారా చూస్తూ వుండాలని లేదు అనుపమకు.

మర్నాడు మార్నింగ్ రెడీ అయి గెస్ట్‌హవుస్‌కు బయలుదేరిన అశోక్—

"అనూ! కమాన్ క్విక్! గెస్ట్‌హవుస్‌కు వెళ్ళి వాళ్ళను తీసుకెళ్ళి సెండాఫ్ యిచ్చొద్దాంరా!" అన్నాడు

"మళ్ళీ అదెందుకురా? ఆ రిజర్వేషన్

గొ ద వే దో చూసి నువ్వే పంపించి వచ్చేద్దాం" అన్నారు గిరిప్రసాద్‌గారు

"అదేవిటి డాడీ. వాళ్ళ ఫ్రెండ్స్ వెళుతుంటే అనూకు సెండాఫ్ యివ్వడానికి వెళ్ళాలని వుండదూ!" అన్నాడు అనుపమవైపు చూసి చిన్నగా నవ్వుతూ.

"లేదు బావా! నాకు రావాలని లేదు. సెండాఫ్ యివ్వాల్సినంత గొప్ప ఫ్రెండ్స్ నా కెవరూ లేరు. వన్నడిగితే నువ్వు వెళ్ళడం కూడా అనవసరం. కిట్టూను పంపినా చాలు. నీకు తెలిసిన ఫ్రెండ్‌కు కూడ ఓ లెటర్ వ్రాసి" అంటూన్న అనుపమ వైపు విస్తుపోయి చూశాడు అశోక్.

మళ్ళీ స్టేషనుకు వెళితే నీలూని చూసి బాధపడతానని అనూ వుద్దేశ్యమై వుండాలి. నిజం కూడా అదే కానీ .... కానీ.... ఆఖరిసారిగా వెళ్ళబోయే ముందు తన ప్రియబాంధవిని చూడకుండా ఎలా వుండగలడు? ఆమెకు తనేమీ కాక పోవచ్చు కానీ అనుకోకుండానే తన సర్వస్వమూ ఆమెగా మారిపోయింది. ఆమెకు తనను విడచి వెళ్ళడం బాధగా లేక పోవచ్చు. కానీ ఆమె తనను విడిచి వెళ్ళుతున్నదన్న బాధ తనను దహిస్తోంది.

అసలు ఎవరీ నీలిమ? ఎందుకొచ్చింది ఢిల్లీ! ఎందుకు నీలవేణిగా మారి తనను అవినాష్‌గా మార్చింది?

తిరిగి నీలమగా మారిన ఆమె అంత సంగంలో అ వి నా ష్ గా పిలిపించిన అశోక్‌కు ఏమాత్రం చోటు లేదా?

అన్నీ ప్రశ్నలే. సమాధానం దొరకని ప్రశ్నలు!

అనుపమకు సమాధానంగా ఆలోచనల్లో పడిపోయిన అశోక్‌ను చూసి ఆతని బాధను అర్థంచేసుకున్నట్లే.

"వెళ్ళిరా బావా! కుసుమా మేడమ్‌కు మాట యిచ్చావుగా, స్వయంగా నువ్వెళితే సంతోషపడతారు" అంది మళ్ళీ తనే.

షెడ్‌లో నుంచి కారు బయటకు తీస్తున్న అశోక్ దగ్గరకు నిండా రంగు రంగుల గులాబీలున్న ఓ పొట్లం తెచ్చి అందించింది. మౌనంగా అందుకున్నాడు అశోక్.

అనుపమ చెప్పకపోయినా అవి నీలిమ కోసమని తెలుసు. అందుకే కృతజ్ఞతగా అనుపమవైపు చూసి, కారు ముందుకు పోనిచ్చాడు అశోక్.

* * *

అశోక్ మనసు అల్లకల్లోలంగా వుంది. ఏ పనిమీదా ఏకాగ్రత కుదరడం లేదు రెండు మూడుసార్లు యాక్సిడెంట్ చేయబోయి ఎలాగో తప్పుకున్నాడు. డాక్టర్‌గా తన కర్తవ్యాన్ని నిర్వర్తించి నీలిమను బాగుచేయగలిగినా, మనసులో ఏ మూలో తనే అవినాష్, నీలిమే తన నీలవేణి అన్న భావం బలంగా పాతుకు పోయింది అది ఎంతగా మరచిపోదామన్నా సాధ్యం కావడంలేదు నీలిమను క్యూర్ చేయబోయి స్వయంగా తనే ఆ వ్యాధి అంటించుకున్నట్లుంది లేక

పోతే ఏమిటీ? వెర్రి నీలిమ లేనిదే తన జీవితం శూన్యమని ఎందుకనిపించాలి నీలిమెవరు? తనెవరు? మళ్ళీ మొదటి కొచ్చాయి ఆలోచనలు

స్టేషన్ కు చేరుకున్న అశోక్, అక్కడి ఓ ఫ్రెండ్ ద్వారా వాళ్ళ రిజర్వేషన్ ఓకే చేయించి అందరినీ ఒకే కంపార్ట్ మెంట్ లోకి చేర్చాడు. వచ్చిన దగ్గరనుంచీ నీలిమ కోసమే అన్వేషిస్తున్న కళ్ళకు, కిటికీదగ్గర కూర్చుని తదేకంగా తనవైపే చూస్తున్న నీలిమ కనిపించడంతో నెమ్మదిగా నీలిమ దగ్గరగా వెళ్ళాడు. ఏమేమో ఎన్నెన్నో చెప్పాలని మనసులో వుంది. కానీ పెదవి విప్పి ఏ మాటా అనలేక పోతున్నాడు బలంగా అదిమిపట్టినా ఆగని బాధ ముఖంలో ప్రతిఫలిస్తోంది. అశోక్ దగ్గరికి రాగానే కళ్ళు క్రిందికి వాల్చేసిన నీలిమవైపు చూసి చాలా సేపటికి అతి ప్రయత్నం మీద-

"నీలూ!" అంటూ గులాబీల పొట్లం ఆమె చేతిలో వుంచాడు ఆ పిలుపులో అంతులేని వ్యథా, జన్మజన్మల బాంధవ్యం, ఏదో తెలీని వివశత్వం ధ్వనించాయి.

కళ్ళెత్తి చూసిన నీలిమ కళ్ళనుంచి టప్పున రాలిన నీటి చుక్కలు చేతిలోని గులాబీలపై పడ్డాయి.

ఇంతలో పెద్దగా వినిపించిన గార్డ్ విజిల్ తో ఇద్దరూ ఒక్కసారే వులిక్కి పడ్డారు. ఆత్రుతగా మరింక ఎప్పటికీ చూడలేనన్నట్లు చూస్తూ అశోక్ చూపుల కర్థం గ్రహించినట్లే అతి మెల్లగా, "వస్తున్నా అశోక్!" అంటూ, గబగబా ట్రైన్ దిగిపోయింది నీలిమ. అప్పటికే బయలుదేరిన ట్రైన్ లోనుంచి ఆశ్చర్యంగా తొంగిచూస్తున్న ఫ్రెండ్స్ వైపు మేడమ్స్ వైపూ చూసి నవ్వుతూ చెయ్యి వూపిన నీలిమ కళ్ళు, కళ్ళనిండా నీళ్ళతో మసకబారాయి

బండి దూరం కాగానే నెమ్మదిగా అవినాష్ తో కాదు అశోక్ తో కలిసి, అతని అడుగులో అడుగు వేస్తూ ప్లాట్ ఫారం బయటకు అడుగులు వేసింది నీలవేణి, కాదు నీలిమ.

అందాల భవిష్యత్తుకు నాందిగా వెలుగుతున్న అతని కళ్ళలోకి చూస్తూ తృప్తిగా నవ్వింది అతని చేతితో చేయివేసి నడుస్తూ! (సమాప్తం)

## అంకితం

మంచి మనసున్న మమతామూర్తి, మానవతావాది, సాహిత్యలోకానికి సన్నిహితులు, సకల కళలనూ అమితంగా అభిమానించి, ఆదరించే అమృత హృదయులూ, మాకు హితులూ, శ్రేయోభిలాషులూ అయిన శ్రీ రమణయ్య రాజాగారికీ, వారి మనసెరిగి నడుచుకొనే వారి సతీమణి శ్రీమతి రాజలక్ష్మిగారికీ, అనంతమైన అభిమానంతో, అమూల్యమైన ఆశీస్సుల నాశిస్తూ, చంద్రునికో నూలుపోగులా, నా ఈ "నీలవేణి"ని అంకితమిస్తున్నాను.

-పాటిబండ్ల విజయలక్ష్మి

# త్రాగుబోతు - త్రాగుబోతుతనానికి చికిత్స

త్రాగుడు మాన్పించడం, సాంఘికంగాను నైతికంగాను ఆవశ్యకమైన సంస్కరణ. త్రాగుడు మత్తువల్ల కోట్ల కొలది ప్రజలు బాధితులౌతున్నారు వెనుకటికి ఒక కవి వ్రాశాడు. త్రాగుడు కార్చినంత రక్తాన్ని ఏ యుద్ధమూ కార్చలేదు. ఎన్నో శవపేటికలు ఎక్కువ చేసింది. ఎన్నో యిళ్లు అమ్మించింది. ఎంత మందినో దివాళా తీయించింది. ఎంత మంది క్రూరులతోనో మారణాయుధాలు పట్టించింది చాలా మంది పిల్లపాపలను చంపించింది ఎన్నో మంగళసూత్రాల త్రాళ్ళను తెంపించింది. పెళ్ళి ఉంగరాలను వ్రేళ్లనుండి మార్పించింది ఎంతో మంది ముగ్ధల కన్యాత్వాన్ని దోచింది. కళ్ళు గుడ్డివిగాను అవయవాలను వంకరగాను చేసింది. మనిషిలోని లోకజ్ఞానాన్ని మనిషి నుంచి బయటికి విసిరి భ్రష్టుణ్ణి చేసింది ఎన్ని హృదయాలో, ఎన్ని జీవితాలో ముక్కలు ముక్కలుగా చిదిమింది. ఎందరి చేతనో ఆత్మహత్య చేయించింది. ఇంకెందరినో వల్లకాటికి పంపింది ఇంతెందుకు ఈ త్రాగుబోతుతనం ఏ విషమూ పంపలేని విషవాయువుల్ని ప్రపంచ మంతటా పంపించింది.

అయితే మద్యంతో కూడిన పానీయాలు చరిత్ర కందని కాలం నుంచీ ఉన్నాయి అవి అనేక రకాలు వేదకాలానికి ముందూ వేదకాలంలోనూ కూడా సురాపానం ఉంది సోమపానం యజ్ఞాలలోను క్రతువులలోనూ అవసరంగా ఉంది సోమపానం చేస్తే అమరులవుతారని, దేవేంద్రునికి అతి ప్రియమైనదనీ నమ్మకం. మధ్య యుగాలలో తాంత్రిక వాదంలో ఐదు 'మ'కారాలలోను అంటే మత్స్య, మాంస, ముద్ర, మధు, మైధునాలలో 'మధువు' ముఖ్యమైనదే మధువును పాశ్చాత్య దేశాలలో 'ప్రాణజలం' అనేవారు. విస్కీ అంటే గాలిక్ భాషలో ప్రాణజలం అని అర్థం అనేక రకాలయిన యీ మధువులను కొన్నిటిని ద్రాక్షపండ్లు మురగబెట్టి కొన్నిటిని బార్లీ వరిబియ్యం, బెల్లం, చక్కెర పానకం, మొదలైన వాటిని మురగబెట్టి ఆవిరిగా మార్చి బట్టీతో తీస్తారు. కొన్ని ఉట్టి బట్టీ వల్లనే తయారు చేస్తారు నాటు సారాయి యీ విధంగానే తయారు చేస్తారు ప్రతి మధుపానీయంలోనూ 'ఆల్కహాల్' అంటే సారాయి ముఖ్య పదార్థం. ఇది ఎంత ఎక్కువగా ఉంటే అంత నిషా మధువు యిస్తుంది. మామూలుగా మురగబెట్టిన తాటికల్లులో నూటికి ఆరువంతులు

*డాక్టరు చిట్టూరి సత్యనారాయణ*

సారాయి ఉంటుంది. కల్లు మురగబెట్టక ముసుపు దానిని 'నీరా' అంటారు. నీరా పుష్టి పదార్థమే. దానిలోని విటమిను 'బి' చాలా శ్రేష్ఠమైనది. ఇంకా చక్కెర పదార్థాలుంటవి. బ్రాంది. విస్కీ మొద లైన మధుపానీయాలలో నూటికి 60 వంతులు వరకూ ఆల్కహాల్ ఉండ వచ్చును. ఆల్కహాలు మాత్రమే కావల సిన నిషా రుచీ యివ్వదు. దానిలో నిషా యిచ్చేవి రుచినిచ్చేవి చాలా పదార్థాలు కలుపుతారు మధువు అనగా 'వైన్సు' (Wines) అవి తయారుచేసే ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా మొదలైన దేశాలలో వైన్ టేష్టర్సు ఉంటారు. వీరి జీతాలు చాల ఎక్కువ. వాళ్ళు ఎన్ని పానీయాలు చవి చూచినా ఏ పానీయం మంచి రుచి గలదో ఎంత కాలంతకు వస్తుందో రుచి చూచి చెప్పగలరు. అది కొందరికే సాధ్యం.

ఈ త్రాగుడులో ముఖ్య పదార్థమైన ఆల్కహాలు లక్షణాలు ఏమిటి? శరీరం మీద వేస్తే చల్ల చల్లగా ఉండి ఆవిరియై పోతుంది. మన కణాలకు అపకారం చేస్తుంది. నోట్లో వేసుకుంటే నోరు మండుతుంది, పుండు కూడా పడుతుంది. చర్మం క్రింద యింజక్షనుయిస్తే మొదట మండి తరవాత నరాలను స్పర్శలేకుండా చేస్తుంది సూక్ష్మక్రిములను సంహరించ గల శక్తి ఆల్కహాలుకు ఉంది. అయితే అది నూటికి 70 పాళ్ళుండాలి.

మద్యం సేవించిన తరువాత అది శరీరంలోని అన్ని అంగాలకు ప్రాకు తుంది. అన్నిటి మీదా దాని ప్రభావం ఉంటుంది ముఖ్యంగా మెదడు మీద నరాల మీద ఉంటుంది.

త్రాగుబోతుతనం అంటే ఏమిటి? త్రాగుబోతు ఎవరు? ఎప్పుడో ఏదో పార్టీలోనో విందులోనో ఒక గ్రుక్కెడు విస్కీలేక వాంపెయిన్ ఒక గ్రుక్కెడు త్రాగేవారిని త్రాగుబోతు అందామా? కాదు. ఎక్కువగా తప్పత్రాగేవాళ్ళనే త్రాగుబోతు లంటాము ఒక్కొ క్కప్పుడు నిషాకోసం గాని దొంగ సారాయంలోగాని మిథిలేటెడ్ స్పిరిట్ అనే వుడ్ ఆల్కహాలు కల్తీ చేస్తారు. ఈ మద్యం నిషా యివ్వడం మాట ఎలాగున్నా త్రాగితే తప్పనిసరిగా ఒక రోజులోనే కళ్ళు రెండూ గ్రుడ్డివై పోతాయి. మగత శీఘ్రంగా వస్తుంది. మనిషి బ్రదికినా దృష్టి మాత్రం రాదు. ఈ త్రాగుబోతుతనాన్ని మూడు విధా లుగా భాగించవచ్చును.

ఒకటి:- తప్ప త్రాగి స్పృహ తప్పినవాళ్ళు.

రెండు:- బాగా త్రాగటం అలవాటు ఉన్నవాళ్ళు

అయినా కొంచెం ఎక్కువ త్రాగగానే వాళ్ళకు ప్రతివస్తువూ రెండుగా కన పడటం, చిత్రవిచిత్రంగా బయటలేని వస్తువులు ఉన్నట్లు చిత్తభ్రాంతి కల

గటం మనసులోని విషయాలు బయట పెట్టటం సామాన్యంగా జరుగుతూ ఉంటాయి. ఆ సమయంలో ఆ త్రాగుబోతు పదిమంది బలవంతులనైనా కొట్టగలను అనుకుంటాడు కాని తనను సరిగా నిలబెట్టి పట్టుకోవటానికే పదిమంది కావాలి తనకాళ్ల మీద తానే నిలబడలేడు ఈ విధమైన వాళ్లకు ఇలా త్రాగినందువల్ల ప్రాణాపాయం ఉండదుగాని జాగ్రత్తగా మాత్రం చికిత్సచేయాలి

మూడోరకం :- ఈ రకం వాళ్లు కొంచెం త్రాగినప్పటికే దెయ్యంపట్టిన వాళ్లలా ప్రవర్తిస్తారు. ఈ వ్యక్తులు తమకూ, సఘానికీ కూడా చాలా అపాయకరం. అదృష్టవశాత్తూ యీ స్థితిరాగానే యింక త్రాగలేరు అందువలనశరీరంలోని మద్యం జీర్ణంకాగానే మామూలు స్థితికి వస్తారు. మద్యం కొంచెం తీసుకోగానే మనిషికి ఉత్సాహం, సిగ్గు తగ్గటం, ధైర్యంగా మాట్లాడటం వస్తాయి. ఇంకా కొంచెం రక్తంలోకి వెళ్ళేటప్పటికి తల కొంచెం తిరిగినట్లవుతుంది. చాలా సౌఖ్యంగా ఉన్నానని భ్రాంతి, శరీరపు నొప్పులు తగ్గటం, శ్రమతీరటం, చాలా సతోషంగా ఉండటం, ప్రక్కవాళ్లతో ఉల్లాసంగా మాట్లాడగలగటం జరుగుతుంది మరికొంచెం ఎక్కువ సేవించేటప్పటికి సంతోషంగా ఉంటుంది. చేయాలన్న పని చేయటానికి శక్తి ఉన్నట్లుంటుంది కాని చేతులు వణకటం మొదలుపెడతాయి. తన ప్రాముఖ్యం, తన అధికారం ద్విగుణీకృతం అవుతాయి. యీ సమయంలోనే నేను త్రాగలేదు మీరు త్రాగే ననుకున్నారా? కూడదండిలాంటి మాటలు వస్తాయి. ఊహలు జ్ఞాపకాలు ఎక్కువగా వస్తాయి సామాన్యంగా ఈ స్థితి వచ్చేటప్పటికి రక్తంలో 2000 పాళ్ళలో ఒకపాలు ఆల్కహాలు ఉండవచ్చును. రక్తంలోకి ఇంకొంచెం మద్యం చేరేటప్పటికి తన ప్రాముఖ్యం మిన్నందుతుంది. అయితే నిలుచోవడం కష్టం. నిలవబోయి కుర్చీని పడవేస్తాడు నాడి శీఘ్రంగా కొట్టుకొంటుంది. తననుగూర్చి తానే మర్యాద లేకుండా మాట్లాడే స్థితి వస్తుంది. తను లేచిన కుర్చీనికూడా సరిచేసికోలేడు. ఇతరులు సరిచేయవలసి వస్తుంది. తలుపుతాళంలో తాళంచెవి దూర్చలేడు. చొక్కాగుండీలు విప్పలేడు. అరవటం, ఏడవటం, పెద్దగా నవ్వటం మొదలైన పనులుచేస్తాడు. ఈ సమయంలోనే వాంతి చేసుకోవటం జరుగుతుంది. దానివల్ల కడుపులోని మద్యం తగ్గుతుంది. ఉధృతమూ తగ్గుతుంది ఇంకా మద్యం ఎక్కువైతే మగత మొదలౌతుంది. భాష అర్థం ఉండదు. మూత్రం స్పృహలేకుండా పోతుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీవ్రంగా ఉంటాయి. ఒక నిముషం నిద్ర యింకో నిముషం వాంతి వస్తాయి. ఇంకొంచెం మద్యం రక్తంలోకి దిగితే






అంటే వెయ్యి వంతులలోకి మూడు వంతులువస్తే స్పృహ తప్పుతుంది. నొప్పి తెలియదు శరీరం మొద్దుబారు తుంది. అపరేషను చేసినా తెలియదు. ప్రాణాపాయస్థితి వస్తుంది. దేహంలో మద్యం ఎలా జీర్ణమవుతుంది? త్రాగిన పది నిముషాలలోనే మద్యం జీర్ణానికి వస్తుంది. ఒక గ్రాము అల్కహాలు 7 కెలరీసు శక్తినిస్తుంది. క్రొవ్వును శరీరంలో పెంచుకుంది. గ్లూకోజు తప్ప మిగతా అన్ని ఆహార పదార్థాలకంటే అల్కహాలు ముందు శరీరానికి అంది వస్తుంది. మద్యంవల్ల నరాలజబ్బులు, లివర్ జబ్బులు, జీర్ణకోశపు జబ్బులు వస్తాయి కొందరు హృద్రోగానికి కారణమంటారు

తప్పత్రాగిన త్రాగుబోతును రక్షించ డానికి జాగ్రత్త అవసరం. మగత, ఒళ్ళు చల్లబడడం, కళ్ళపాపలు పెద్ద వడడం మొదలైనవి ముఖ్యలక్షణాలు. అల్కహాలు మూత్రంద్వారా 20 వంతులు పోతుంది. ఊపిరిద్వారా మూడువంతులు పోతుంది. కొంత జీర్ణమౌతుంది. ఈ సమయంలో త్రాగుబోతును వేడినిచ్చే దుప్పటికప్పి శరీరం చల్లబడిపోకుండా చూడాలి కడుపులోనికి సన్నటి గొట్టం ఎక్కించి కడుపులోని మద్యం అంతా తీసేయాలి - కడుపును కడిగివేయటం మంచిది. ఈ కడిగేటప్పుడు ఊపిరితిత్తుల లోనికి పోకుండా చూడాలి. కెఫీను మంచిదే యింజక్షనుద్వారా యివ్వడం మంచిది ఎఫిడ్రినులాంటి యింజక్షనులు

యివ్వవలసి రావచ్చును ఊపిరి మంద మైతే కార్బన్‌డయాక్సైడ్ ఆక్సిజను యివ్వాలి. ఇదంతా హాస్పిటలులోనే జరుగవలసినవవి.

మెదడులోనికి నీరు చేరిన అనుమాన మున్న హైపరుటోనిక్ శలైను, గ్లూకోజు రక్తనాళాల ద్వారా ఎక్కించాలి.

ఒక్కొకప్పుడు కృత్రిమ శ్వాసకూడా ఏర్పాటు చేయవలసి వస్తుంది. రోగికి తగిన ఆహారమందేటట్లు చూడాలి. అనేకమంది కాపుసారా త్రాగి గుంపులు గుంపులుగా చావడం మనం వింటు న్నాము. ఈ సారాయంలో మిథిలేటెడ్ స్పిరిటు మైలుతుత్తం, అమ్మోనియా వఠ్ఫేటు మొదలైన ద్రవ్యాలు వేసి ఎక్కువగా నిషా కల్గించటానికి చేస్తారు. కాని యిది ప్రాణాంతక మౌతుంది. పోలీసు దాడిచేసి పట్టుకొన్న ఒక దొంగ సారా కాపుచేసే ద్రవములో తుమ్మచెక్క, కుళ్ళినపండ్లు, పాత బ్యాటరీ సెల్సు, చచ్చిన ఎలుకలు, గొజ్జింకలు, బల్లులు, కోడిరెట్టలు యింకా కుళ్ళిన మాంసము ఉన్నాయి. ఇవన్నీ యీ ద్రవం బాగా మురిగి ఆల్కహాలు ఎక్కువ వచ్చేటం దుకు, నిషా బాగా యిచ్చేటందుకు తగిన సారాయం రావటానికి నట. ఇటువంటి పానీయంవల్ల ఎంతమందికో ఆయువు తగ్గటమే కాక అనేక వ్యాధులు బ్రతికి నన్నాళ్ళు బాధిస్తాయి

ప్రపంచమంతటా ఎక్కువగా వాడుతున్న మత్తు పానీయాల వల్ల వ్యాధులు రావా? వస్తాయి. ఎందుకు రావు? ప్రపంచ ఆరోగ్యసంస్థ త్రాగు బోతు తనం ఒకవ్యాధిగా పరిగణించింది. మనం దీనిని వ్యాధిగా ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా, దీనివల్ల ఆరోగ్యా నికి ప్రమాదం ఉంది అని ఒప్పుకు తీరాలి. ప్రపంచమంతటా త్రాగుడు ఎక్కువైంది. పాశ్చాత్య దేశాలలో విపరీతంగా పెరిగిపోయింది. ఒక ఇంగ్లండులోనే గత 20 సంవత్సరాలలో త్రాగుడు తప్పపనులకు అరెస్టు అయినవారి సంఖ్య లక్షకు మించి పోయింది. ఇంగ్లీషు గవర్నమెంటుకు 1977వ సంవత్సరానికి 200 కోట్ల రూపాయలు త్రాగుడు నేరాలకు ఖర్చైంది.

దీనికి చికిత్స లేదా? ఉన్నది. చికిత్స చేయటానికి త్రాగుబోతును హాస్పిటలులో గాని యిలాంటి వారికి పునరావాసం కల్పించే ప్రత్యేక శాలలో గాని చేర్పిం చాలి. క్రమంగా త్రాగుడు మాన్పించ టానికి ప్రత్యేక సిబ్బంది ఉండాలి. ఈ సిబ్బంది మంచి శిక్షణపొంది ఉండాలి. మందుల సహాయంతో త్రాగుబోతు వరాలకు శాంతినివ్వాలి. జలోదరం వచ్చి నప్పుడు వైద్య సహాయం అత్యవసరం. పొట్ట పెరగటం గమనించగానే త్రాగు బోతు త్రాగుడు మాని వైద్యుని సేవ

పొందాలి. ఇంటిలో కష్టాలు, ఉద్యోగంలో తంటాలు, వ్యాపారంలో చిక్కులు, సహవాస దోషాలు త్రాగుడుకు చాలా కారణాలు. మన స్వంబంధంగా వీటిని సర్దుకోవాలి. లేకపోతే సర్దుబాటుకు ప్రయత్నించాలి.

ఎకుపంక్చరు అనే చైనా వారి విధానం వల్ల చైనాలో యీ రకమైన అలవాటు త్రాగుబోతులకు పూర్తి నివారణ కల్గించటం జరిగింది. మన దేశంలో కూడా యీ విధానాన్ని ఇప్పుడిప్పుడే అమలుపరచ యత్నిస్తున్నారు.

1977లో అమెరికాలో త్రాగుబోతుతనం వల్ల వైద్యంచేయలేకపోయిన డాక్టర్ల సంఖ్య 685. ఇగ్లండులో యీ విధంగా త్రాగుడుకు లోనయి వైద్యం చేయలేని వైద్యులు చికిత్స చేయించుకొని సరిఅయ్యేవరకూ వారి పేర్లు వైద్యుల జాబితానుంచి తీసివేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

త్రాగుబోతుతనం వంశపారంపర్యగా వస్తుంది. గర్భిణీ స్త్రీ త్రాగినట్లయితే గర్భస్థ శిశువుకు ఆ రక్తమే ప్రసరించి పుట్టకముందే శిశువును త్రాగుబోతును చేస్తుంది.

చాలాకాలంగా త్రాగేవాళ్ళకు అనేక రోగాలు వస్తాయి. ముఖ్యంగా బలహీనత. త్రాగకపోతే చేతులు వణుకుతాయి. పిచ్చెక్కినట్లు కొందరు నడుచుకొంటారు. ఒక్కొక్కప్పుడు దెయ్యాలు, భూతాలు తమని తరుముతున్నట్లు ఎదురుగా కనిపిస్తుంటాయి. చాలా నీరసపడిపోతారు. నిద్ర రాదు. నిద్ర రావటానికి ఎంతో ఎక్కువ మద్యం త్రాగాలి. తిండిమీద హితవు పోతుంది. శరీరంలో నీరు తగ్గి మనిషి ఎండటం మొదలుపెడతాడు. లివరు దెబ్బతింటుంది. పొట్టలో నీరు చేరడం మొదలౌతుంది. అతి హీనదశలో ఆ త్రాగుబోతు అంతమౌతాడు.

అమెరికాలో అక్రాన్ అని ఒక అజ్ఞాత సంఘం ఉంది. ఇప్పుడందులో అరవయివేల సభ్యులున్నారు. ఈ సంఘం మహా త్రాగుబోతులకు సైతం త్రాగుడు మానటానికి కావలసిన చికిత్స ఉచితంగా చేయిస్తుంది. త్రాగుబోతుకు త్రాగుడు మానాలి అని ఉండాలి. అలా ఉంటే అతనిని మళ్లా సంఘంలో చేర్పడానికి ఎంతైనా చేయవచ్చు.

ఆల్ ఇండియా రేడియో మద్రాసు
సౌజన్యంతో




బాస్‌తోపాటు కారు దిగి ఆఫీసులోకి ఆయన వెనుకే అడుగులు వేస్తున్నాను.

సాధారణంగా ఆయన తలవంచుకుని విష్‌చేసిన వాళ్ళని గమనించీ గమనించ నట్లుగా చరచరా నడిచి వెళ్ళిపోతాడు. ఎప్పుడో ఒకసారి తలెత్తి తను రాగానే లేచి నిల్చుని విష్‌చేస్తున్న స్టాఫ్‌వంక చూస్తారు. అప్పుడాయన పెదవులపై సన్నగా చిరునవ్వు కదులుతుంది.

ఆయన తలెత్తి చూసినప్పుడు ఎపుడో ఒకసారి కృష్ణ కనిపించక మానదు అని నేను భయపడుతున్నాను. కనిపిస్తే ఏం జరుగుతుందో నాకు తెలుసు.

బాస్‌వి పాపిష్ఠి కళ్ళు.

ఆ చూపుల్లోని విషపు గాలికి కృష్ణ మలినమైపోతుంది.

అలా జరగ్గూడదని కోరుకుంటు న్నాను.

రోజూ బాస్ వెనుకే నడుస్తున్నప్పుడు నా గుండె వేగంగా కొట్టుకుంటుంది ఆ చప్పుడు నా చెవులకు వింతగా విని పిస్తూ వుంటుంది.

బాస్ ఏ.సి. రూమ్‌లోకెళ్ళి తనసీట్లో కూర్చున్నప్పుడు నా ప్రాణం కుదుట పడుతుంది

'హమ్మయ్య. గండం గడిచింది' అనుకుంటాను గట్టిగా గాలి పీల్చి.

కృష్ణ బాస్ కళ్ళపడగూడదని కోరు కోవడానికొక కారణం వుంది.

నేను ఆమెను ప్రేమిస్తున్నాను. పెళ్ళిచేసుకోవాలని కలలు గంటున్నాను.

కాని కృష్ణ ఇంటి పరిస్థితులు అందుకు అనుకూలంగా లేవు తల్లి లేదు. సవతి తల్లి. ఆమెను చూసినప్పుడు నాకు టున్.... టున్.... జ్ఞాపకం వస్తుంది. ఇక ఆమె తండ్రి వేదాంతిలా ఇంటి సంగతే పట్టించుకోడు. కృష్ణ పెళ్ళిడు కొచ్చిందనీ పెళ్ళి చెయ్యాలనే ఆలోచనే లేదు. జీతం డబ్బులు తెచ్చి పెళ్ళాం

హాస్పిట్లో పోస్తారు ఇక ఆవిడ తన పిల్లల్ని చూసుకుంటుంది గాని సవతి కూతురు సంగతి ఆలోచించదు

ఒక రకంగా నేనూ దిక్కులేని వాణ్ణి నాకు ముందూ వెనుకా ఎవరూ లేరు. కృష్ణని ప్రేమించడం..... అదంతా ఒక విచిత్రమైన సంఘటన. అదంతా ఇప్పు డెందుకు లెండి.

ఆమెను పెళ్ళిచేసుకోవాలని ఆమె తండ్రి శంకరయ్యను ఆఫీసు దగ్గర కలుసుకున్నాను ఆయన పి. డబ్ల్యూ. డి. ఆఫీసులో గుమస్తా

నేను చెప్పిందంతా విని "నాదే. ముంది వాళ్ళమ్మ ఇష్టం," అని చేతులు దులుపుకున్నాడు.

శంకరయ్య మాటలు, చేష్టలు విచి త్రంగా తోచాయి.

వేలకు వేలు కట్నాలు పోసి, వియ్యాలవారి గొంతెమ్మ కోర్కెలు తీరుస్తుంటేనే ఆడపిల్ల పెళ్ళి కావడం గగనమైపోతున్న ఈ రోజుల్లో, నగరం లోని పెద్ద కంపెనీలో బాస్‌కి పెర్సనల్‌ సెక్రటరీగా ఉద్యోగం చేస్తున్న హోదాలో పెళ్ళి పిల్లని అడిగితే ఎగిరి గంతేయ్యాల్సింది పోయి 'అంతా వాళ్ళమ్మ ఇష్టం' అంటా డేమిటి ?

ఇటువంటి వాళ్ళ గురించే మా మురళి గాడు 'హెన్‌పెక్‌డ్ హస్బెండ్స్' అనేవాడు

శంకరయ్య అప్రియంగా అటువంటి మనిషే

ఆయన సమాధానం విని నాకు మంటెక్కిపోయింది

ఆ సాయంకాలం పార్కులో కృష్ణని కలుసుకుని "ఇలా లాభం లేదు. రిజిష్టర్ మ్యారేజి చేసుకుందాం. వాళ్ళ తిక్క కుదురుతుంది," అన్నాను.

"అలా చేస్తే మా పిన్ని జీవితాంతం నన్ను తిడుతూనే వుంటుంది. మా పిన్నిని అడగడానికి భయం అయితే ఎవర్నయినా రాయబారం పంపించు. చూద్దాం ఏమం టుందో !" అంది కృష్ణ నవ్వుతూ.

అలాగే సుబ్బారాయుడిని పంపిం చాను.

నేను వాళ్ళింటికి దగ్గర్లోనే ఒక హోటల్లో వెయిట్‌చేస్తూ కూర్చున్నాను.

అరగంట తర్వాత వాడు రొప్పు కుంటూ వచ్చి మూడు గ్లాసుల మంచినీళ్లు ఏకబిగిన త్రాగేసి వీకు ఆ పిల్లతో పెళ్ళి కాదురా," అన్నాడు.

"ఏం ?" అని ప్రశ్నించాను విభ్రాంతి పోతూ.

"వాళ్ళ పిన్ని ఆ పిల్ల పెళ్ళి చేసేట్టు లేదు," అన్నాడు.

"సరిగ్గా చెప్పేడువు !" అని విసు క్కున్నాను.

'ఆయన తెచ్చే జీతం తినడానికే చాలటం లేదు ఇక పెళ్ళి ఎలా చెయ్యను ? ఆడపిల్లంటే మాటలా

నాయనా! కట్నాలు, కానుకలూ పెళ్ళి ఖర్చులు తడిసి మోపెడవుతాయి,' అని మొకలు పెట్టింది.

"మా వాడికి పెళ్ళి చేస్తే చాలు. కట్నాలూ, కానుకలూ.... ఒక్కర్లేదు." అన్నాను.

"పోనీ పెళ్ళి ఖర్చులకు కావాలి గదా! అవి ఎక్కడ్నుంచి తేవాలి? ఇప్పటికే ఆయన జి.పి.యఫ్ ... ఫెస్టివల్ అడ్వాన్సులు, ఇంటికి లోను అంటూ అన్నీ లోన్లూ తీసుకున్నారు." అంది.

"పోనీ పెళ్ళి ఖర్చులు గూడా మా వాడే భరిస్తాడు లెండి...." అన్నానో లేదో ఆమె తాటకిలా ఇంతెత్తున ఎగిరి పడిందిరా! ఏవయ్యోయ్ మర్యాదగా మాట్లాడు.... మేమేమీ అంత గతిలేని వాళ్ళ మనుకున్నారా? ఏదో రోజులు బాగోక మా పరిస్థితి యిలా వుంది గానీ. మా ఆయనకి సెలక్షన్ గ్రేడు వస్తుంది.... దాంతో పదివేలు ఎరియర్స్ వస్తాయి. అప్పుడు చేస్తాం పెళ్ళి. ఈ లోపల మా అమ్మాయికి ఏదొక వుద్యోగం వస్తుంది. దాని డబ్బులు ఒక సంవత్సరం బ్యాంకిలో వేసినా ఇట్టే పెళ్ళి చెయ్యొచ్చు.... అంటూ లౌడ్ స్పీకర్‌లో స్విచ్చిలా తగులుకుంది."

సుబ్బారాయుడి మాటలు విని నాకు నీరసం ముంచుకొచ్చింది.

'అందుకని ఒరేయ్ ఆ కృష్ణతో పెళ్ళి జరుగుతుందని కలలు కనకు వాళ్ళ నాన్నకి సెలక్షన్ గ్రేడ్ ఎప్పుడొస్తుందో, కృష్ణకి వుద్యోగం ఎప్పుడొస్తుందో దేవుడు గూడా చెప్పలేడు,' అని కొట్టూర్చాడు సుబ్బారాయుడు.

నాకు పిచ్చెక్కిపోయేట్లుంది అదంతా వింటూ వుంటే. ఇప్పటికే ప్రేమ ముదిరి పోయి నా బుర్రంతా ఖరాబయింది. పెళ్ళయితే తప్ప వంటిమీద చెయ్యి వెయ్యడానికి గూడా వీల్లేదని కృష్ణ మొకచే షరతు పెట్టింది. అరచేతిలో లడ్డూ పెట్టుకుని తినడానికి నోచుకోలేదు నా బ్రతుకు.

నేను దిగులు పడి చస్తూవుంటే సుబ్బారాయుడే సలహా ఇచ్చాడు మీ కంపెనీలో కృష్ణకు ఏదైనా వుద్యోగం ఇప్పించమని. అప్పుడు పనిచేసింది నా బుర్ర. బాస్‌కి సెక్రటరీనైన నాకు ఎంతో కొంత పలుకుబడి వుంది కంపెనీలో. అందుకే బాస్‌కి తెలియకుండా కృష్ణకి వుద్యోగం వేయించాను.

ఇప్పటికి వారమైంది కృష్ణ కంపెనీలో జేరి. అప్పట్నుంచే నాకు దిగులు మొదలైంది కృష్ణ బాస్‌కళ్ళలో పడుతుందో ఏమోనని.

ఆ రోజు నా భయం నిజమైంది.

బాస్ కళ్ళు కృష్ణమీద పడ్డాయి.

కృష్ణ ఆకుపచ్చ దుస్తుల్లో వనకన్యలా ధగధగలాడి పోతూవుంది. ఆమె కళ్ళు




చుక్కల్లా తళతళా మెరిసిపోతూ వున్నాయి. ఆమె చెక్కిళ్ళలో పారుతున్న రక్తం, ఆమె పెదవుల్లో నాట్యం చేస్తున్న విద్యుత్తు.... ఓష్! అందాలరాణి పోటీలో గెలుపొందిన విజేతలా విల్చేవి వుంది.

బాస్ కళ్ళు ఆమెపై విల్చిపోయాయి.

కృష్ణ అందం బాస్‌ని అడుగు ముందుకు పడకుండా చేసిందని అందరూ లోలోపలే వూహించారు.

తర్వాత బాస్ తేరుకున్నాడు. తలవంచుకుని తన ఏ.సి. రూమ్‌లోకి వెళ్ళిపోయాడు.

నా గుండె గుభేలుమంది.

అనుకున్నంతా అయ్యింది.

బాస్.... ఆ దుర్మార్గుడు .... కృష్ణను వలలో వేసుకోడానికి ప్రయత్నిస్తాడు. లేకపోతే వుద్యోగం పీకించివేస్తానని బెదిరిస్తాడు. నాకు తెలుసు వాడి పద్ధతులన్నీ....వీల్లేదు ... కృష్ణని వాడి కబంధహస్తాల్లో చిక్కుకోనియ్యకూడదు.

నా రక్తం మరిగిపోతోంది, ఇవన్నీ తల్చుకుంటూ వుంటే.

బాస్ సీట్లో కూర్చున్నాడు మగతగా.

ఈ లోకంలో లేనివాడిలా పిచ్చిచూపులు చూస్తున్నాడు.

నేను ఫైలు పట్టుకుని నిల్చున్నాను. ముఖ్యమైన లెటర్స్ అర్జెంటుగా సంతకాలు పెట్టి పంపాలి

కాని ఆయనగారు నా సంగతే గమనించడమే లేదు.

బజ్జర్ నొక్కాడు.

జవాన్ వచ్చాడు. ఆజ్ఞ అన్నట్లు తలవంచి నిల్చున్నాడు

"ఆ .... అమ్మాయిని పిలువు." అన్నాడు

జవానుకి అర్థంకాలేదు 'ఆ అమ్మాయి ఎవరో.' ఎందరో అమ్మాయిలు వున్నారు మా స్టాఫ్‌లో.

"ఎవరు సార్?" ప్రశ్నించాడు జవాన్.

"రాజా!"

"సార్!" అన్నాను వినయంగా.

"ఆ .... అమ్మాయి ఎవరు? అదే ఆకుపచ్చ డ్రెస్‌లో వుంది చూడు. క్రొత్తగా వచ్చిందనుకుంటాను..." అన్నాడు.

"ఆ అమ్మాయా! .... కృష్ణ సార్! కృష్ణ... " గొణుక్కుంటున్నట్లు అన్నాను.

"యస్! కృష్ణని పిలువు " అన్నాడు

తర్వాత నా చేతిలో ఫైలు తీసుకుని గబగబా సంతకాలు పెట్టి ఇచ్చాడు.

అంటే ఇక నువ్వు దయచెయ్యి మహాను భావా అని అర్థమే.

మంటికి కారం పూసుకున్న వాడిలా మండిపోతూ గది బైటకు నడిచి నా సీట్లో కూర్చున్నాను.

నా కళ్ళముందే కృష్ణ బాస్ గదిలోకి వెళ్ళింది.

తలుపులు మూసుకున్నాయి.

తర్వాత జవాను రెండు కూల్‌డ్రింకు సీసాలు ట్రేలో పట్టుకెళ్ళడం చూసి నాకు విషం త్రాగా లనిపించింది.

కృష్ణ బాస్ గదిలో గంటవరకూ వుంది.

'గంటసేపు ఏం మాట్లాడుకుంటారు?'

తెలుసుకోవాలనే తహ తహ .... ఆఫీసు టైమ్ ఎప్పుడవుతుందో! బాస్ క్లబ్బుకి ఎప్పుడు పోతాడో .... కృష్ణని అడగాలి. ఏం మాట్లాడాడో!

"గంటసేపు ఏం మాట్లాడాడు వాడు?" గుర్రుగా అడిగిన నన్ను చూసి కృష్ణ పకపక నవ్వింది.

పార్కులో జనం అంతగా లేరు. ఐదింటికే ఎవరొస్తారు?

"ఎందుకు నవ్వుతావు? ...."

"నవ్వక ఏడవనా? మాట్లాడినవన్నీ ఎలా గుర్తుంటాయి? ఏదో అడిగాడు ఇంటర్వ్యూలా! జాబ్ వచ్చాక అడుగుతున్నాడెందుకు వెధవ ప్రశ్నలు!" నవ్వింది కృష్ణ.

"అన్నీ వెధవ ప్రశ్నలేనా? అంటే పెళ్ళి....?"

"ఛీ...." అని ముఖం చిట్లించింది కృష్ణ.

"వాడుట్టి దుర్మార్గుడు. అన్నీ వెధవ బుద్ధులూను! ఆడది కనిపిస్తే చాలు వెర్రెత్తిపోతాడు. పట్టి రావణాసురు డనుకో! నీకు తెలియదేమో వాడికి పెళ్ళి పెటాకులూ లేవు. ఇలా అర్ధమైన తిరుగుళ్ళు తిరుగుతూ వుంటాడు." బాస్‌మీద అన్నీ చెప్పేశాను.

కృష్ణ పకపకా నవ్వుతోంది నా అసూయ చూసి.

"ఎందుకూ అలా నవ్వుతావు ఎవరైనా వింటారు." చిరుకోపం ప్రదర్శించాను.

"రావణాసురుడికి పెళ్ళయింది. పెళ్ళి కాని రాక్షసుడి పేరు పెట్టు మీ బాస్‌కి." నవ్వింది కృష్ణ.

"వాళ్లే నీ తెలివి." మొట్టికాయ వేశాను.

* * *

నేను భయపడుతున్నట్లే జరుగుతోంది.

బాస్ కృష్ణమీద అమితమైన శ్రద్ధ చూపిస్తున్నాడు.

రెండు నెలలకే ప్రమోషన్ ఇచ్చి కంపెనీలో కీలకమైన స్థానం కల్పించాడు.

"సార్! రెండు నెలలకే మీరు ఆమెకు ప్రమోషన్ ఇవ్వడం అన్యాయం" అన్నాను ఒకరోజు.

బాస్ కళ్ళెర్రజేసి చూశాడు.

నాకు భయం వేసింది ఆ రూపం చూస్తే.

"అది నా ద్దేశ్యం కాదు సార్! స్టాఫ్ అనుకుంటున్నారు." తడబడుతూ అన్నాడు.

"నా ఇష్టం. ఇది నా కంపెనీ. నా ఇష్టప్రకారం ప్రమోషన్ ఇస్తాను. ఎవడు కాదనేది?...." గర్జించినట్లు అన్నాడు.

నేను నోరు మూసుకున్నాను ఆ దెబ్బతో.

"ప్రమోషన్‌కి సర్వీసు కాదు ముఖ్యం. టాలెంట్. టాలెంట్ వున్న వాడికివ్వాలి ప్రమోషన్...."

బాస్ పరోక్షంగా తిట్టాడు నన్నే. మరి నేనేగదా ఆయన్ని విమర్శించింది.

బాస్‌కి తాగుడు ఎక్కువైంది. ఎందుకో నాకు అర్థంకావడం లేదు.

కొన్నాళ్టికి అర్థమైంది. కృష్ణ ఆయని దారికి రావడం లేదు. ప్రమోషన్ ఇచ్చినా లొంగలేదు. అందుకే ఆయన గారికి దిగులు.

నాకు చాలా సంతోషం వేసింది. గర్వం కలిగింది. డబ్బుకు హోదాకు లొంగని ప్రేమమయి కృష్ణ నాదైనందుకు నా జీవితానికి ఈ తృప్తి చాలు హాయిగా కాలం వెళ్ళబుచ్చడానికి.

ఒకరోజు పిడుగులాంటి వార్త విన్నాను.

బాస్ నన్ను పిలిచి కృష్ణను వుద్యోగం నుంచి తొలగించమని చెప్పాడు.

నేను ఆశ్చర్యపోయాను. ఇదేమిటి అనుకోకుండా ఇలా జరిగిందని మధన పడ్డాను. కృష్ణ ఇంకా కొన్నాళ్ళు వుద్యోగం చేస్తే బాగుంటుంది. పెళ్ళికి ఏ ఆటంకమూ లేకుండా జరిగి పోయేది. పెళ్ళి ఖర్చులకు సరిపోయే డబ్బు కృష్ణ సంపాదించుకోగలిగేది. ఆమె పెళ్ళి అడ్డుపెట్టేది కాదు మా పెళ్ళికి ఇప్పుడెలా?

నేను బాస్‌కి నచ్చజెప్పాలని అనుకున్నాను. కాని ఆయన నా ముఖం చూడ్డమే లేదు. ఉదోలా వున్నాడు. కళాకాంతులూ లేవు. ఏం జరిగిందో మరి?

నాకు ఏం చెప్పడానికీ గొంతు పెగల్లేదు. గంగిరెద్దులా తలవూపి బైట పడ్డాను.

కృష్ణను విజిటర్స్ రూమ్‌లోకి తీసుకెళ్ళి సంగతి చెప్పాను.

"నాకు తెలుసు ఇలా జరుగుతుందని...." అంది కృష్ణ.

నేను నిర్వేదపోయాను. అయితే ఏదో జరగకూడనిది జరిగిందన్న మాట.

"ఏం జరిగింది?" ప్రశ్నించాను.

కృష్ణకు ఏడుపు వచ్చింది.

"నా రెండు బుగ్గలూ పట్టుకున్నాడు. నన్ను కౌగిలించుకోబోయాడు రాస్కెల్. తాగి వున్నాడు డర్టీ రోగ్. నేను కోపంతో లాగి చెంప మీద కొట్టి వచ్చేశాను.. ఓల్డ్ ఫూల్...." ఏడుపు, కోపం ఆమెను వూపివేస్తున్నాయి.

బాస్ అంతపని చేశాడా?

నా నెత్తురు మరిగింది. ముసలి ముండాకొడుకు. నేను ప్రేమించిన కృష్ణ మీద వాడు చేతులు వేస్తాడా? వాడి చేతులు నరుకుతాను. వాడి గుండెలు చీలుస్తాను. వాడి గొంతు పిసుకుతాను.

ఆవేశంతో నా చేతులు బిగుసుకు పోయాయి. కోపంతో ఎర్రబడ్డ నా ముఖం చూసి కృష్ణ రెండు చేతులూ పట్టుకొని "రాజా! ప్లీజ్! కోపం తెచ్చుకోకు. ఎలా జరగవలసి వుంటే అలా జరుగుతుంది. బాస్ మీద ఏ అఘాయిత్యమూ చెయ్యకు. కొండను పొట్టేలు ఢీకొనలేదు." అంది.

బాస్ బలాన్ని, నా అసమర్థతనీ, అసహాయత్వాన్నీ గుర్తుచేసింది కృష్ణ.

"కృష్ణా!" అన్నాను వుద్వేగంతో.

"బాధపడకు రాజా! మనల్ని ఎవరూ వేరుచెయ్యలేరు. నీ కోపం నేను ఏమైనా చేస్తాను." నా కోపం తగ్గించడానికే అనుకుంటా కృష్ణ అలా అంది.

"సరే...." అని నేను వెళ్ళిపోయాను కృష్ణను వుద్యోగం నుంచి తొలగించే ఆర్డర్స్ తయారుచేయించడానికి.

* * *

కొన్ని రోజుల తర్వాత బాస్ ఒక రోజు బాగా తాగుతున్నాడు. నాకు




భయం వేసింది ఆ త్రాగుడు చూసి. సీసాలు సీసాలు త్రాగుతుంటే అది పొట్టా, చెరువా? అనిపించింది. డబ్బున్నవాళ్ళు ఇలా సీసాలకి సీసాలు త్రాగి ఏం ఆనందిస్తారో పాడు ఆనందం అనుకున్నాను. త్రాగితే ఏం ఆనందం వుంటుంది శవంలా పడి నిద్రపోవడం తప్ప!

"రాజా!" అన్నాడు బాస్.

"సార్!" అన్నాను.

బాస్ ముఖంచూస్తే నాకు అదోలా అనిపించింది. ఇంత డబ్బుండి, వయసు బడి వుండీ పెళ్ళిపెటాకులూ లేకుండా ఇలా బారుల్లో, త్రాగి త్రాగి బజారు ఆడవాళ్ళతో తిరిగి తిరిగి.... ఛీ.... ఏం బ్రతుకు?

"నువ్వొక సహాయం చెయ్యాలి నాకు," అన్నాడు.

నేను నివ్వెరపోయాను బాస్ మాటలు విని. నేను బాస్‌కి సహాయం చెయ్యడమా? డబ్బున్నవాడికి నేనేం సహాయం చేయగలను?

"నేనా....? నేను మీకు సహాయం చెయ్యాలా? అదేమిటి సార్! నేను మీ సెక్రటరీని. మీరు ఆజ్ఞాపించినట్లు చెయ్యడం నా డ్యూటీ. చెప్పండి సార్! నన్నేం చెయ్యమంటారో?" అన్నాను.

బాస్ నవ్వాడు.

"అది ఆఫీసు పని కాదు రాజా!"

నా గుండెల్లో రాయిపడింది.

'కొంపదీసి వీడు కృష్ణవి తీసుకొచ్చి అప్పచెప్పమనడు గదా!'

నాకు పిచ్చెక్కిపోతోంది. గుండె వెయ్యిమైళ్ళ స్పీడులో కొట్టుకుంటోంది. నెత్తురు మరుగుతోంది.

"నాకు భార్యా పిల్లలు లేరు. నీకు తెలుసు గదా?" అన్నాడు.

కోపంతో నాకు మాటలు రావడం లేదు.

తల వూపాను తెలుసునన్నట్లు.

"నా ఆరోగ్యం దెబ్బతింటోంది రోజు రోజుకూ!"

'మరి గొంతుదాకా తాగుతూవుంటే ఆరోగ్యం దెబ్బతినక తిన్నగా ఎలా వుంటుంది?' కసిగా అనుకున్నాను.

నా ఆస్థికి వారసుడు కావాలి ఇప్పుడు. నేను పోతే పిచ్చికుక్కల్లా కొట్టు కుంటారు నా బంధువులు."

నేను అర్థంకానట్లు వింటున్నాను. బాస్ ఇదంతా ఎందుకు చెప్తున్నాడు నాకు? ఈ వేదాంతం ఎవడికి కావాలిప్పుడు?

"నీకు తల్లిదండ్రులు లేరుగదా!"

తల వూపాను లేరన్నట్లు. నాకు గత మంతా గుర్తొచ్చింది. బాస్ నేను అనాథ శరణాలయంలో వున్నప్పుడు చాలా సహాయం చేశాడు. చదివించాడు తన డబ్బుతోనే. తెలివిగలవాడనని తన కంపెనీలో వుద్యోగం యిచ్చి తనకు సెక్రటరీగా చేసుకున్నాడు. బాస్ దేవుడు లాంటివాడు తనకి.

"రాజా! నువ్వు నా కొడుకులాంటి వాడివి నిన్ను నేను దత్తత చేసుకుందా మనుకుంటున్నాను."

నేను ఆశ్చర్యంలో మునిగిపోయాను. నా చెవులను నేనే నమ్మలేదు-నిజమేనా ఆయన అంటున్నది నన్ను దత్తత చేసుకుంటాడా? ఇంత ఆస్థిని.... ఈ కంపెనీని బంగళాలనీ, తోటల్నీ నాపరం చేస్తాడా!

ఆనందంతో నా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. సంతోషంతో చచ్చిపోతానేమోననిపించింది.

బాస్ దేముడు నా దేముడు. ఆయన కాళ్ళకి మ్రొక్కాలి నేను.

"అయితే నువ్వు కృష్ణను పెళ్ళి చేసుకోవాలి," అన్నాడు బాస్

అంతే. నేను రాతిలా స్థంభించి పోయాను కాసేపు.

నాకు అర్థమైంది బాస్ ఆలోచన.

'ఓరి దుర్మార్గుడా!' అనుకున్నాను.

కృష్ణ తనకు లొంగలేదనే కోపంతో బాస్ పెద్ద నాటకం ఆడుతున్నాడు.

తనని దత్తు చేసుకుని ఇంటి కోడల్ని చేసుకుంటాడు. ఆ తర్వాత నన్ను ఏ లారీతోనో పైలోకానికి పంపేస్తాడు. కృష్ణని వెధవముండని చేసి ఇంటి కోడలు కాబట్టి ఎక్కడికి పోనివ్వకుండా తన కోరిక తీర్చుకుంటూ.... ....

"నో.... నో...." గట్టిగా అరిచాను.

బాస్ అదిరిపోయాడు నా కేకలు విని.

"ఏం...? ఎందుకని! నీకు ఇష్టం లేదా?" అన్నాడు.

"పెళ్ళాన్ని బాస్‌కి అప్పుడప్పుడానికి ఎవరు ఇష్టపడతారు?" అన్నాను.

బాస్ విస్మైరపోయాడు. అతని ముఖం పాలిపోయింది.

"ఏమిటి నువ్వనేది?" అన్నాడు.

నేను నాకసి అంతా వెళ్ళగ్రక్కాను.

"నువ్వు దుర్మార్గుడివి - కృష్ణ నీకు లొంగలేదనే కోపంతో నాటకం ఆడుతున్నావు. నాకు తెలుసు నీ దురాలోచన. నీ ఆటలు సాగనివ్వను.... కృష్ణ నీకు దక్కదు...."

బాస్ అలెప్షన్ ఉక్కులా లేచాడు సోఫాలోనుంచి. ఎగిరి నామీద పడ్డాడు. నా చెంపలు వాయించాడు నామూతి పగులగొట్టాడు. నా జుట్టు పట్టుకుని ఈడ్చి ఈడ్చి తన్నాడు.

బాస్‌కి అంత బలం వుందని నేను ఏనాడూ వూహించలేదు. నన్ను చితక బాదుతుంటే తప్పించుకోలేకపోయాను.

ఆఖరికి నన్ను బంతిలా విసిరేశాడు. నేను తోటకూర కాడలా వడిలిపోయి ఒక సోఫాలో కూలబడిపోయాను.

"ఒరేయ్ డర్టీ రాస్కెల్! నిజం చెప్తున్నా వినరా. కృష్ణ నా కూతురు. నా రక్తంరా .... నా రక్తం పంచుకు పుట్టిన కూతుర్రా ....! నా స్వంత కూతుర్రా....!" బాస్ ముఖంమీద చేతులు పెట్టుకుని ఏడుస్తున్నాడు.

ఆశ్చర్యంతో నా మనసు మొద్దుబారిపోయింది. బాస్ వంక నివ్వెరపోతూ చూశాను.

"అప్పుడా! రాజా! నేను ఇరవై ఏళ్ళ క్రితం ఒక దిక్కుమాలినవాడిని. దిగ్గీ తప్ప ఏమీ లేదు నా చేతిలో. సుశీల నేనూ ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. సుశీల గర్భవతి అయింది. కాని వాళ్ళ నాన్న కుల భేదాన్ని ఒప్పుకోలేదు. నేను ఒక ఇంటర్వ్యూకి వెళ్ళివచ్చేసరికి సుశీలకు బలవంతంగా పెళ్ళిచేసి పంపేశారు. ఆ తర్వాత నాకు జీవితంమీద విరక్తి పుట్టి చచ్చిపోవాలనిపించింది. స్త్రీజాతిమీద అసహ్యం వేసింది. సుశీల నాతో గర్భవతిఅయి ఎవడినో ఎలా పెళ్ళిచేసుకుంది? అది నాకు అవమానంగా తోచింది. పిచ్చెక్కినట్లయింది. కొన్నాళ్ళు మెంటల్ హాస్పిటల్లో వున్నాను. తర్వాత బైటకి వచ్చాను. డబ్బు సంపాదించాను. పెళ్ళి చేసుకోదల్చుకోలేదు. సుశీల ఎక్కడ వుందో గూడా నాకు తెలియలేదు. నేను తెల్సుకోదల్చుకోలేదు. తర్వాత ఒకరోజు మన కంపెనీ స్టాఫ్‌లో నిల్చుని కనిపించింది సుశీల. నాకు కడుపులో ప్రేగు కదిలింది. వివరాలన్నీ అడిగాను. కృష్ణని కని సుశీల చనిపోయిందని తెలిసింది. కృష్ణ నా కూతురు .... సంతోషంతో ఒకరోజు కౌగలించుకోబోయాను. కృష్ణ అపార్థం చేసుకుంది. కృష్ణకు నా ఆస్థి మొత్తం ఇవ్వాలనిపించింది. కాని ఎలా? ఇప్పుడామె సంఘంలో శంకరయ్య కూతురుగా చలామణీ అవుతుంది. అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాను. నాకు తెలుసు మీరిద్దరూ ప్రేమించుకున్నారని...."

బాస్ వంక చూస్తూ నెమ్మదిగా లేచి వెళ్ళి ఆయన పాదాలు పట్టుకుని "బాస్ నన్ను క్షమించండి...." అని గొణిగాను.

# మెరుపులూ-మరకలూ!

పెళ్ళికి ముందు అబ్బాయిలు అమ్మాయిల్లాగా, అమ్మాయిలు అబ్బాయిల్లాగా ప్రవర్తిస్తారు.

•

భాషాశాస్త్రజ్ఞుడు: అందరి ఉచ్చారణలను అధ్యయనంచేసి, తనభార్య నాలుకను అదుపులో పెట్టలేని వ్యక్తి.

•

నా కారుని చూసి ఓ మెకానిక్ ఇట్లా అన్నాడు. నేనైతే కారులోవున్న ఆయిల్‌ను తీసుకొని, మిగతా కారును క్రిష్ణా కెనాల్‌లో తోసేస్తాను."

•

తిరిగి సమయంగల స్త్రీలు సర్వసాధారణంగా ఆ తిరిగి సమయాన్ని తమ మొహాల్లో స్పష్టంగా చూపుతారు.

•

స్త్రీ జీవితంలో మూడు రకాలైన వయస్సులుంటాయి 20 సంవత్సరాల వయస్సులో - అవధానచిత్తురాలై వుంటుంది; 35 సంవత్సరాల వయస్సులో - ఆకర్షణీయంగా ఉంటుంది; 45 సంవత్సరాల వయస్సులో - ఎవరికో ఒకరికి అంటుకుపోయి వుంటుంది.

•

ప్రజాస్వామ్యంలో బస్సువెనక ఎవ్వరూ పరుగెత్తరు.

•

ఇద్దరు భార్యలుండటం వల్ల పరోక్షంగా శిక్ష - ఇద్దరు అత్తలు.

---

కల్యాణ కృష్ణ

---

ఆ గేటులోంచి మేడకు వెళ్ళేదారికి రెండుప్రక్కలా, దారికి చలువ పందిళ్ళు తప్పినట్టు యెదిగిన కొబ్బరి మొక్కలు. ఒక పక్క ధాన్యపుగాదె, మరోపక్క పశువుల శాల. ఆ మేడను ఆ వూరి జనం, చుట్టుప్రక్కల గ్రామాల జనం "దివాణం" అంటారు. ఇప్పుడా యింట్లో వుంటున్నది కృష్ణమరాయడు, అతని తల్లి పార్వతమ్మ.

ఆ యింటికిప్పుడు దివాన్‌జీ లేడు కానీ యింటిపనులు, వ్యవసాయం పనులూ చూడటానికి నలుగురైదుగురు పనివాళ్ళున్నారు. ఆ పని వాళ్ళందరికీ పెద్ద కొండయ్య.

కృష్ణమరాయడు తన గదిలో అద్దం ముందు నిలబడి తల దువ్వుతున్నాడు. గదినుంచి బయటకు వచ్చి తన తల్లి పార్వతమ్మ గదికి వెళ్ళి, "నేను అలయానికి వెళ్ళొస్తానమ్మా" అన్నాడు.

"మంచిదిబాబూ! అన్ని యేర్పాట్లూ జరిగినట్లేనా? చుట్టుపక్కల గ్రామాల నుంచి చాలామంది జనం వస్తారు. ఎవరికి యేలోటు జరిగినా మాటబాగోదు", అంది పార్వతమ్మ.

"ఎవరికీ యేలోటూ జరక్కుండా చూడాలనేదేనమ్మా ప్రయత్నం. మన కొండయ్య, పూజారి పూర్ణయ్యగారు అన్నారు రోజుకట్టి ట్రైని పత్ని అందులోనే వున్నారు. వెంకట పెట్టి సంతర్పణకు కావలసిన యేర్పాట్లు స్వయంగా చూసుకొంటున్నాడు కావల సిన సామాగ్రినంతా సత్రంలో నిలవ చేశాడు".

"ఏదో బాబూ, తలపెట్టిన కార్యం సవ్యంగా గట్టెక్కితే అదే పదివేలు."

"తలపెట్టిన కార్యం కాదమ్మా, తల మీదకొచ్చిన కార్యం."

"అదేం మాట బాబూ! దైవకార్యం నీకు బరువనిపించిందా?" అంది పార్వతమ్మ కొత్త నొచ్చుకున్నట్లుగా.

"నా వుద్దేశ్యం అది కాదమ్మా! వేణు గోపాలస్వామి మన వంశానికి యిష్ట దైవం. స్వామికార్యం నా కెప్పుడూ బరువుకాదు. తలమీద కొచ్చిన కార్యం అని యెందుకన్నానంటే స్వామి విగ్రహం యెందుకనో ఒక పక్కకు పంగడం చేత, మెడదగ్గర బీటవారడం చేతా పునఃప్రతిష్ఠ అవసరం అయింది అనుకోకుండా జరిగింది కదా అని అలా అన్నాను."

"అంతా దైవనిర్ణయం బాబూ! ఆ స్వామి లీలలు మనబోటి సామాన్యులకు అర్థంకావు ఎప్పుడు యెందుకు యేది చేస్తాడో ఆయనకే తెలుసు!" అంది పార్వతమ్మ.

"సరేనమ్మా! నేను అలయానికి వెళ్ళి, యేర్పాట్లు యెంతవరకూ జరిగాయో చూడాలి" అని కృష్ణమరాయడు దివాణం నుంచి అలయానికి బయలుదేరాడు.

కృష్ణమరాయడు రాజవీధివ నడిచి

వెడుతూంటే రాజే నడుస్తూన్నట్లుంటుంది. ఆడ, మగ నిలబడి చూస్తారు. ఆరడుగుల యెత్తు, పసినిమ్మపండు చాయ. ఉంగరాల జుత్తు, నిరంతరం పెదవులపై చిరునవ్వు, గ్రీకు శిల్పంలాంటి చక్కని శరీర సౌష్టవం - ఒక్కమాటలో చెప్పాలంటే కృష్ణమరాయడు నిజంగా రాయడే.

## 2

ఆలయ ప్రాంగణం చాలా హడా విడిగా వుంది. కొండయ్య అజమాయిషీలో పాతికమంది పనివాళ్ళు పందిళ్ళు వేస్తున్నారు. కొంతమంది చెరువు పెనాలలో నీళ్ళు నింపుతున్నారు. కొందరు గాడి పొయ్యిలు తవ్వుతున్నారు. మరికొందరు గాడిపొయ్యల దగ్గర గాబులు, గుండెగలు, ఇతర వంటపాత్ర సామాను జేరవేస్తున్నారు. కొంతమంది కట్టెల మోపులను మోసుకొచ్చి గాడిపొయ్యల దగ్గర లాటు కడుతున్నారు.

ఆ మరుచటిరోజు ఏకాదశి. ఏకాదశి రోజునే స్వామివారి విగ్రహ పునః ప్రతిష్ట

అప్పటికే చుట్టుప్రక్కల గ్రామాల నుంచి కొందరు భక్తులు, యెంతో వైభవంగా జరగబోయే విగ్రహ పునః ప్రతిష్టను కళ్ళారా చూసి తరించాలని వచ్చేశారు. వచ్చినవారు ఆలయంలో యేం జరుగుతుందో చూడాలన్న కుతూహలంతో ఆలయ ప్రాంగణంలో తిరుగుతున్నారు.

అలా వచ్చిన యాత్రికులలో ఒక వృద్ధుడు తన మనవడికి ఆ ఆలయం గురించి వివరిస్తున్నాడు. ఇంతలో కృష్ణమరాయడు వచ్చాడు. పనిచేస్తున్న కొండయ్య, పనివాళ్ళు కృష్ణమరాయడు రాగానే దండాలు పెట్టి నిలబడిపోయారు.

"ఏం కొండయ్యా! అన్ని పనులూ సవ్యంగా సాగుతున్నాయా?" అన్నాడు కృష్ణమరాయడు.

"రాత్రి పన్నెండు గంటలకి అంతా సిద్ధమే బాబూ!" అన్నాడు కొండయ్య వినయంగా.

"అన్నట్టు మరిచిపోయాను. పసి పిల్లలకు పాలు కొరత రాకూడదు. చుట్టు పక్కల గ్రామాల నుంచి చాలా మంది యాత్రికులు పిల్లాజెల్లాతో వస్తారు. రెండుమూడు చోట్ల అడిగినవారికి లేదనకుండా పాలువచ్చే యేర్పాటు చూడు."

"అలాగే బాబూ! అమ్మగారు ఈ విషయం ముందే చెప్పారు."

"ఎంతమంది వచ్చినా వడ్డన చురుగ్గా సాగాలి. ఏ పదార్థం తక్కువ పడకూడదు."

"మనకి కొత్తేముంది బాబూ? స్వామి కళ్యాణానికి, కృష్ణాష్టమికి యేటా మనం యిదంతా చేస్తున్నదే కదా! కాకపోతే మధ్యలో పునఃప్రతిష్ట కాబట్టి మరోసారి చేస్తున్నాం," అన్నాడు నవ్వుతూ కొండయ్య.

"సరే, నేను కోనేటి తీరానికి వెళ్లొస్తాను. పానంచాలు నాదు పడితే

స్నానాలు చేసేవారికి ప్రమాదం," అంటూ ఆలయానికి తూర్పున ఉన్న కోనేటికి బయలుదేరాడు కృష్ణమరాయడు.

ఇదంతా చూస్తూ నిలబడిపోయిన తాతా మనవళ్ళు కృష్ణమరాయడు వెళ్ళిన వైపే నడుస్తున్నారు.

"తాతా! ఆ కొండయ్య అనే అతను నీ వయసువాడు కదా! ఈ వచ్చినాయన చిన్నవాడు కదా, యెందుకు వంగి వంగి నమస్కారాలు చేస్తున్నాడు ఆ కొండయ్య?" అని అడిగాడు మనవడు.

"ఆయనే కృష్ణమరాయడు. వయసులో చిన్నవాడు కానీ, యీ వూరికి పెద్ద, యీ ఆలయానికి ధర్మకర్తా, పైగా యీ వూరు మునసబు కూడా. వారి ముత్తాతగారే యీ ఆలయాన్ని కట్టించారట. ఈయన తాతగారు ఆ పెద్ద చెరువు తవ్వించారట. ఒకప్పుడు పెద్ద జమీందారు. మాధవగిరి అని యీ వూరికి పేరు రావడానికి కూడా యీ వూరును వీరి పూర్వీకులలో ఒకరు మాధవరాయలుంగారు యీ వూరికి శంకుస్థాపన చేశారట."

"అంత గొప్పవాడా యీయన?"

"అంతే కాదు. బి.యే దాకా చదువుకున్నారు. అటు ఆంగ్ల సాహిత్యంలోనూ, ఇటు తెలుగు సాహిత్యంలోనూ కూడా పాండిత్యం గలవాడట. పండితులని, కవులని యెంతో గౌరవిస్తారట. మంచి రసజ్ఞులట. అన్నిటికీ మించి దాతలట. ఊరునీ, వూరు ప్రజలనీ కంటికి రెప్పలా చూసుకుంటారట. వయసు పాతికేళ్ళే కావచ్చు కానీ మనసు చాలా పెద్దదట బాబూ!" అన్నాడు తాత మనవడితో.

## 3

పూజారి పూర్ణయ్య స్వామికి సంధ్యార్చన పూర్తిచేసి, హారతిచ్చి, గంట కొట్టారు. ఆ సమయానికి ఆలయంలో చేరిన భక్తులకు తీర్థప్రసాదాలిచ్చి, పైమీద అంగవస్త్రంతో చేతులు వత్తుకున్నారు. ఆలయానికి పడమటన వున్న స్వామివారికి ఉద్యానవనంవైపు వెళ్ళారు. ఉద్యానవనంలోకి ఆయన అడుగు పెట్టేసరికి టన్ టన్ మని శావింమీద వడుతున్న సుత్తిదెబ్బ వినబడుతోంది.

విష్ణుశర్మ విగ్రహం పై భాగానికి పట్టు పీతాంబరాన్ని కప్పి, పాద పీఠానికి నగిషీలు చెక్కుతున్నాడు.

పూర్ణయ్య మేలిముసుగు కప్పివున్న విగ్రహానికి చేరువగా వెళ్ళి నిలబడినా ఒక నిముషందాకా తన పనిలో నిమగ్నమైపోయిన విష్ణుశర్మ పూర్ణయ్యను గమనించలేదు.

"నమస్కారం శిల్పాచార్యా!" అని పలకరించారు పూర్ణయ్య విష్ణుశర్మను.

"నమస్కారం. ఏమిటిలా వచ్చారు?" అన్నాడు నవ్వుతూ విష్ణుశర్మ.

"వచ్చింది స్వామి మూర్తిని కళ్లారా చూద్దామని. కానీ మీరు మేలిముసుగు

మాటున స్వామిని దాచేశారు" అన్నారు పూర్ణయ్య.

"నేత్రాలు దిద్దిన తరువాత పునః ప్రతిష్ఠ జరిగేదాకా ఎవరికంటా పడనివ్వకుండా చూడడం శిల్ప సాంప్రదాయం కదా!"

"నిత్యం స్వామి సన్నిధిలోనే సేవలు చేసుకొని తరించేవాడిని. స్వామి నా కంట కూడా పడకూడదా?"

"ప్రతిష్ఠ జరిగేదాకా యెంత తీర్చిదిద్దిన మూర్తిఅయినా రాయే కదా. ప్రతిష్ఠ జరిగేక రాయి కూడా స్వామే కదా! అన్నీ తెలిసిన వారు, నరుడి కంట పడితే నల్లరాయి కూడా పగులుతుందంటారు. అందుకని మేలి ముసుగు కప్పక తప్పలేదు," అన్నారు విష్ణుశర్మ.

ఆ మాటకు పూర్ణయ్య మనసు కాస్త నొచ్చుకుంది కానీ, తమాయించుకొని "శిల్పాచార్యా! స్వామి రూపు రేఖలు దిద్దేవారు మీరు, ఆ రూపాన్ని అనుక్షణం కొలిచేవాడిని నేను. మనిద్దరం నరులమే కదా!" అన్నారు వ్యగ్యంగా పూర్ణయ్య.

ఆలయ ప్రాంగణం నలుమూలలా తిరిగి పునఃప్రతిష్ఠకు జరిగిన యేర్పాట్లనూ, జరగవలసిన యేర్పాట్లనూ చూసుకొని ఆ క్షణానికి అక్కడికి చేరిన కృష్ణమరాయడు విష్ణుశర్మనూ, పూర్ణయ్యనూ చూసి నమస్కరించాడు.

"ఏమిటీ? పెద్దలిద్దరూ చర్చలో పడ్డారు." అని నవ్వుతూ అడిగాడు.

"సాధారణంగా యిద్దరు పెద్దలు కలిసినప్పుడు వచ్చే చర్చే కృష్ణమరాయా!" అన్నారు విష్ణుశర్మ సుత్తి, ఉలి, శానం ప్రక్కన పెడుతూ.

మేలి ముసుగు కప్పివున్న విగ్రహాన్ని పరికించి, "స్వామిని కళ్ళారా దర్శించాలనివస్తే మేలిముసుగు కప్పేరేమిటి?" అన్నాడు కృష్ణమరాయడు.

"అదే మాట నేనూ అడిగాను," అని పూర్ణయ్య వంత పాడారు.

"ప్రతిష్ఠ జరిగేదాకా మూర్తి నరుల కంట పడకూడదని మేలి ముసుగు కప్పాల్సి వచ్చింది. స్వామిని వంశపారంపర్యంగా మీ మనోమందిరాలలోనే ప్రతిష్ఠించుకున్న పుణ్యవంశం మీది. మీ కేదేముంది బాబూ? తిలకించు." అని మేలి ముసుగు తొలగించారు విష్ణుశర్మ.

ఆ మూర్తి అపురూప సౌందర్యానికీ, విష్ణుశర్మ శిల్పకళా నైపుణ్యానికీ కృష్ణమరాయడూ, పూర్ణయ్య క్షణంపాటు ముగ్ధులై స్థాణువులుగా నిలబడిపోయారు. తేరుకొని "భేష్! ఇంతటి కళా నైపుణ్యాన్ని యీ మూర్తిలో పదిలపరిచి కలకాలం స్వామితోపాటు కలిసిపోయే మీరూ ఈ మూర్తిని తిలకించిన నేనూ, ధన్యులం విష్ణుశర్మా! స్వామిని ద్వారక నుంచి తెచ్చి మాధవగిరి ఆలయ గర్భగుడిలో కొలువు తీర్చించిన ఘనత మీకే దక్కింది. మా ముత్తాతగారి కాలంలో

మీ తాతగారు యిప్పుడు ఆలయంలో వున్న విగ్రహాన్ని చెక్కారట. ఈనాడు నా కాలంలో మీరు తీర్పు దిద్దారు. మీకు సర్వదా కృతజ్ఞుడిని," అన్నాడు కృష్ణమ రాయడు భక్తి వినయాలతో.

"నేను ధన్యుడివి కృష్ణమరాయా!" అని బదులు పలికాడు విష్ణుశర్మ.

"ఇంతకీ విగ్రహం సిద్ధమైనట్టేనా?"

"సిద్ధమే. ముహూర్తపు వేళకు పాద పీఠం దిద్దటం కూడా పూర్తవుతుంది."

"విగ్రహం సజీవ కళలతో నిండి వుంది కదూ!" అన్నాడు కృష్ణరాయడు పూర్ణయ్యతో.

"అందుకు సందేహమేముంది? కానీ ఒక్కటే నా అనుమానం," అన్నారు పూర్ణయ్య.

"అనుమానమా? ఏమిటది?" అన్నారు విష్ణుశర్మ.

"గ్రంథ చౌర్యం వుందని విన్నాం. ఈ విగ్రహం చూశాకశిల్పచౌర్యం కూడా వుంటుందా అన్నదే అనుమానం." అన్నారు పూర్ణయ్య.

"సూటిగా మాట్లాడండి పూర్ణయ్య గారూ!" అన్నారు విష్ణుశర్మ పూర్ణయ్య కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"కాస్త విపులంగా చెప్పరాదూ!" అన్నాడు కృష్ణమరాయడు పూర్ణయ్య నుద్దేశించి.

"ఏమీలేదు కృష్ణమరాయా! విష్ణు శర్మను కించపరచడం నా వుద్దేశ్యం కాదు. వారు మరే యితర శిల్పి శిల్ప చాతుర్యాన్ని అనుకరించనూలేదు. మన

దేవదాసీ వాడలో రాధ అని ఒక చక్కని చుక్క వుంది. పద్దెనిమిది వసంతాలు చూసిందో లేదో, ప్రతిరోజూ సూర్యోదయానికి ముందే ఆలయానికి వస్తుంది. స్వామిని దర్శించి వెడుతుంది. పుట్టింది దేవదాసీగానైనా నిష్ఠాగరిష్ఠురాలు, భాగవతోత్తమురాలు, అన్నిటికీ మించి సకల శాస్త్రాలు అధ్యయనం చేసి మేటి నర్తకి అని గురువులచేత మెప్పు పొందిన సకల కళా విశారద ఇంతవరకూ యే రసికుని ముందూ గజె కట్టి ఆడి యెరుగదు ఆమె పోలికలే స్వామి ముఖారవిందంలో కొట్టొచ్చినట్టు కనబడ్డంచేత శిల్పచౌర్యం అన్న మాట నా మనసులో మెదిలింది. దాచుకోలేక అన్నాను. సృష్టికర్త శిల్ప చాతుర్యాన్ని విష్ణుశర్మ అనుకరించి వుంటారనే నా వుద్దేశ్యం కానీ, మరో శిల్పి శిల్పచాతుర్యాన్ని కాదు," అని వివరించారు పూర్ణయ్య.

"అంతటి అందగత్తా ఆ రాధ? మీరూ చూశారా విష్ణుశర్మా?" అని అడిగాడు కృష్ణమరాయడు.

చూశానేమో, నాకు గుర్తులేదు. ఆ రాధ రూపురేఖలే ఈ మూర్తిలో ప్రతిబింబిస్తే నిజంగా ఆమె రాధే అయి ఉండాలి. రాధాకృష్ణుల తనువులు వేరు కానీ వాటిని వేరు చేయగలిగిన దెవరూ, వేరుగా వూహించడమెలా?" అన్నారు విష్ణుశర్మ.

"అయితే ఆ రాధను ఒకసారి చూడాలి," అన్నాడు కృష్ణమరాయడు.

"తినబోతూ రుచి అడగడం దేనికి కృష్ణమరాయా? రేపు విగ్రహ పునః ప్రతిష్ఠ జరగగానే స్వామి సన్నిధిలో, విందు సభముందు తొలిసారిగా గజ్జె కట్టబోతోంది రాధ, అందరం చూదొచ్చు," అన్నారు పూర్ణయ్య.

## 4

గుడి కోనేరునుంచే ఆ వూరివారు మంచి నీళ్ళు తీసుకు వెళతారు. ఆ సాయంత్రం కోనేటికి బిందెలు చంకన పెట్టుకొని మధ్యతరగతి స్త్రీలు, కడవలు చంకన పెట్టుకొని పనిపాటులు చేసుకునే స్త్రీలు మంచినీటికి వచ్చారు, నీలాటి రేవులో ఆ కబురూ, యీ కబురూ చెప్పుకుంటూ బిందెలు తోముకుంటున్నారు యిద్దరు పడుచులు. సూర్యాస్తమయ మయింది. వెలుతురు మసగ ముసుగు కప్పుకుంటోంది. దశమి చంద్రుడు వింగిలో తొంగి చూశాడు. వింగి నుంచి తొంగిచూసిన చంద్రుడు కొలనులో కలువల మధ్య కొలువు తీరాడు.

బిందె కడుక్కొని, కోనేటిలో ముంచుతూ "ఆ చంద్రబింబం యెంత అందంగా వుందో చూడు," అంది ఒక పడుచు తన తోటి పడుచుతో.

"సరేలే! ఆ చంద్రబింబాన్ని చూసి అంత మురిసిపోతున్నావు కానీ, దేవదాసీ వాడలో రాధ అని ఒక నర్తకి వుందట. ఆమె ముఖ బింబం ముందు కోటి

చంద్ర బింబాలు సరితూగవట," అంది రెండవ పడుచు.

"దేవదాసి అందాన్ని అంతగా పొగడకు గుడి చేటియల అందం గుడికి సింగారం కావచ్చుకానీ వూరి యిల్లాళ్ళకి విషం అంటారు," అంది మొదటి పడుచు

"సామెతల కేమొచ్చెలే ? అదది మెచ్చదే ఆవద మంటారు మా అత్త గారు చెబుతూ వుంటుంది ఆ రాధ అందం గురించి" అంది రెండవ పడుచు

"మీ అత్తగారు చెప్పినంత మాత్రాన నిజం అని నమ్మనక్కరలేదు. రేపు ఆలయంలో రాధ నృత్యం వుందట ఆమె అందాన్ని అందరూ చూస్తారు," అని బిందె చంకనెత్తుకుంది మొదటి పడుచు.

అలా యిద్దరూ కబుర్లు చెప్పుకుంటూ యెవరి యిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

## 5

తూర్పుదిగంతం నీలాల వెలుగుల్లోంచి అరుణాగమన కారణంగా అప్పుడే కెంపులు దిద్దుకుంటోంది. వేణు గోపాలుని పునః ప్రతిష్ఠ ఉత్సవాన్ని తిలకించడానికి వస్తున్న రాజ బంధువులా సూర్య భగవానుడు కొత్త ముస్తాబులు దిద్దుకొని ఉదయించాడు. చుట్టు పక్కల గ్రామాల నుంచి చాలా మంది భక్తులు వచ్చారు, యింకా వస్తున్నారు. సత్రం, ఆలయ ప్రాంగాణము జనంతో కిటకిట

లాడుతోంది చలువ పందిళ్ళకు వాంది నీలు కప్పి రంగు రంగుల కాగితపు బుట్టలతోనూ, పచ్చటి మామిడి తోర ణాల తోనూ అలంకరించారు. స్త్రీ పురు షులు యెంతో హడావిడిగా ప్రతి వొక్కరూ తమ యింట్లో పెళ్ళి అన్నట్టు యిటూ అటూ పందిళ్ళలో తిరుగు తున్నారు. గాడి పొయ్యి ప్రాంతంలో పోపుల వాసన గుబాళిస్తోంది. గర్భగుడి ప్రాంతంలో సుగంధ పరిమళాలు నలు దిశలా విరజిమ్ముతున్నాయి. ఆలయం ఆలయ ప్రాంగణం వేదమంత్రాల ఘోషలో ప్రతిధ్వనిస్తున్నాయి.

కృష్ణమరాయుడు చుట్టు జరీపల్చుకో ధోవతి ధరించి, పైన మిసమిసలాడే తెల్లటి పట్టు లాల్చీ వేసుకున్నాడు. భుజం మీద ఖరీదైన జరీ కండువా ఠీవిగా వేలాడుతోంది. అతని మెడలో పచ్చలు పొదవిన పులిగోరు పతకం అతని వంశ ప్రతిష్ఠను చాటుతూ అతని కదలికలకు అనుగుణంగా వూగిసలాడు తోంది. ఆ ప్రాంగణంలో యెటు చూసినా అతనే కనబడుతూ పనులు పురమా యిస్తున్నాడు వచ్చిన భక్తులందరూ ఓ కంటితో స్వామి విగ్రహాన్ని, మరో కంటితో కృష్ణమరాయని చూస్తున్నారు.

## 6

రాధ తన యింటిలో తన చెలికత్తెల చేత పాదాలకు పారాణి దిద్దించుకుం టోంది. హాలులో నృత్యానికి కావలసిన నటవంగం పలికే గురువు, యితర హంగుదారులు తమతమ వాయిద్యాలతో సంసిద్ధంగా వున్నారు పదేళ్ళనుంచి తాను చేర్చుకున్న విద్యను స్వామిముందు కొన్ని నిముషాల్లో ప్రదర్శించబోతుంది. స్వామి సన్నిధి, ఆలయ ప్రాంగణం, చుట్టూ సభ, సభలో పండిత పామరులు– అంతా ఆమె కళ్ళకు కట్టిగా వుంది. ఒక ప్రక్క యేదో బెరుకు. మరో ప్రక్క యేదో ఆనందం. రాధ తల్లి పుష్పావతి బ్రహ్మముడి చుట్టుకుని, తలవిండా మల్లె పువ్వులు పెట్టుకొని' ముస్తాబు సడలి పోకుండా సభ కంట పడాలన్న ఆరా టంతో రాధ గదిలోకి వచ్చి, "ఏమిటే యింకా ఆలస్యం? చీర కట్టేసరికి వూరు మాటు మణిగింది అన్నట్టు నీ సింగారం పూర్తయ్యేసరికి సభకు విసుగెత్తి లేచి పోయ్యేలాలా వున్నారు. త్వరగా తెములు, అని హెచ్చరించింది రాధను.

"పారాణి దిద్దుతున్నారమ్మా! త్వరగా కానీయవే సంపంగి!" అంది రాధ.

"అంత తొందరైతే యెలా? వంకర టింకరగా పెడితే నువ్వే తిడతావు మళ్ళీ," అంది సంపంగి రాధ పాదాల మించి చూపులు మరల్చకుండానే.

"దాని చేతి కివ్వావా పాదాలు. అది పాదాలకు పారాణి దిద్దేసరికి పొద్దు పడ మటికి వాలిపోతుంది. మా వయసులో యిలానా? వాకిటికి సరసుడు వచ్చేదనే


దివ్యమైన
తెలుపు
డెట్ యొక్క
తెలుపు
క్రొత్త ఫార్ములా
డెట్
డిటర్జెంట్ ఉతికే పౌడర్
det
det
సాటిలేని వుతుకు శక్తి, అదనపు నురుగు,
తాజా సువాసన మరియు దివ్యమైన తెలుపు!

వరికి చిటికలో తయారయ్యేవాళ్ళం. సభ యెదురుచూస్తోందన్నా లెక్కలేదు నీకు త్వరగా తెములు, మేనా సిద్ధంగా ఉంది." అని రాధనూ సంపంగినీ తొందరపెట్టి బయటకు వెళ్ళింది పుష్పావతి.

రాధ ముస్తాబై ఒక పక్క సంపంగి, మరో పక్క చంద్రిక తోడురాగా వయ్యారంగా మేడమెట్లు దిగి హాలు లోకి వచ్చింది. హాలులో వున్న నటరాజ విగ్రహానికి నమస్కరించి బయటకు నడిచింది ఆమె ముఖంలో తొలిసారి గజ్జె కట్టి స్వామిముందు నృత్యం చేయడానికి వెడుతున్న ఆనందంకంటే యేవో సిగ్గు దొంతరలు స్వామినే కలవడానికి వెళ్ళే నవ వధువులా ఆమెను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి

ఇద్దరు చెలికత్తెలతోటే రాధ మేనా యెక్కింది. ముందు మేనమామ భీముడు విందుగా నడుస్తున్నాడు. మేనా వెనక మైసూరు గిత్తలను కట్టిన సవారిబండిలో రాధతల్లి పుష్పావతి, రాధకు నృత్యం నేర్పిన నాట్యాచార్యుడు, యితర వాయిద్యాలు బయలుదేరాయి.

7

స్వామివారికి అభిముఖంగా వున్న విశాలమైన మండపంలో రాధ నృత్యానికి కావలసిన యేర్పాట్లన్నీ జరిగాయి. రాధ రాకకై సభ నిరీక్షిస్తోంది. సభకు ముందు ఒక తివాచీమీద కృష్ణమరాయడు, విష్ణుశర్మ, పూర్ణయ్య, పక్కవూరి జమీందారు వీరేంద్రరావు కూర్చున్నారు. వీరేంద్రరావు ఆ ప్రాంతానికి పెద్ద రసికుడని పేరు. జమీందారులకు సహజంగా వుండవలసిన అన్ని వ్యసనాలనూ ఉగ్గూ, పాలూ పోసి పెంచుకుంటూన్న మనిషి వారికి కొ త్త యెడంగా మరో తివాచీమీద ఎభై యేళ్ళ పైబడ్డ రాజా జగపతిరావు సకుటుంబంగా కూర్చున్నారు. వారి వెనక గ్రామంలోని పెద్దలు ఆసీనులై వున్నారు. వీరందరి వెనకా సభ. వీరి కభిముఖంగా నృత్యానికి అవసరమైన నృత్యాచార్యులకు, యితరులకు మరో రెండు తివాచీలు పరచి వున్నాయి. నృత్యం చేయవలసిన స్థలం రంగురంగుల ముగ్గులతో అలంకరించబడి వుంది.

రాధ ఉత్తర గోపురం దగ్గరే మేనా దిగి, ఆలయ ప్రాంగణంలోకి అడుగు పెట్టింది జనంలో కలకలం బయలు దేరింది. మేలిముసుగు వేసుకొని వయ్యారంగా సభాస్థలికి కదలి వస్తున్న రాధను సభలోని జనం చూడాలన్న కుతూహలంతో నిలబడి తోసుకు తోసుకు చూస్తున్నారు.

ధ్వజస్తంభానికి చేరువయ్యేదాకా రాధ సభముంగిట కూర్చున్న కృష్ణమరాయలకు, యితర ముఖ్య అతిథులకు అగుపించలేదు. రాధ, నాట్యాచార్యుల వెంట యితర వాయిద్యకారులు, సంపంగి, చంద్రిక, పుష్పావతి, భీముడు

సభాస్థలికి చేరి ఆసీనులయ్యారు. పుష్పా వతి పభలోని పెద్దలకు సభాస్థలికి చేర గానే నమస్కరించింది

రాధ గురువుకు నమస్కరించి సభకు వందనం చెప్పి గజ్జె కట్టింది. ప్రార్థన పూర్తి అయింది.

చక్కటి జావళీ యెత్తుకుంది రాధ అభినయానికీ, పద విన్యాసానికీ సభ పులకించిపోయింది. పండితులు 'భేష్' అంటున్నారు. వీరేంద్రరావు మనస్సు పిచ్చి పిచ్చి వూహలతో ఉక్కిరిబిక్కిరై పోతోంది.

ఇన్నాళ్ళూ స్వామి నే మనసులో నిలుపుకొని నృత్యాన్ని నేర్చుకున్న రాధ తన నృత్యాన్ని అభినందిస్తూ "భేష్!" అని కృష్ణమరాయడు అన్నప్పుడు అతని వైపు చూసింది. చూపులు కలిశాయి. మనసు కాస్త చలించింది. మరుక్షణమే స్వామిమీద లగ్నంచేసి నృత్యం చేయ సాగింది. స్వామిలోనూ కృష్ణమరాయడే కనిపించాడు.

గాలికి కదిలే మందిరాల్లా కదులుతున్న పారాణి పాదాలనే కృష్ణమరాయడు రెప్ప అర్పకుండా చూస్తున్నాడు.

"ఆ పాదాలకు దిద్దుకున్న పారాణి కెంపులు పొదవినట్లుంది కదూ!" అన్నాడు తన పక్కనే కూర్చున్న విష్ణుశర్మతో కృష్ణమరాయడు.

"గానానికి నాదం, నృత్యానికి పాద మేగా ప్రాణం! పాదాలకి పారాణి దిద్దు కోక, తెలియకపోతే యిహ నర్తకేమిటి కృష్ణమరాయా?" అన్నారు విష్ణుశర్మ.

"ఔను" నన్నట్లు తలపంకించి నవ్వారు పూర్ణయ్య

అనుకోకుండా రాధ కృష్ణమరాయని ముఖంలోకి చూసింది. "ఒక్క మురళీ లేదు కానీ కృష్ణమరాయడు నిజంగా కృష్ణుడే," అనుకుంది. తన చపలత్వాన్ని పంబాళించుకొని మనసు స్వామిమీద లగ్నం చేయడానికి ప్రయత్నించింది మళ్ళీ. అలా వూయల లూగే మనసు తోటే పభను వూయల లూపుతూ నృత్యం ముగించింది వీరేంద్రరావు "భేష్ భేష్!" అని అరుస్తూ నోట్లకట్టలు ఆమె మీదకు చల్లాడు. ఆమె చలించలేదు ఆ అభి నందన ఆమెకు నచ్చనట్లు ఆమె ముఖ కవళికలే చెబుతున్నాయి.

కృష్ణమరాయడు తన స్థానంనుంచి లేచి ఆమెకు చేరువగా వెళ్ళి తన మెడ లోని పచ్చల పులిగోరు పతకాన్ని ఆమె మెడలో వేశాడు. ఆ పతకాన్ని హృద యానికి హత్తుకొని క్షణంపాటు తన్మ యత్వంలో వుండిపోయింది రాధ.

"నీలాంటి నర్తకి మా గ్రామంలో వుండడం మా గ్రామానికే గౌరవం," అని అభినందించాడు కృష్ణమరాయడు.

ఇదే సమయంలో వీరేంద్రరావు పుష్పావతితో యేదో చెవులు కొరుకు తున్నాడు.

రాధా, ఆమె వెంట వచ్చినవారూ

# మంగళకరమైన వెన్నెల మోమును మెరుగు పరచటానికి



## ఐటెక్స్
## డీలక్స్ కుంకుమ

దేశమంతటా నాగరీక యువతులు కోరి ధరించేది ఐటెక్స్ కుంకుమ నారీమణుల వృష్ప విధానాన్ని అద్భుత సౌందర్యాన్ని ప్రస్ఫుటం చేసేటందుకే 14 కన్నుల కింపైన రంగులలో దొరుకుచున్నవి. శాస్త్రీయ విధానంలో తయారుచేయుబడు ఐటెక్స్ కుంకుమ చర్మానికి ఎటువంటి హానియు కలుగజేయదు.

**ఐటెక్స్** 38 సంవత్సరములుగ మీ నమ్మకానికి పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు 600033




Imageads-AL 1240 Tel

లేచి బయలుదేరారు. రాధ కృష్ణమ రాయడు తన మెడలో వేసిన పులిగోరు పతకాన్ని అరచేతిలో హృదయానికి అదిమిపట్టుకునే నడిచింది. ధ్వజ స్తంభం దాకా నడిచి వుండబట్టలేక వెనక్కు తిరిగి కృష్ణమరాయని చూసింది. తననే చూస్తున్న రాయని చూపులతో ఆమె చూపులు కలిశాయి. గోపురందాకా వచ్చి మేనా యెక్కుతూ మరొక్కసారి వెనక్కి తిరిగి చూసింది. కృష్ణమరాయడు తనని సాగనంపడానికి తన వెనకే వచ్చి నందుకు చూపులతోటే కృతజ్ఞతలు చెప్పుకుంది.

మేనా కదిలింది

దూరమయింది.

రాయల రూపు కళ్ళముందు నుంచి దూరమై రాధ మనసులో కొలువుతీరింది.

## 8

పున్నమిరేయి. పాల వానలాంటి వెన్నెల. ఆడుతూ పాడుతూ పొలాల నుంచి పనివాళ్ళు యిళ్ళకు చేరుకుంటు న్నారు కొండయ్య గొడ్లశాలలో పశు వులకు రాత్రికి సరిపడా గడ్డివేసి సిమెంటు గోళాల్లో నీరు వుందో లేదో చూశాడు.

పార్వతమ్మ కృష్ణమరాయనికి భోజనం వడ్డిస్తోంది వెండి పళ్ళెంలో పాలు, అన్నం కలుపుకున్నాడు కృష్ణమరాయడు ఒక ముద్ద నోట పెట్టుకున్నాడు. నమిలి మింగడం మానేసి తన ముందున్న వెండి పళ్ళెంలోని పాలల్లోకే చూస్తూ వుండి పోయాడు.

పార్వతమ్మ తన కొడుకు కృష్ణమ రాయని పరధ్యానాన్ని గమనించింది. క్షణంపాటు ఆమె కూడా మౌనంగా వుండిపోయింది కొడుకునే చూస్తూ. ఇహ వుండబట్టలేక "ఏమిటి బాబూ అంత పరధ్యానం? ఏకాదశి నాడు పునః ప్రతిష్ఠ యెంతో వైభవంగా జరిగి పోయింది అందరి చేతా భేషనిపించు కున్నావు ఈ వేళప్పుడే పౌర్ణమి. తల పెట్టిన కార్యం అయిపోయి నాలుగు రోజులు గడిచేక కూడా యింకా పర ధ్యానమేనా నాయనా? మీ నాన్నగారూ యింతే. ఏదైనా పుణ్యకార్యం తల పెడితే ముందు పదిరోజులూ, తరవాత పదిరోజులూ మనిషి మనిషిగా వుండే వారు కాదూ, మనసు మనసులో వుండేదీ కాదు," అంది పార్వతమ్మ.

కృష్ణమరాయడు సిగ్గుపడి "లేదమ్మా! ఏదో ఆలోచిస్తూ వుండిపోయాను," అని తిరిగి భోజనంచేయడం ప్రారం భించాడు. తాను అలా యెందుకు వుంటు న్నాడో తల్లికి చెప్పలేకపోయాడు.

పాలూ అన్నం కలుపుకొని నోట ముద్ద పెట్టుకోగానే పళ్ళెంలోని పాలలో రాధ రూపమే అగుపించింది కృష్ణమ రాయనికి. ఆమె నృత్యం, ఆమె తన వైపు చూసిన చూపులూ, వెడుతూ వెడుతూ ధ్వజస్తంభం దగ్గర, గోపురం

# విజయవంతంగా పూర్తయిన శుభోదయం తొలి షెడ్యూల్

ది 28-6-80 న ప్రఖ్యాత దర్శకులు శ్రీ కె విశ్వనాథ్ గారి అసామాన్య దర్శకత్వంలో ప్రారంభమైంది శ్రీరామ్ ఆర్ట్ ఎక్సర్స్ పతాకం క్రింద శ్రీ వి హెచ్ నరసింహారావు నిర్మిస్తున్న శుభోదయం వర్ణచిత్రం షూటింగ్ అబిడ్స్ సెంటర్ లోని హారే రామ్ హరే కృష్ణ మందిరంలో ప్రారంభమైన షూటింగ్ బేగంపేట కాంతినగర్ బంగారా హాల్స్ తదితర హైదరాబాద్ ముఖ్య కేంద్రాలలో దాదాపు నెల రోజుల పాటు నిర్విరామంగా జరిగింది మూడొంతులపైగా చిత్రం పూర్తయింది

అగస్టు 5వ తేదీనుండి 15వ తేదీ వరకు శ్రీ కాళహస్తిలో జరుగబోయే రెండవ షెడ్యూల్‌లో చిత్రం పూర్తవుతుందని మిగిలిన ఒక పాట మరికొన్ని దృశ్యాలు యీ షెడ్యూల్‌లో చిత్రీకరించబడతాయని దర్శకులు శ్రీ విశ్వనాథ్ నిర్మాత శ్రీ నరసింహారావు చెప్పారు



దగ్గర ఆమె కళ్ళు చెప్పిన ఊసులూ, ఆ ఊసులలోని బాసలూ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. చెయ్యి కడుక్కొని మేడమీద తన గదికి వెళ్ళాడు. తమలపాకు తీసుకొని, సున్నం రాసి, మడిచి ఈను చింపబోయాడు. ఆ ఆకులో కూడా రాధ రూపే అగుపించ డంతో చించలేక చూస్తూ వుండి పోయాడు. తీయని వూహ లు మనసును వూపిరాడనీయక పోవడంతో పై పంచె భుజాన వేసుకొని ఆలయంవైపు బయలు దేరాడు. ఆలయానికి చేరుకొని స్వామి కెదురుగా నిలబడ్డాడు. రాధ నృత్యం చేసిన మండపాన్ని కలయచూశాడు ఏ స్తంభంలో చూసినా, ఏ గోడలో చూసినా, ఏ శైగంటలో చూసినా, జ్యోతిలో చూసినా, చివరికి స్వామిలో చూసినా రాధే 'జగమే రాధమయం' అనిపించింద తనికి.

అక్కడనుంచి కోనెల తోటవైపు నడిచాడు తోటలోని పూల పరిమళాలూ, పండు వెన్నెలా అతనికీ, అతని మన సుకూ పూరట కలిగించడానికి బదులు మరింత గిలిగింతలు పెట్టాయి. వెన్నెల వేడిమి భరించలేక కోనేటి తీరంవైపు నడిచాడు

## 9

రాధ, చెలికత్తె చంద్రిక కోనేటి చివరి పావంచామీద కూర్చున్నారు. పాదాలకు చిరుగాలికి లేచిన చిన్నారి కెరటాలు తాకి వెవక్కి పోతున్నాయి. వెన్నెల కాంతులు కొలనులోని కెరటా లకు వెండి పూతను పూస్తున్నాయి. కలువల మధ్య చంద్రుడు ప్రశాంతంగా ప్రతిబింబిస్తున్నాడు. రాధ వెచ్చటి నిట్టూర్పులకు కొలను, చుట్టూవున్న గాలి, చల్లని వెన్నెలా కూడా గ్రీష్మ పీడిత లవుతున్నాయి.

ఒక్కసారి బరువుగా నిట్టూర్చి "ఆ ఏకాదశినాడు నిండు సభలో వారిని చూశాను తనువు యింటికి తరలి వచ్చిందే కానీ మనసు వారి పీడనే వుండిపోయింది. వారు గుర్తించారో లేదో," అంది రాధ చంద్రికతో.

"గుర్తించే వుంటచ్చమ్మా! గుర్తిస్తే మాత్రం నీ దగ్గరికివచ్చి వాలిపోవడానికి వారికి వీలా? అలయ ధర్మకర్త వూరికి పెద్ద, పైగా మునసబు. వీటి వెనక తరతరాలుగా వస్తున్న వంశ ప్రతిష్ఠ గాడికప్పిన మగవాడు జంకడు కానీ, నిష్టగా బతికేవాడు యెవడు మాత్రం తెగించి మన వాడకు రాగలడు!" అంది చంద్రిక.

"అయితే వారి ధ్యానంలోనే అలసి పోయి, దర్శనానికి నోచుకోకుండానే యీ తనువు రాలిపోతుందంటావా?"

"అంతంత మాట లెందుకు రాధా! అలయానికి వెళ్ళి కృష్ణమరాయలుగారు యేవేళకు అలయానికి వస్తారని పూర్ణయ్య

గారి నడిగి తెలుసుకొని ఆవేళకు నువ్వు హాజరయితే సరిపోలా?"

"అమ్మో! నోరు తెరిచి పూజారి గారిని అంతమాట అడగడమే?!"

"నువ్వు సిగ్గు విడవలేవు, వారు పరువు వదలలేరు. ఇంకేమిటి దారి?"

"దారి చూపమనే విన్ను బతిమాలు కుంటున్నాను"

"నావల్ల కాదేమో! అంతటి విష్టా గరిష్ఠుని పొందేదానివి నువ్వే అయినా దారి తప్పించిన దానివి నేనని వూరూ వాడా కోడై కూస్తుంది. ఏదారి నువ్వే వెతుక్కోవడం మంచిది"

"ఇంతేనటే స్నేహమంటేను?"

"నీ స్నేహం నాకు ప్రాణమే రాధా! మొహమాటానికిపోతే యేదో అయినట్టు స్నేహానికిపోయి అంతటి పెద్దమనిషిని కదిపితే యేం కొంప మునుగుతుందోనని భయం," అంటూ చేతికి అందుబాటులో వున్న కోనేటిలోని నీటిని మునివేళ్ళతో కలిచింది చంద్రిక.

"అబ్బ! ఏమిటే అది? అందాన్ని చూసి వోర్వలేవా? లేక ప్రశాంతతను భరించలేవా? నిర్మలమైన కోనేటిలో నిండు పున్నమి చంద్రుడు ప్రశాంతంగా కొలువు తీరివుంటే నీళ్ళు కలిచి కలత రేపుతావెందుకే?" అంది రాధ.

"ఆ చంద్రునిలో ప్రశాంతత నీకు కనిపిస్తోందేమో కాని నాకు చపలత్వమే కనిస్తోంది. నింగిలోని తారల సాంగత్యం మొహంమొత్తి కొలనులోని కలువభామల పొందుకు పాకులాడుతున్నట్టున్నాడు."

"ఇంకా నయం! నీకోసం దిగి వచ్చాడన్నావు కాదు," అంది రాధ పరధ్యానంగా యెటో చూస్తూ.

కలువల మధ్య, కొలనులో ప్రతిబింబిస్తున్న చంద్రుడినే చూస్తున్న చంద్రిక చటుక్కున—

"రాధా! రాధా! కొలనులో మరో చంద్రుడు వెలిశాడే! చూడు చూడు!" అని తొందరచేసింది.

"మరో చంద్రుడా?" అంటూ రాధ కొలనులోని చంద్రునివైపు చూసింది.

చంద్ర ప్రతిబింబం పక్కన కృష్ణమ రాయని ముఖ ప్రతిబింబం అగుపించింది రాధకు. ఆ ప్రతిబింబ దర్శనానికి రాధ తనువు శృతిచేసిన వీణను మలయ మారుతం మీటినట్టు అయింది.

క్షణంపాటు ఆమెలో చలనంలేదు. తాను వూపిరి పీలుస్తోందో లేదో ఆమెకు తెలీదు. అది కలయో, మెళకువలో కల్లయో లేక కలలో నిజమో తెలియని స్థితిలో వుండిపోయింది. అది కోటి తపస్సుల పుణ్యఫలం కళ్ళముందు సాక్షాత్కరిస్తే తపస్వికి పొందే తీయని అనుభూతి

అంతటి తీయని అవస్థలో కల-నిజముల డోలికలో వూయలలూగుతున్న రాధను, చంద్రిక "రాధా! రాధా! వారి ప్రతిబింబం చూపే అంత తన్మయత్వం

ఇప్పుడు! హాయిగా సేవించండి సంతృప్తి నిచ్చే చిక్కని, కమ్మని టీ!

# లిప్టన్ టాప్ స్టార్ టీ

చిక్కని కమ్మని టీ కోసం నిజంగా
మీరు ఎదురుచూస్తున్నారు అదే
క్రొత్త లిప్టన్ టాప్ స్టార్. అత్యుత్తమ
మైన మంచి ఎగుమతి రకం డస్ట్
టీ రకాలను మేళవించి చిక్కటి
కమ్మని టీ కోసం చూచే మీలాంటి
వారి కోసమే యీ టీ. నేడే లిప్టన్
టాప్ స్టార్ కావాలని అడగండి.
పూర్తిగా ఫాయిల్ లోనే ప్యాక్
చేసారు గనుక తాజాగా,
చిక్కగా, కమ్మగా మీరు
కోరినట్టు వుంటుంది.




లింటాస్-LTS. P L-1710 TL

ఏమిటే? కోనేటి పైమెట్టుమీద నిన్నే చూస్తూ వారు నిలబడ్డారు. నీ చూపులకు నిరీక్షిస్తున్నారు. అడుగు మెట్టుమీద వున్నదానివి. లేచి రెండు మెట్లు పైకెక్కు. లేకపోతే నిర్లక్ష్యం చేసేవని అగ్రహించి వెళ్ళిపోయినా వెళ్ళిపోగలరు," అని రాధచెవిలో గుసగుసలాడుతూ జబ్బపట్టుకొని కుదిపింది.

రాధ ఉలికిపడింది. తీయని కలలోంచి అంతకు మించిన మధురమైన మెళకువలోకి వచ్చింది.

"అవునే! ఇప్పుడెలా? వారు కళ్ళ ముందు కనిపించనంతసేపూ ఎప్పుడు కనిపిస్తారా? యెక్కడ కనిపిస్తారా? అని కళ్ళలో వత్తులు వేసుకొని మనసును చమురుగాపోసి నిరీక్షించాను. తీరా కళ్ళ ముందు నిలదితే గుదె గొంతులో కొట్టుకుంటోంది. కాళ్ళు నే చెప్పినట్టు వినడం లేదు. తనువు తన్మయత్వంతో గాలిలో తేలిపోతోంది" అంది రాధ చంద్రికతో.

పైమెట్టుమీద నిలబడిన కృష్ణమరాయని కన్నెత్తికూడా చూడకుండా కొత్త పెళ్ళికూతురులా నేంచూపులే చూస్తోంది రాధ.

"క్రీగంటనైనా పలకరించవే. అయ్యో! అప్పుడే వారు రెండు మెట్లు దిగారు. నువ్వు ఒక్క మెట్టైనా యెక్కు" అంది చంద్రిక.

"అడుగులు తడబడుతున్నాయే. నువ్వు కాస్త అసరాగా నాకు దగ్గరగా నిలబడు," అంటూ రాధ చంద్రిక భుజం మీద చెయ్యివేసి ఒక్క పావంచా యెక్కింది.

"నిన్ను కలవాలని నేనొస్తే, నన్ను కాదని చెలితో ఆ గుసగుసలేమిటే?" అన్నాడు కృష్ణమరాయుడు నవ్వుతూ.

"ఆ మాటే నేనూ అంటున్నానండీ. మీరు కనిపించనంతసేపూ మిమ్మల్ని యెలా చూడాలా? ఎక్కడ చూడాలా? అని తపించిపోయింది. అలయంలో నృత్యంచేసిన నాటినుంచీ నీరుకూడా ముట్టలేదు. కలలోనూ, మెళకువలోనూ కూడా మీ ధ్యాస, మీ ధ్యానమే" అంది చంద్రిక.

"అందుకేనా నేను వచ్చి యింతసేపైనా కన్నెత్తి చూడలేదు, పెదవి విప్పి పలకరించలేదు?" అన్నాడు కృష్ణమరాయుడు.

"సమాధానం చెప్పు," అంటూ చంద్రిక రాధను మోచేతితో మృదువుగా పొడిచింది.

(సశేషం)

Printed and Published by A Chandra Seker Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor A SUDHAKARA RAO

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం— క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.

దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే రుజువు చేసుకోండి:

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది




సూపర్ రిన్‌లో
తెలుపు చేసే శక్తి ఎక్కువ




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:


మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.


కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా తోముకుంటే హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.


ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయం నుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా మింట్ రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.

నోటి దుర్వాసనను ఆపండి...
కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
దంతక్షయాన్ని
ఎదుర్కోండి!




DC.G.74 TL

